ఓం

ఓం

శ్రీ గురుభ్యోనమః

# పరిపూర్ణ రాజయోగీయ తత్వబోధిని

రచయిత :

అచల పరిపూర్ణ బోధనాచార్య - మధురకవి

**అమలానంద పాలవాయి పాటల పంఢరీనాథ్**

గద్వాల - 509 125

ఫోన్ : 271009



2005

వెల రూ.30-00

ప్రథమ ముద్రణ : 2005
ప్రతులు : 1000

గ్రంథములు వలయువారు :
**పొన్నాల అనసూయాంబగారు**
నెం. 4-1-96, పాతబోయిగూడ
సికింద్రాబాద్

**ద్రవ్యదాతలు :**
**మేడిపల్లి భీమయ్య గారు,** శ్రీరాంపూర్
**కాసెట్టి పోశయ్యగారు,** శ్రీరాంపూర్
**చునార్‌కార్ మల్లయ్య భార్య రాధాభాయి,** సిర్‌పూర్, కాగజ్‌నగర్

ముద్రణ :
**ఇ.బి.ఆర్. గ్రాఫిక్స్,**
ఎం.జి.రోడ్, సికింద్రాబాద్.

# సందేశము

శ్రీ మద్రామడుగు శివరామదీక్షిత అచలగురుపీఠ రాజయోగాశ్రమ సాంప్రదాయక పద్ధతి సనాతనమైనది. గురు సాంప్రదాయక పద్ధతిలో విస్తరణ జెందుతూ క్లిష్టమైన సిద్ధాంత బోధను వివరిస్తూ శివరామదీక్షితుల నుండి అచలర్షి దయానంద రాజయోగీంద్రులవరకు గ్రంధరచనలు జరిగినవి. సమకాలీన సాంప్రదాయకులకు, సాంప్రదాయేతరులకు నిర్దిష్టంగా విషయ సంగ్రహణ అగుటకు అమలానంద పాటల పండరీనాథ్ చేసిన ఈ కృషి ఆ కోవలోనిదే. చదువరులు, గురువుద్వారా విన్న విషయములను మననం చేసుకొనుటకు ఈ పుస్తకం లోని రచనలు ఉపయోగపడతాయి. చదివి కృతార్థులగుదురు గాక!

**సాందీపిని**

**శ్రీమదలచర్షి రామడుగు శివరామదీక్షితాచల**

**గురుపీఠాధిపతులు**

సికింద్రాబాద్

12-07-2005

# విషయసూచిక

# అంకితము

ఆ.వె.॥ నన్ను జేరదీసి నన్నింతవానిగా
తీర్చిదిద్దినట్టి ధీరుడతడు
శిష్యపోషకుండు శ్రీదయానందుండు
పొత్తమంకితంబు పూర్ణముగను॥

ఇట్లు
**రచయిత**

# గ్రంధరచనోద్దేశము

శ్రీ మదచలర్షి రామడుగు శివరామదీక్షితాచల గురుపీఠాధిపతులు మద్గురు వర్యులగు శ్రీ మదచలర్షి దయానంద పొన్నాల రాజయోగీంద్రులవారు 1953లో వారికరుణామృత దృష్టి గద్వాలలో అప్పటి పురపాలక సంఘాధ్యక్షులైన శ్రీ టి. నాగప్ప వకీలు గారి గృహమున నాపై బడినది. అప్పట్లో నాకు గురువంటేనే తెలియని స్థితి. శ్రీ వారు నన్ను చేరదీసి పండరీ నీవు వేదాంతివౌతావా అని అడిగిరి. పూర్వ జన్మ సుకృతమేమో! మారు మాటాడక వారి చరణము లాశ్రయించితిని.

శ్రీవార్లు పేరుకు తగినట్లుగానే వాత్సల్యముతో నన్నాదరించిరి. సికింద్రాబాదు నకు వెళ్ళినపుడు ఇంట్లోనే నాకన్నము పెట్టించి బోధజెప్పి రాకపోకల చార్జీలు కూడ యిచ్చెడివారు. 1958లో గద్వాలయందు ఉపపీఠము స్థాపింపబడెను. ఆషాఢ శుద్ధ సప్తమి నుండి పౌర్ణమి వరకు గద్వాల ఉపపీఠమందు ప్రతి సంవత్సరము ప్రబోధ చేసెడివారు. సుమారు 25 సం॥లు వారు క్రమపద్ధతిగా బోధ చేస్తూ వచ్చిరి. గద్వాల ప్రాంత పరిసర భక్తులకు పాఠక్రమము బోధించుమని నన్నాదేశించు చుండిరి.

అప్పటి కుటుంబ పరిస్థితుల వలన దూరప్రాంతములకు నేను వెళ్ళేవాడిని కాను. ప్రస్తుత పీఠాధిపతులైన శ్రీ మదచలర్షి దయానంద పొన్నాల సాందీపుల వారు వారి తండ్రిగారికి చెప్పుటచే మాతో శ్రీ అనసూయాంబగారి వెంట ఆంధ్ర ప్రాంతమునకు వెళ్ళు అదృష్టము నాకు లభించినది. 1975 నుండి మాతృశ్రీని సేవించు భాగ్యము నాకు కలుగజేసిన శ్రీ సాందీపుల వారికి నా కృతజ్ఞతలు తెలియజేయక తప్పదు.

ఎవరైనా మహబూబ్‌నగర్ జిల్లావారు శ్రీ వారి దగ్గరకు వెళ్ళితే వింటే బోధ నా దగ్గర వినండి లేకపోతే పండరి దగ్గర వినండి. మరెవ్వరి దగ్గర వినకండి అని చెప్పేవారు. అది వారి కృప.

పద్య రచనలో అభినివేశముండిన నన్ను పాటలు వ్రాయుటకై శ్రీ వారు ప్రోత్సహించిరి. అది మాని (1) "పరిపూర్ణ రాజయోగ తత్వ ప్రకాశిక"; (2) "పరిపూర్ణ తత్వసుధ" అను రెండు గ్రంథములు పీఠమున కర్పించితిని. శ్రీవారు మధురకవియను బిరుదమునే గాక అమలానంద అను దీక్షా నామమొసంగిరి. శ్రీ పోలోజు వీరయాచారి గారు వ్రాసిన "మోక్ష హరిశ్చంద్ర" అను యక్షగానమును "నాటకముగా" వ్రాసి గద్వాల ఆశ్రమ జయంతి యందు 1960లో ప్రదర్శించితిమి. దానిని బెంగుళూరు భక్త మండలివారు అచ్చు వేయించగా దానిని కూడ పీఠమునకే సమర్పించుకొంటిని. 1-2-1996వ తేదీ ధర్మపురి ఉపపీఠము వారు "అచల పరిపూర్ణ బోధనాచర్య" అను బిరుదమొసగి సన్మానపత్రము ద్వార సన్మానించిరి. దానిని ఇందు పొందుపరచనైనది.

# సన్మాన పత్రము

## శ్రీ మధురకవి అమలానంద పాటల పంఢరీనాథ్ గారికి

సీ:- పొన్నాల రాజేంద్రు పూర్ణ దయానందు
పదసేవలో నుండి వరలి తీవు
శివరామ దీక్షిత సిద్ధాంత భావంబు
గురుదీక్షలో నుండి నెరిగితీవు
మధురకవి యమలానందుండు యని దేశి
కేంద్రునిచే విఖ్యాతి బొందితీవు
సత్య ప్రబోధను సద్గురు దీక్షతో
వ్యాపకంబును జేయు వ్యక్తి వీవు

దత్తపుత్రుండ వనసూయ సాధ్వికీవు భూషణ వికాస శ్రీ ధర్మ పురమునందు
అచల పరిపూర్ణ బోధనా చార్యుడనగ నిత్య యానందుడీనాడు నతియొనర్చె.

తే.గీ : భక్త వరులెల్ల సత్కీర్తి వ్యక్తపరుచ
అందుకొనుమయ్య పండరీనాథవర్య
నీదు కృపయును మామీద నిలుపుమయ్య
జయము జయమయ్య నీవె మా కభయమయ్య

సీ: స్వాతంత్ర్య సమరాన సంగరజోదువై
పారతంత్ర్యంబు బోకార్చినావు
ఖద్దరు వస్త్రముల్ కమనీయ రూపంబు
కన్నుల కింపుగా దనవితీవు
వేమారు చిరునవ్వు నీమోము నుంజూడ
తాపత్ర్య హృదయంబు దమముజెందు
వారు వీరనకుండ కోరిన వారికి
జోడుగ నిల్చిన నీడ నీవు

గీ॥ శత్రు మిత్రులకు యజాత శత్రువీవు అండజేరిన వారికి యార్తి బాపు
మంచిడెందంబు కలిగిన మనుజుడీవు పండరీనాథ మాయండ నుండుమయ్య!

గీ॥ మచ్చలేనట్టి నడకను మెచ్చినావు మలము దరిజేరనివ్వని యమల చరిత
శారదామాత చిత్త చకోర చంద్ర కన్నబిడ్డల పాలిటి కల్పతరువ!

గీ॥ ధర్మపురి భక్తవరులెల్ల దరికిజేరి నీదు సుతులుగ నీముందు నిలిచినారు
దత్తపుత్రుల పిత్రువై సదయనుజూపి జన్మ రహితము జేయుమా జనకరాజ!

శ్రీ నిత్యానంద గంగయాఖ్య రాజయోగి
శ్రీ మదచలర్షి రామడుగు శివరామ దీక్షితాచల గురూపపీఠ
రాజయోగాశ్రమ కార్యదర్శి, ధర్మపురి

**ధర్మపురి**
తేది : 4-2-1998

1953లో మానివేసిన పద్యరచన 2003లో తొంగి చూడగ "శ్రీ కృష్ణ మందిర శ్రీకృష్ణ శతకము" అను సీసపద్యరచన 'పాటలరామా' అను మకుటము గల కందపద్య రచన ముద్రణలోకి రాగా, సీస పద్య శతకమును పీఠమునకు సమర్పించుకొంటిని.

మద్గురువర్యులచే విన్న చక్కనైన బోధను సామాన్యుల కర్థమయ్యే పరిభాషలో తరచుగా ఉపన్యసించు అలవాటు నాకబ్బినది. విన్నవారు మీ ఉపన్యాసములున్న వున్నట్లుగా సామాన్యభాషలో గ్రంథరూపేణ మాకందజేయుడని పలువురు కోరిరి. అందువలన వచన రచనకు పూనుకొంటిని. దీని కాధారము మద్గురువర్యులచే విన్న బోధ వారిచే రచింపబడిన అచల పరిపూర్ణ రాజయోగీయము - నిజ ప్రబోధా విధానము. తప్ప మరి ఇతర శాస్త్రముల జోలికి వెళ్ళలేదు.

ఇందు సంధులు సమాసముల జోలికి వెళ్లక సామాన్య వాడుకభాషలో నా భావమును కాగితముపైనుంచితిని. ఇది మొదటి ప్రయత్నము. దీని పేరు **"పరిపూర్ణ రాజయోగీయతత్వబోధిని"**. ఇది పాఠకులచే నాదరింపబడి వారిచే ప్రోత్సహింప బడినచో మున్ముందు ఇలాంటి వచన రచనలను రచించుటకు ముందడుగు వేయగలను.

శ్రీ మదచలర్షి దయానంద సాందీపుల వారు వారి సందేశ రూప ఆశీస్సులంద జేసినందులకు వారి పదములకు సుమాంజలు లర్పించి ప్రణమిల్లుచుంటిని.

ఈ గ్రంథ ముద్రణకు ఆర్థిక సహాయము చేసిన చిరంజీవులు నా శిష్యులైన మేడపల్లి భీమయ్య, కాసెట్టి పోశయ్య, చునార్‌కార్ మల్లయ్య భార్య రాధాబాయిలను వారికి జననమరణ భ్రాంతి రహిత స్థితి కలుగుగాక! యని నా హృదయపూర్వక ఆశీస్సులు.

అచలపరిపూర్ణ బోధనాచార్య - మధురకవి
**అమలానంద పాలవాయి పాటల పంఢరీనాథ్**
గద్వాల - 509 125

గద్వాల,
తేది : 1-7-2005

# మానవుడు

అన్ని జన్మలకంటే మానవజన్మ ఉత్తమమైనదని అందరూ అంటారు. అందుకే "దుర్లభం మానుషం దేహం. వివేకం అతి దుర్లభం" అను శృతి అందరినోటా అలరారుచున్నది. ఎందుకు? ఆహారము, నిద్ర, భయము,మైథున ప్రక్రియలో అన్ని ప్రాణులతో బాటు మానవుడు సమానుడే. కాని మైథునము విషయములో ఇతనికన్న పశువులే నయం. అవి ప్రకృతి నియమాలను అధిగమించవు. వానికి లోబడే పై పనులు చేసుకుంటాయి. కాని మానవుడు మాత్రం విజ్ఞానమును అభివృద్ధి చేసికొన గలుగుతాడు, చేసికొంటాడు. అట్లే కట్టు బొట్టు నడకలో నాణ్యతను పెంచుకొంటాడు. అన్ని ప్రాణులు తిర్యగ్జంతువులు. వాని వెన్నెముక అడ్డముగా నుండును. వీనిది నిలువుగా నుండును. అందుకే జ్ఞానం అధికం. అందువలన ప్రకృతిని కూడ వాని నియమాలను కూడ నధిగమించుటకు ప్రయత్నించుచున్నాడు. భూచర, జలచర, ఖేచర జీవులకన్నా నేను తక్కువనా అనే ప్రశ్న తనలోరాగా, వానికన్నా నేనేమిన్న యని నిరూపించుటకు తగిన వాహనములు సంసిద్ధముజేసికొని ప్రయాణించు చున్నాడు. ఆరోగ్య సంరక్షణ కొరకు తగిన ఓషధులను వానివలన ఔషధములను కృత్రిమ వంగడములను, కృత్రిమ గర్భోత్పత్తిని కృత్రిమ మానవులు అనగా రోబుటులను కనిపెట్టుటయేగాక సృష్టికి ప్రతిసృష్టి గావించుట అనాదికాలమునుండి ప్రయత్నించుట చేతనే విశ్వామిత్రసృష్టి యను నానుడి ప్రసిద్ధి గాంచినది.

వీరిలో విజ్ఞానఖనులుగా విరాజిల్లిన వారే ఋషులు. వీరు సృష్టికి మూలకములను వాని నియమ నిబద్ధతలను తెలిసికొనుటకు ప్రయత్నించిరి. ఒకవైపు భౌతిక ప్రపంచమును గూర్చి తెలిసికొనుటయే గాక అధ్యాత్మిక ప్రపంచమునుదాని కాధారమును తెలిసికొని దానిని చేరుకొనుటకును యత్నించిసఫలీకృతులైరి. అందుకే వేదములు, పురాణములు, ఇతిహాసములు, బ్రాహ్మణములు, దర్శనములు, బ్రహ్మ సూత్రములు, ఉపనిషత్తులు మొదలైనవి నాడు విరాజిల్లినవి. నేడు భూగోళ, ఖగోళ మొదలైన శాస్త్రములు విలసిల్లినవి. అందుకే "ఆహార, నిద్రా, భయ మైథునాని సామన్యమే తత్ పశుభిః నరాణాం. జ్ఞానం వివేకం అధికం నరాణాం జ్ఞానేన హీనః పశుభిః సమానః" అను శృతి విలసిల్లినది.

అయితే నాడూ నేడు తన వివేచనా దృష్టిని తమ స్వార్థమునకు నుపయోగించు కొనుట కొరకే వినియోగించుకొన్నారు. అలా వినియోగించుకొన్న వారిని రాక్షసులని అన్నారు. లోక కల్యాణము కొరకు పాటుపడిన వారిని దేవతలని, సామన్యులను మానవులని పిలుచుకొన్నారు. ఈ పేర్లన్నీ జ్ఞాస సంపదననుసరించియు

వారి నడవడికననుసరించియు వచ్చినవి. ఋషులు అని పిలువబడినవారు ఈ ముప్పురి చేతను ఆరాధింపబడిన ద్రష్టలు, సృష్టికి ప్రతి సృష్టి గావించిన స్రష్టలు.

వీరే ఆయా కాలములలో తెలిసికొనిన విషయములే భౌతిక అధ్యాత్మిక శాస్త్రములు. ఈనాడునూ అలాగే తెలిసికొనుచున్నారు. అయితే ఇప్పటి వారిని విజ్ఞాన శాస్త్రవేత్తలని పిలుచుచున్నారు.

అన్నిటికంటే పురాతనమైనవి, పురాణములు అని వానిపేర్లే చెప్పుచున్నవి. ఇవి మనకు లోకజ్ఞానము లేనపుడు మన అమ్మమ్మలు నాన్నమ్మలు చెప్పిన కథల లాంటివి. అందుకే వీనికి "పురాణః కల్పనా కథః" అను నానుడి కలదు. అయితే ఇవన్నీ అబద్ధాలని అనుకోరాదు. వీని నన్నింటిద్వారా ఒక అధ్యాత్మిక తత్త్వమును తెలియజేయుటకు మన ఋషుల తపన. ఆ తపననే తపస్సని అన్నారు. తపన లేనిది తత్త్వము బహిర్గత్వము కాదు. ప్రకృతియందుగల త్రిగుణాలను త్రిమూర్తులుగా నభివర్ణించారు. అందుకే "శ్రీగురుః సత్త్వమయో విష్ణుః రాజసశ్చతురాననః తామసోరుద్ర రూపేణ సృజత్యవతి హంతిచ" స్కాందపురాణమందుగల గురుగీత తెలియజేయు చున్నది.

అంటే సత్త్వ గుణాన్ని విష్ణువుగాను, రజో గుణాన్ని బ్రహ్మగాను తమో గుణాన్ని రుద్రునిగాను అభివర్ణించుట జరిగినది. గంధతన్మాత్రవల్లనే ఉపాధులుత్పన్న మౌను. అయితే యీ గంధము రస తన్మాత్రవలన నభివృద్ధి చెందును. విష్ణువని పిలువబడే రసతన్మాత్ర నుండి కమలోద్భవమైనది. అతడు కమలనాభుడు ఆ కమలమునందుదయించినవాడు కమలభవుడు అతడే బ్రహ్మ. అతడు అన్ని జీవరాసులను సృష్టిస్తూ తనరూపు చూచుకొని తనలాంటి వారినికూడ సృష్టించుట జరిగినదని పురాణ గాథ. వారిలో స్వయం భూ మనువు, మొట్టమొదటి మనువు అతడే. అతని మన్వంతరములో $71 \times 4 = 284$ యుగములు గడచిపోవునట. ఇప్పటికి 6 మన్వంతరములు గడచిపోయినవట. ఈ మనువునకు బ్రహ్మకు భేదము లేదు. ఇట్టి మనువు సంతతివారే ఈ మానవులు. బ్రహ్మ అనగా జ్ఞానము, అంతః కరణ చతుష్టయమే అతని నాల్గుతలలు. ఈ బ్రహ్మ సంతతి వారే బ్రాహ్మణులు. 'బ్రహ్మ జ్ఞానంతు' బ్రాహ్మణః అని కూడ పిలువబడిరి. ఈ జ్ఞానము కలవారందరు బ్రాహ్మణులు లేక మానవులు. ఆ బ్రహ్మ తన మనోసంకల్పము చేత సృష్టి గావించినటుల తెలుపబడినది. అట్లే ఈ మానవుడు తన మనో సంకల్ప బలము చేత సృష్టికి ప్రతిసృష్టి గావించుచున్నాడు. ఇలాంటి ప్రజ్ఞ గలవాడగుట చేత వీనిని మనుష్యుడని పిలుచుచున్నారు. నారములని నీరునకు పేరు. నీటియందు కలవాడు

లేక నీటి స్వరూపుడే తానై యుండుటచేత విష్ణువునకు నారాయణుడనునామము కలిగినది. అట్టి నారాయణుడే హిరణ్యకశిపుని వధించిన యనంతరము సహస్ర కవచుడను రాక్షసుని వధించుటకు తానే నర+నారాయణ స్వరూపముల్లుగా మారి లేక నవతరించిరనియు ఇరువురు 999 వేల సంవత్సరములు ఒకరు తపస్సు చేస్తూ మరొకరు యుద్ధము చేస్తూ 999 కవచములు ఛేదించిరనియు, మిగిలిన కవచమును ఛేదించులోగ అతడు మరణభీతిచే సూర్యునియందు దాగుకొనగా అతడే కాలక్రమేణ ద్వాపరయుగమున 'కుంతి' గర్భమున వివాహము కాని కన్యగర్భమున ప్రవేశించిన సహజకవచకుండల ధారియగు కర్ణుడని పిలువబడినాడు.

ఆ నర నారాయణ స్వరూపుడగుటచేత ఈ మానవునకే నరుడనియు నారాయణుడనియు పేర్లు కలిగినవి. కించిత్ జ్ఞానము కలవానిని నరుడని సర్వజ్ఞత్వాది గుణము కలవానిని నారాయణుడందురు. వీడు తనకు పుట్టుక కలదనియు, అట్లే మరణముకూడ కలదని గుర్తెరిగుట చేత జననము కలుగుటచేత జనుడనియు, మరణము కలుగుటచేత మర్త్యుడను పేర పిలువబడుచున్నాడు.

అంటే మనము మానవుడని, మనుష్యుడని, నరుడని, నారాయణుడని, జనుడు, మర్త్యుడు, ఋషి యనుపేర్లతో పిలువబడుచున్నాము. ఇట్టి మనము మనను ఈ పేర్లతో ఎందుకు పిలుస్తున్నారో తెలిసికొనుటత్యవసరము. అంతేగాక, దేవతలచేత పూజింపబడిన వాడనని తెలిసికొనవలెను. అట్టి తాను చెట్టును, పుట్టను, గుట్టను, తనచేత నిర్మింపబడిన పేడ, మట్టి, కఱ్ఱ బొమ్మలను, లోహముల చేతను, ఉాళ్ళచేతను నిర్మాణము చేయబడిన విగ్రహములను పూజించుట వివేకమనబడునో లేక అవివేక మనబడునో అందరు అర్థము చేసికొనవలెను. చక్రవర్తి తన ఏలుబడిలో నున్న వారినెట్లు యాచించడో అందరిపై తన సార్వభౌమత్వాధికారమెట్లు నిరూపించుకొనునో అట్లే తానును తన విశిష్టతను తెలిసికొనిన వాడే నిజమైన మానవుడు. అట్టి యీ మానవుడే మాధవుడు. మాధవుడే యీ మానవుడు.

## గురువు అవసరమా?

చాలామ...కి దేవుడంటే ఎవరో తెలియదు. కాని కొందరికి దేవుడు లేదు ఈసృష్టి ప్రకృతి వలన జరుగుతుంది అని అంటారు. ప్రకృతి అంటే భూమి, నీరు, అగ్ని, గాలి వగైరాలు అని వారి అభిప్రాయం. మరి కొందరికి దేవుడున్నాడనే నమ్మిక. అతడు జీవులను సృష్టిస్తాడు, పోషిస్తాడు. ఆపదలలో మనను కాపాడుతాడు అనే భావన కలిగుంటారు. గురువును చేరితే అతడు మంత్రోపదేశము చేస్తాడు.

దానిని జపిస్తే మనము సుఖశాంతులతో మన గలుగుతాము లేనిచో ఎన్నో బాధలకు లోనవుతాము అనే భావనతో గురువుగారు చెప్పిన మంత్రాన్ని మననము చేస్తుంటారు.

కొందరు దేవుడు నిరాకారుడని భావిస్తే మరికొందరు అవసరమైనపుడు సాకార రూపుపొంది మనకు సహకరిస్తాడు కాపాడుతాడు అనే భావన కలిగియుందురు. ఇంకా కొందరు ఆపదలలో నున్నవారిని ఆదుకొనుటకు నానా రూపాలతో అవతరిస్తాడు అనే భావన కూడ కలిగియుందురు.

దేవుడు లేడనువారు కూడ కొన్ని కొన్ని సమయాలలో మనసు నిర్బలమైనపుడు దేవుడా నన్ను కాపాడు అనే భావన వారిలో కలిగి లోలోన ఏదో ఒక నామముతో తలంచుట కూడ జరుగుచుండును.

కొందరు గురువెందుకు? నేరుగా దేవుని తలచుట, పూజించుట, ధ్యానించుట సరిపోదా? అని ప్రశ్నింతురు. ఒకాయన నేను ఏ గురువునకు శిష్యుడను కాలేదు. ఒక స్నేహితునితో కలిసి మాట్లాడితే అతడు శ్వాసపై ధ్యాస వుంచితే చాలు. మన సమస్యలన్నీ తీరిపోతాయి. మనలోని దుఃఖాలు మాసిపోతాయి, ప్రశాంతత కలుగుతుంది. దీనివలన పూర్వజన్మల స్మృతి కలుగుతుంది. వచ్చే జన్మయొక్క రహస్యం తెలిసిపోతుంది అని చెప్పితే! నేను అలా చేశాను. వారు చెప్పినట్లుగా నాకు ప్రశాంత స్థితి కలిగింది. అందువలన నేనిప్పుడు నావలెనే మీరూ పొందండి అని బోధిస్తున్నాను. అని ఒక పుస్తకములో అతడు వ్రాశాడు.

అతడు వ్రాసినది నిజము కావచ్చు. మనస్సు అందరిలో ఒకేరీతిగా నుండదు. కొందరి మనస్సు అతి చంచలమైనదిగా నిలకడ నమ్మిక లేనిదిగా నుండును. అంతేగాక పిరికిదియై భయభ్రాంతులకు లోనైకూడ యుండవచ్చును. ఇలాంటివారు ఎవరు ఎన్ని రకాలుగా చెప్పినను వింటారు కాని దేనిని పట్టుదలతో సాధించలేరు.

మనకు కరెంటు లేని సమయములో నూనె దీపములు ప్రమిదలలో నూనెపోసి వత్తివేసి వెలిగించేవారు. కొందరు ఆ దీపమును అనగా జ్యోతిని అలాగే చూస్తూ కూర్చునేవారు. ఇలా దృక్కును నిలుపుటను దృక్ సిద్ధి అని అనేవారు. ఇంకా కొందరు గోడపై ఒకరూపాయి బిళ్ళంత ఎర్రరంగు పెట్టి చూస్తూ కూర్చునేవారు. సహస్రారమందు అష్టదళపద్మము కలదు కదా! దానిని దర్శించుకొనవలెననే నెపంతో మెట్లు మెట్లు కలస్టాండును ఏర్పరచుకొని ఆ దివ్వెను స్టాండుపై నుంచి తన తలపై భాగమున నుండునట్లు అమర్చుకొని దానిక్రింద తనముఖమునకు సమాంతరముగా ఒక అద్దమును అమర్చుకొని అద్దమునందు గల తన ముఖమును చూస్తూ కుడి కంటియందు దృష్టి నిలిపి చూస్తూ పోతే ఆ కంటిలోని జ్యోతి అష్టదళపద్మమునందు

సంచరించుట గోచరమగునని భావించి చూచి ఆనందానుభూతిని పొందేవారు. ఇది రాత్రియందు సాధ్యమగును.

ఇక పగలు గవాక్షముపై మూతమూసి ఆ మూతకు సన్నని రంధ్రము వేస్తే ఆ రంధ్రము గుండా సూర్యరశ్మి నేలపై పడేది. అది పడినచోట అద్దముంచితే ఆ అద్దమందు పడిన సూర్యకిరణ ప్రకాశమును తదేక దృష్టితో తిలకించుతూ పోగా దృష్టి నిలకడ వలన ఎన్నో చిత్ర విచిత్రములు కనబడి చివరకు పండు వెన్నెల మాత్రము గోచరించును. దానియందు మనసు మగ్నత (లేక) తాదాత్మ్యత పొందిన తన శరీరముపైన దేనిపైన ధ్యాస లేక ఆనందానుభూతిని అనుభవించును. ఆ ఆనందమునకు విలువ కట్టలేనంతగా నుండునని వారు వ్యక్త పరతురు.

ఇప్పుడు కరెంటు లైట్లయుగం. ఎర్రని బల్బును యొకటుంచి ఇతర ఆలోచనలు మాని దానిని చూస్తూ అలా కూర్చొని దృష్టి నిలిచిన తర్వాత నీవు కనులు మూసినా నీకు ఆ జ్యోతియే కనబడును. అదియే బిందు స్వరూప శివపరమాత్మ. అతనియందు నీ ఆత్మ ఐక్యమగును. పదివేల సంవత్సరముల కాలము నీవు అతనియందుండ గలవు. మళ్ళీ కృతయుగము వచ్చును. లక్ష్మీనారాయణులు ఆ యుగమందుండ గలరు. రెండువేల ఐదువందల సంవత్సరములకు త్రేతాయుగమావిర్భావ మగును. అప్పుడు సీతారాములుందురు. అట్లే రెండున్నరవేలకు అది అంతరించి ద్వాపరమున రాధాకృష్ణులు రాగలరు. అటులనే కలియుగము వచ్చును. ఈ యుగ మార్పుననుసరించి నీవును మారవలసినదేకాని శాశ్వతమోక్షం లేదు. మళ్ళీ రాక తప్పదని వారందురు. ఈ యుగమున బ్రహ్మ అవతరించెను. బ్రహ్మకుమారీ ఈశ్వరీయ సమాజమున చేరి బిందు స్వరూప శివపరమాత్మను సందర్శించుకొని తరించుడని బోధింతురు. కాని ఈ మార్గములో గలవారు బ్రహ్మచారులుగా నుండుడని ప్రబోధింతురు. కాని వారు చెప్పిన యుగకర్తలైన నారాయణునకు లక్ష్మి, రామునకు సీత, కృష్ణునకు రాధ, బ్రహ్మకు సరస్వతీ సతులుగా నుంటున్నారు. యుగ కర్తలకు బ్రహ్మచర్యము అవసరము లేనపుడు వీరికెందుకు అవసరమో వీరి బుర్రకు తట్టలేదేమో!

మరొక విషయము చదునైన నేలను బాగుగా అలికి వెన్నెల కాలమందు చంద్రునికి వీపుచేసి నిలబడితే మన నీడ నేలపైబడును. మన దృష్టిని మన కంఠస్థానమందు నిలిపి తదేక దృష్టితో చూస్తూ చూస్తూ అనగా రెప్పవాల్చకుండా చూస్తూ చివరకు ఆకాశముపైకి చూడవలెను. నీ నీడ లేక ఛాయ ఆకాశమందు కనబడును. వన్నెవన్నెలుగా కనబడితే ఆ వన్నె ననుసరించి మనకు ఫలానా వ్యాధి

రాగలదనియు, పాదములు కనబడకపోతే ఇన్నాళ్ళకు చస్తామనియు తలకనరాక పోతే వెంటనే ఛస్తామని తెలసికొనవచ్చును. దీనినే ఛాయా పురుష లక్షణమని యందురు. నేను ఇన్ని రోజులకు ఫలానా రోజున చావగలుగుదునని చెప్పి అలాగే చచ్చాడు. ఈతడు మహాయోగి దైవస్వరూపుడని సమాధి కట్టించి పూజింతురు. మానవుడు పశు, పక్షి, దారు, శిలలకు పూజించు దానికంటే ఇది నయం.

కాని బ్రతికుండగా పూజించనివారు, తలిదండ్రులు బ్రతికుండగా కూడు బెట్టక మర్యాద చేయక వారు చచ్చిన తర్వాత తద్దినాలు చేసి సంతర్పణలు చేసిన వారితో సమముగాక మరేమగును.

ఇవన్నీ నేనెలా గ్రహించగలిగితిని? అనేప్రశ్నకు సమాధానం ఎవరో ఒకరు చెప్పాలి. నేను శ్రద్ధతో చేయాలి. చెప్పిన వారిపై నమ్మిక యుండాలి. పట్టుదలతో చెయ్యాలి. చంచలమతి నాలో చెదరిపోనన్ని నాళ్ళు నేను ఎన్నిరోజులు చేసినా లాభముండదు. ఏకాగ్రత విశ్వాసం పట్టుదల గలవారికి శీఘ్రముగా సిద్ధించగలదు.

మరొక విషయం మనం తెలిసికొనవలెను. చేపలకు నీటిలో ఈదుటకు ఈత ఎవరు నేర్పిరి? పశువులు ఇతర జంతువులు అనగా నేలపై నడయాడు జంతువులకు తదితర కొన్ని ప్రాణులకు జలప్రవాహమునుండి సునాయాసముగా ఈదుతూ ఒడ్డుకు జేరు లక్షణము ఆయా ఉపాధులకు సహజముగా అబ్బినవి. వానికి ఎవ్వరూ నేర్పలేదు. కాని మానవునికి మును నేర్చినవాడు నేర్పించవలె ఇతడు నేర్చుకోవలె. నేర్చుకోకపోతే జలగండము తప్పదు. బావిలో యీదినవాడు చెరువులో యీదలేడు. చెరువులో యీదినవాడు నదిలో యీదలేడు. నదిలో యీదినవాడు సముద్రములో యీదలేడు. అది అట్లుండని, మనం ఇక్కడ అర్థం చేసికొనవలసిందేమన జలప్రవాహం నుండి బయట పడుటకు ఏ ప్రాణికి నేర్పవలసిన అవసరంలేదు కాని మానవునకు మాత్రమే అవసరమని అవగతమగుచున్నది. గుర్తు లేనిదానిని గుర్తుచేయువాడే గురుడని మనము గ్రహించవలెను.

ఇపుడు మనం సింహావలోకనము జేయగా ఇక్కడ జలప్రవాహమనగా సంసారమనే సముద్రం. సంసారమంటే భార్యాపిల్లలతో కూడినది కాదు. జనన మరణ ప్రవాహమే సంసారము. ఆగామి, సంచిత, ప్రారబ్ధ కర్మల వలన మానవుడు అనేక జన్మలెత్తుచున్నాడు. ఈ జన్మ పరంపరలు ప్రవాహ రూపముగా జరుగుచునే యుండును. ఇతర ఏ ప్రాణి ఆగామి కర్మను సంపాదించుకోలేదు. అందువలననే అది సహజముగా జల ప్రవాహమును దాటినటుల సంసార సాగరమునుండి బయట పడగలదు. మోక్షమంటే కొంతకాలము విశ్రాంతి తీసికొని మళ్ళీ జన్మించుట కాదు. జనన మరణములు శాశ్వితముగా లేకుండ జేసికొనుటయే నిజమైన మోక్షము.

బుద్ధుడు కూడ ఎందరినో గురువులను ఆశ్రయించినాడు. కాని అతనికి చిత్త చాంచల్యము కుదుటపడలేదు. ఎందుకు? అతడు దేనినీ ఆత్మ విశ్వాసముతో దృఢచిత్తముతో చేయలేదు. ఆహారనిద్రలు మానుకొనుట వలన పైత్య వికార మధికమగుట చేత ప్రశాంతత కుదురలేదు. చివరకు సొమ్మసిల్లి పడిపోయిన వానికి సుజాత అను గొర్లకాపరి చేత పరిచర్య చేయించుకొని 'అంబలి' అనగా ద్రవరూప ఆహారము పుచ్చుకొని బోధి వృక్షము క్రింద కూర్చోగా జ్ఞానోదయమైనదని చెప్పుదురు. ఎలా అయినది? అదే శ్వాసపైన ధ్యాస నుంచుటచేత. ఇదే తారకయోగము. దీనినే అజపా గాయత్రి యందురు. ఇది అతడు ఒకానొక తారకయోగి వలన తెలిసికొనే సాధించుట జరిగినది. ఒక పువ్వు పిందెగామారి కాయగామారి పండుగా మారుటకు కొంతకాలము పట్టును. అట్లే బుద్ధునకు పరిపక్వదశ పొందుటకు కూడ కాలము అవసరమైనది. తర్వాత అతడు అందరికీ బోధించెను. అలా బోధచేయువాడే గురువు. కాకపోతే బుద్ధుని, సంఘమును, ధర్మమును శరణు జొచ్చుట ఎందుకు? భయభక్తులతో శ్రద్ధాసక్తులతో సంపూర్ణ విశ్వాసముతో ఒకరిపై దృష్టియుంచి నడుచుకొనుటయే శిష్యరికం. ఇతనికి హితోపదేశం చేసి చక్కని బాటలో నడిపించువాడే గురువు. ఒకరు నాకు చెప్పితే నేను అలా నడుచుకొన్నాను అనుటలో నేను ఎవరికీ శిష్యుడను కాలేదు అని చెప్పుకొనుటకు కారణమేమన? నేను ఎవరికీ పాదపూజ చేయలేదు అని చెప్పుకొనుటకు తప్ప మరేమీ కాదు.

అసలు పూజించుట అంటే అర్థమేమి? గౌరవించుట. మానవుడిని మానవుడు గౌరవించుటలో పొరపాటేమి? ఏమీలేదు. పాదపూజ ఎందుకు చెయ్యాలి? అనే ప్రశ్న ఒకటి మనముందు నిలుచును. మనిషిలో అభిమానమనేది ఊరపందిలాంటిది. అహంకారమనేది రాక్షసితో సమానము. ఈ రెండు అజ్ఞానముచే కప్పబడి యుండును. అజ్ఞాన మున్నంతవరకు జ్ఞానోదయమెట్లు కలుగును? అది కలుగాలంటే అహంకార అభిమానములు రూపుమాపుకొని వినయభయభక్తులు మనలో పెంపొందించుకొని గురువును అందునా పరిపూర్ణ గురువును ఆశ్రయించిన నాడే జీవన్ముక్తి సంప్రాప్తము కాగలదు. లేనిచో జనన మరణ ప్రవాహమను సుడిగుండమునుండి బయటపడలేము. రాకడా పోకడాలేని రాజమార్గమరయుటకు గురువు అత్యవసర మని శ్రీ భాగవత కృష్ణ దేశికేంద్రులవారి ఉవాచ "గురుమూర్తి జూపకున్నను పరిపూర్ణము తనకు ఎట్లు ప్రత్యక్షమగున్. గురుమూర్తి చూపెనేనియు పరిపూర్ణము తనకు లెస్స ప్రత్యక్షమౌర!" అని అన్నారు. అట్లే అర్జునుడు "శిష్యస్తేహం శ్యాధిమాం ప్రపన్నః" అని అర్థించితేనే భగవద్గీత బోధింపబడినది నిజమే కదా!

మరొక విషయం దేవతలకు బృహస్పతి, రాక్షసులకు శుక్రాచార్యుడు, శ్రీరామునకు వశిష్టుడు, కృష్ణునకు సాందీపులవారు గురువు అవసరమయ్యారని తెలిసింది. శ్రీకృష్ణుడు అర్జునునకు భగవద్గీతను, ఆంజనేయునకు సీతారామ చంద్రులు, సీతారామాజంనేయ సంవాదమను గ్రంథమును బోధించి గురువులైరి. మరి మనకు గురువు అవసరమా? కాదా? అని ఆలోచన చేస్తే అవసరమే అని తేలుచున్నది. కావున గురుగీత 'గురుర్ముఖేన జ్ఞాతవ్యం నాన్యథా గ్రంథకోటిభిః' అని సిద్ధాంతము చేయుచున్నది.

## అతిథి దేవోభవ - గురుదేవోభవ

మన ఇంట్లో శుభకార్యమున్నపుడు మనము మన ఇంటికి బంధువులను గాని, స్నేహితులను గాని రమ్మని ఆహ్వానింతుము. వారు మన అభ్యర్థనపై మన ఇంటికి వచ్చి పాల్గొందురు. అట్టి వారిని అభ్యాగతులని అందుము. తిథి, వార, నక్షత్రములను చూడక మనము పిలువకున్నను మన ఇంటికి అకస్మాత్తుగా వచ్చు వారిని అతిథులని అందుము. వారు బంధువులు కావచ్చు, స్నేహితులు కావచ్చు, మహాత్ములు కాని సిద్ధపురుషులు కాని కావచ్చు. వారు ఎటకో పోతూ దారిలోనున్న మన ఇంటికి రావచ్చును.

భారతీయ సాంప్రదాయానుసారము సహజంగా వారిని చూచిన వెంటనే నమస్కరింతుము. దానినే పూజా విధానములో ధ్యానమని యందుము. రండీ అని పిలుతుము. అలా పిలుచుటే ఆహ్వానమని యందుము. మన ఇంట్లోనున్న ఉచితాసనముపై కూర్చోమందుము. దానినే సింహాసనమని అందుము. అలాగే కాళ్ళు కడుక్కోమని నీరందింతుము. వారు ముందుగా కాళ్ళు కడుగుకొని ఆ తర్వాత చేతులు కడుగుకొని, నోరు పుక్కలించి ముఖము కడుగుకొందురు. కాళ్ళు కడుగుకొనుటకు పాద్యంగాను, చేతులు కడుగుకొనుటను అర్ఘ్యమని, నోరు కడుగు కొనుటను ఆచమనీయమని యందురు. జనాభా తక్కువగా నుండి పాడి పంటలు సమృద్ధిగా నున్న రోజులలో స్నానమునకు ముందు పంచామృతము అనగా పాలు, పెరుగు, నెయ్యి, తేనె, కొబ్బరినీరు - వీనికి తోడు అరటిపండు చిన్న చిన్న ముక్కలు చేర్చి శరీరమునకు మర్దన చేసికొని ఆ తర్వాత గోరువెచ్చని నీటితో స్నానం చేసేవారు. పంచామృతం అలదుకొనుట వలన చర్మవ్యాధులు నివారింపబడి శరీరము తేజో వంతముగా వెలిగిపొయ్యేడిది. బోదకాలు లాంటి వ్యాధులు నివారింపబడేవి. దానినే పంచామృతస్నానం అని అంటాము. ఇది మర్దించుకొన్న తర్వాత మంచినీటితో స్నానం చేసేవారు.

ఆ తర్వాత కట్టుకొనుటకు రెండువస్త్రాలు యిచ్చేవారు. ఒకటి మొలకు మరొకటి శరీరమునకు దీనినే వస్త్రయుగ్మం సమర్పయామి అని మనం దైవ పూజలో కాని గురుపూజలో కాని పిలుస్తాము. తర్వాత జంధ్యమిచ్చేవారు. ఎందుకంటే, నీవు దైవ ధ్యానం చేసికొమ్మని చెప్పుటకే. దైవ ధ్యానానంతరము అలంకరణ చేసికొమ్మని అందుకు తగిన సామగ్రిని ముందుంచేవారు. దానిని విభూషణ మంటాము.

ఆ తర్వాత అగరువత్తులు వెలిగించి దీపారాధన చేసి భోజనం పెట్టేవారు. ఈ భోజనంలో త్రాగుటకు నీరు, పండ్లుకూడ నుంచేవారు. వీనినే ధూపం దీపం చ నైవేద్యం పానీయం ఫలమేవచ అని అంటాము. భోజనానంతరము తాంబూలమిచ్చి కాస్త విశ్రాంతి తీసికొన్న తర్వాత దారిఖర్చులకు దక్షిణ యిచ్చి నమస్కారం చేసి వీడ్కోలు చెప్పేవారం. దీనినే షోడశోపచార పూజ అని అంటాము.

గురువుగారికి గాని విగ్రహాలకు గాని ఈ పనే చేస్తాము. అయితే కొందరు మన సంస్కృతి తెలియని మూర్ఖులు గురువుగారి పాదాలకు ఎందుకు మ్రొక్కాలి? ఎందుకు పూజ చెయ్యాలి? అని ప్రశ్నిస్తారు. ఈ మాటలు వారిలో కాని ఎవరిలో కాని ఎందుకు వస్తాయి? అంటే! వారిలో గల అహంకారము వలన అభిమానం వలన వస్తాయి. అహంకారమునకు మూలం అభిమానం. అభిమానమునకు మూలం అహంకారం. ఈ అహంకారం అష్టమదములకు మూలం. ఈ మదములకు జ్ఞానమనే అజ్ఞానమే కారణం. మనలో అభిమానమనే వూరపందిని రూపుమాపు కొనుటకు అహంకారమనే బ్రహ్మరాక్షసిని నశింప జేసికొనుటకు మమాత్మా సర్వ భూతాత్మా సర్వ భూతాత్మ మమాత్మనః అనే జ్ఞాన జ్యోతిని వెలిగించుకొనుటకే అతిథి సత్కారము. ఆ అతిథి సత్కారమునకు చేయు పరిచర్యలే గురుపూజలో కూడ చేస్తాము కాబట్టి అతిథి సత్కారమునకు గురుపూజకు బేధము లేదు. అలా గురుపూజ చేయుట వలన అజ్ఞానము నశించును. జన్మకు మూలమగు కర్మబంధము నశించును.

గురువుగారి అనుగ్రహమునకు లోనై వారిచే ప్రబోధ వినుటకు సదవకాశము లభించును. లేని బంధము లేనే లేదని దృఢపరచుకొనుట వలన ఒక వైపు భ్రాంతి రహితము మరొకవైపు కర్తృత్వ రహిత కర్మాచరణ అలవడుటవలన కర్మరహితము. "ఋణానుబంధ రూపేణ పశుపత్ని సుతాలయ" అను వాక్యము యందు దాగియున్న ఋణముకూడ రహితము గురువును సత్కరించుటయందు లేక పూజించుట యందు సమకూరుననుటలో సందేహము లేదు.

# డార్విన్ సిద్ధాంతము - అవతారములు

శిష్ట రక్షణార్థము దుష్ట శిక్షణార్థము నారాయణునకు దశావతారములు పూర్వము యెత్తినాడనియు ఇక యెత్తగలడనియు మన పురాణగాధ. అవతారముల గురించిన పురాణగాధలు అటుంచి ముందుగా డార్విన్ సిద్ధాంతము గురించి ఆలోచించుదాం. సృష్టికి పూర్వము మందుచున్న ఒక పెద్ద అగ్నిగోళము తప్ప మరేమీలేదని అతని సిద్ధాంతము. ఆ యగ్నిగోళము అనేక బ్రద్దలై తునాతునకలై అనేకం ఊర్ధ్వభాగమునకు రెండు మాత్రము క్రింది భాగమున పడిపోయినవట. పైభాగమున నిలిచిపోయినవి సూర్యుడు, చంద్రుడు, నక్షత్రములు, నవగ్రహాదులుగా మారిపోయినట్లుగా క్రిందపడిన అగ్నిగోళము ఒకటి మొదట నీరుగామారిపోయినట్లు నిదానముగా చల్లబడినమరొక భాగముభూమిగా మారినట్లు డార్విన్‌గారు వ్యక్తపరచిరి. జలమునందు ఆదిలో జలచరము లుద్భవమయ్యి క్రమముగా పరిణతి చెంది, ఉభయ చరముగాను, ఓషధులుద్భవము చెందిన తర్వాత భూచరముగాను, ఆ తర్వాత వనచరముగాను, వృక్షచరముగాను జీవ పరిణామము చెందినవదనియు పశువులు, మృగములు, పక్షులు, క్రిమికీటకాదులతోబాటు వనచరములలో వృక్షచరముగా మారిన జీవికి తోకయుండుటచేత వానరము అనిపిలువబడి, వాలము మాయమయిన పిదప నరునిగా పిలువబడినట్లు వారు తమ పరిశోధన ద్వారా తెల్పిరి.

ఈ నరుడు మొదట్లో మృగతుల్యుడుగా నున్నాడనియు, తర్వాత జంతుసమానుడైనాడని మృగము వలె జంతువులను చంపుకొని తినుటయే గాక ఒక్కొక్కప్పుడుమనుష్యులను కూడ చంపుకొని తినెడివాడని క్రమ వికాసము ద్వారా పాత రాతియుగమునుండి క్రొత్త రాతియుగమునకు మార్పుచెంది నేడు లోహ యుగములోనికి అడుగిడుట జరిగినదని పశుతుల్యుడుగా నున్నపుడు చంటిపాపల వలె ఏమి తెలియని స్థితినుండి భావవ్యక్తీకరణ స్థితి మాట మంతి నేర్చుకొనుట గుడిసెలు లేక పర్ణశాలల నేర్పరచుకొనుట దిగంబరత్వముకు సిగ్గుబడుట ఆకులు అలములు తినుట వానినే వస్త్రములుగా ధరించుట తర్వాత గృహములను నిర్మించుట స్త్రీ పురుషుల శారీరక కామవాంఛను ఇష్టము వచ్చిన వారినుండి తీర్చుకొనుటమాని గృహస్థునిగా మారుట నియమ నిబంధనలను ఏర్పరచుకొని తద్రీతిగా మెలగుట, భార్య పిల్లలను పోషించుట కొరకు పాడిని దానితో పంటలను పండించుకొనుటతో తృప్తిపడక భాషను, అందుకు తగిన లిపిని విద్యను నేర్చుకొని క్రమేపీ యీ నాగరిక ప్రపంచములోని కదుగిడి లోహ లేక యంత్రయుగములోనికి నేడడుగిడుట జరిగినది.

తనకు జననము, శైశవము, బాల్యము, యౌవనము, ప్రౌఢము వార్ధక్యములతో బాటు మరణము కూడ కలదనియు, తెలిసికొనెను. ఇలా యీ మానవుడు క్రమపరిణామము చెందినాడని డార్విన్ మహాశయుడు సృష్టిని గురించి దాని పరిణామము గురించి సిద్ధాంతీకరించెను.

డార్విన్ సిద్ధాంతమును దృష్టిలో నుంచుకొని ఆలోచించగా మన భాగవతము నందు వివరించిన దశావతారములు ఆ సిద్ధాంతమును యీ అవతారములు అవతారములుగా కాక సృష్టియొక్క పరిణామ క్రమమును గూర్చి చెప్పినట్లు డార్విన్ సిద్ధాంతంతో పోల్చుకొని చూచుకొంటే సరిపోతుందేమో ఆలోచించుకొందాం.

అతడు అనగా డార్విన్‌గారు ప్రథమమున జలచరములు సృష్టింపబడినట్లు చెప్పిరి. దశావతారములలోమొదటి అవతారము మత్స్యావతారమునకు సరిపోవును. ఉభయచరజీవిగా కూర్మావతారమును, భూచర జీవిగా వరాహఅవతారమును, ఇట్లు మనిషికాదు అటు జంతువు కాని వానర జీవితమునకు నరసింహ అవతారమును, తెలిసీ తెలియని అమాయకపు జీవితమునకు వామన అవతారమును, మృగతుల్య జీవితమును ఆటవిక జీవితమునకు ప్రతీకగా పరశురామ అవతారము తర్వాత వివాహ వ్యవస్థకు గృహస్థ జీవితమునకు ప్రతీకగా శ్రీరామ అవతారమును, పాడి పంటలను పండించుకొని కొన్ని కట్టుబాట్లకు లోబడియుండు జీవితమునకు కృష్ణ బలరామ అవతారమును, లోహ లేకయాంత్రిక యుగము బుద్ధి వికాసమునకు ప్రతీక యగుటచేత బౌద్ధావతారమును, చివరకు పుట్టినవాడు చావక తప్పదు. తన వినాశనముతానే కారణుడను మాటకు కల్క్యావతారము సరిపోవుట చేత మన మహర్షులు దశావతారములు సృష్టి పరిణామము ఇలా జరిగినదని తెలియజేయుట కొరకే తెలియజేసినట్లు ఆలోచించగా అవగతమౌచున్నది.

ఇక మనగురించి ఆలోచిద్దాము. మనము తిన్న ఆహారము రసము, రక్తము, మాంసము, మజ్జ, మేధస్సు, అస్తులు, రేతస్సుగా పరిణామము చెందును. పురుషుని యందు రేతస్సు స్త్రీయందు శోణితము ఉత్పన్నమగును. వీరిద్దరు కలియుటచేత పురుషుని గర్భమందు తయారైన రేతస్సు స్త్రీ గర్భమందు విసర్జింపబడును. రేతస్సునందు గల అనేక జీవాణువుల బిందువులలో ఏదోనొకటి స్త్రీ గర్భమునందు జేరి క్రమముగా పిండముగా మారును.

రేతస్సు లేక శుక్లము అనుపిలువబడు బిందువులో జీవాణువును సూక్ష్మదర్శిని (మైక్రోస్కోపు) ద్వారా పరిశీలనచేసి చూడగా నది చేప ఆకారములో నుండును. అనగా తండ్రి గర్భమున మూడు నెలలుండిన యీ బిందువు

మత్స్యాకారము ధరించుటే మత్స్యావతారము(1). తల్లి గర్భమున ప్రవేశించిన మూడు నెలలకు పిండాకారముగా మారును. అనగా ఆ పిండమునందు ఆ జీవాణువు అవయవములను సంతరింపచేసికొనును. నాల్గవ నెలలోన ప్రాణిగా మారును కాని మావి యుందే అది యుండును. అనగా తాబేలు తన అవయవములను తన పుచ్ఛము క్రింద దాచుకొని యున్నటుల యుండును. అనగా ఆ బిందువు మత్స్యావతారమునుండి కూర్మావతారము(2) దాల్చినదని గ్రహించవచ్చును. ఆరు నెలల తర్వాత ఆ పిండ రూప శిశువు పందివలె మలమూత్రములకు నిలయమైన బొడ్డునకు దిగువన గల పొత్తికడుపున అటు ఇటు కదలుచుండును. అనగా అయ్యది వరాహ అవతారము (3) ధరించినదని గ్రాహ్యమగుచున్నది. తర్వాత తొమ్మిదినెలలు నిండిన తర్వాత స్తంభమును చీల్చి భయంకర రూపుతో బయల్వెడలి హిరణ్యకశిపుని వధించి ప్రేగులను మెడను ధరించి రక్తసితమోముతో భయంకరముగా దోచు నారసింహుని వలె తల్లి గర్భమును చీల్చుకొని బయల్వెడలిన శిశువు అపుడు నారసింహుడే(4).

శైశవమునుండి బాల్యములోని కదుగిడిన ఆ బాల భానుని ముఖారవింద మును తప్పటడుగులు వేయుచు వచ్చిన వామనుడు కాక మరెవ్వరు. బలి అడిగిన వెంటనే మూడడుగులు దానమిచ్చినటుల ఆ బాలభాస్కరునకు మన మనో వాక్కాయములను అతని కర్పించక నుండలేము కాన ఆ బాల్యదశలోకి చేరుకొనుటయే వామనావతారము (5).

తర్వాత వచ్చునది కౌమార దశ. ఈ దశలో నీతడు బ్రహ్మచారి. నిర్భయుడు. ధీరుడు,విద్యార్జన చేయు విద్యార్థి. తనకుకాని మరెవ్వరికైనా అన్యాయము జరిగినదా!ఇటు సంఘమును అటు ప్రభుత్వమును గడగడ లాండించువిద్యార్థులు రెచ్చితే పరశురామప్రీతియే జరుగును. ఆ అవతార పరశురాముడు రాజులను గజగజ వణికించినట్లే ఈ పరశురాముడు కూడ వణకునట్లు జేయును కాన యీ కౌమార దశను మనము పరశురామ అవతారము(6)గా నెరుగవలెను.

వివాహముకానంత వరకు యువతలో ఉరకలు, పరుగులు మెండు. బాధ్యతలుండవు. వివాహము చేయగానే అతడు గృహస్థుడుగా మారును. భార్యను వదలి భర్త, భర్తను వదలి భార్య యుండలేదు. అలాయుంటే సీతారామచంద్రులని యంటారు. మనము గృహస్థాశ్రమమును స్వీకరించుటే శ్రీరామావతారము (7). సంతానము కలుగువరకు కూడ ఈ అవతారమే. సంతానంతరము బరువు బాధ్యతలు పెంచుకొనును. పిల్లలకొరకు సంఘములో సత్సంబంధాలు పెంచుకొనును. అలా

పెంచుకొనుటయే కృష్ణావతారము(8). ఇది ప్రౌఢ దశ. ఇతడు ఎవరినీ వదలిపెట్టి యుండలేడు. ఒకవైపు గృహమును, గృహమందు గల వారి యోగక్షేమములతో సంఘములోనున్న వారి యోగక్షేమములను గురించి కూడ తపన యుండును.

వార్ధక్యము రాగానే బుద్ధిలేక జ్ఞానము పండును. భగవచ్చింతన చేస్తూ తత్త్వ విచారణలో తనవిదీర మనగలుగుట బుద్ధిమంతుని లక్షణము. ఆ లక్షణముతో విరాజిల్లుటే బౌద్ధావతారము (9) గా గ్రహించవలెను.

జనన మొందిన ప్రాణి మరణించక తప్పదు. తను మునిగితే లోకమే మునిగిన చందమని పెద్దలందురు. కలియుగాంతమున కల్కి అవతరించునని, పాత యుగము అంతమొంది నవయుగమునకు నాంది వాచకమగునని యందురు. ఇలా మరణావస్థకు చేరుకొనుటయే కల్క్యావతారమని(10) మన మూహించి చూచినచో ఇటు డార్విన్ సిద్ధాంతమునకు అటు పౌరాణిక అవతారములకు మరొకవైపు సాంఖ్య దర్శనమునకు అభేదత్వము సిద్ధించును.

# యుగములు - ధర్మములు

శ్లో॥ యధా యధాహి ధర్మస్య - గ్లా నిర్భవతి భారత।
అభ్యుత్థాన మధర్మస్య - తదాఽత్మానంసృజామ్యహమ్॥

శ్లో॥ పరిత్రాణాయ సాధూనాం - వినాశాయచ దుష్కృతామ్।
ధర్మ సంస్థాపనార్థాయ - సమ్భవామి యుగే యుగే॥

ఎపుడెపుడు ధర్మమునకు ముప్పువాటిల్లి అధర్మము పెచ్చిపెరుగునో అపుడపుడు ఆయధర్మమును ఎదుర్కొనుటకు నాకు నేనే ఒక రూపమును ధరించి ఈ భూమి యందు పుట్టి సాధువులను సంరక్షించుట కొరకు దుష్టులను దునుమాడుట కొరకు ధర్మసంస్థాపనము జేయుట కొరకు యుగ యుగములయందు పుట్టుచుండెదనని శ్రీకృష్ణుడుభగవద్గీతయందు నుగ్గడించెను.

కృతయుగము, త్రేతాయుగము, ద్వాపరయుగము, కలియుగము అని నాల్గుయుగములు, కృతయుగ ప్రమాణము 17లక్షల ఇరువది ఎనిమిదివేల సంవత్సరములు, త్రేతాయుగ ప్రమాణము12లక్షల 96వేల సంవత్సరములు, ద్వాపరయుగము8లక్షల 64వేల సంవత్సరములు, కలియుగము4లక్షల32వేల సంవత్సరములు ప్రమాణము. అంటేనాలుగు యుగాలు కలిస్తే 43 లక్షల 32 వేల సంవత్సరముల్ల కాలమగును.దీనినే మహాయుగమని యందురు. ఇట్టి మహా

యుగములు 71అయిననొక మన్వంతరమగును. ఇటువంటి మన్వంతరములు 14 అయిన బ్రహ్మదేవునికి ఒక పగలు. మరొక 14 మన్వంతరములు అయిన ఒక రాత్రి యగును. అంటే 28 మన్వంతరములైతే బ్రహ్మకు ఒక దినమగును. ఇట్టి మన్వంతరములు9880 అయితే అతనికి ఒక సంవత్సరమగును. ఇట్టి సంవత్సరములు 100 గడచిన విష్ణువునకు ఒకమాసమగును. బ్రహ్మ తన జీవితము చాలించుకొనును. విష్ణువునకు వందసంవత్సరములు నిండిన అతని జీవితకాలము ముగియును.ఇతని జీవితకాలమున సృష్టి కర్తలనేకులు పుట్టి అణగిపోవుదురు. హరియొక్క జీవితకాలము రుద్రునకొక్క దినమగును. అట్టి దినములు 360 అయితే ఒక వత్సరము అట్టివి నూరైతే రుద్రుడు అణగిపోవును.

ఈశ్వరుని జీవితకాలము సదాశివునకు రెండు గడియలగును. 60అయిన ఒక్క దినమగును. అట్టి దినములు 360 అయిన అతనికి సంవత్సరమగును. ఇట్టి సంవత్సరములు వంద గడిచిన వెంటనే సదాశివుడు తన జీవితమును ముగించు కొనును. ఇట్టి జీవితకాలమే విరాట్ పురుషునకు ఒక రెప్పపాటు కాలమగును. దానినే క్షణమందురు. 360 క్షణములు ఒక పగలు. 720 అయితే ఒకదినముఇట్టి దినములు360×120=4320 అయితే ఒక ఏడు. ఇట్టివి 100గడచిన విరాట్టు పురుషుడు జీవితము చాలించును. అప్పుడు మహా ప్రళయమగును. ఇట్టి ప్రళయములో సూర్య చంద్ర నక్షత్ర నవగ్రహములు పంచ భూముతములలో పృథివిజలమునందు జలముఅగ్నియందు, అగ్ని వాయువందు, వాయువు ఆకాశమునందు నశించగా ఈఆకాశము మాయయందు అణగిపోవును. ఆ మహామాయ అధిష్ఠాన చేతన బ్రహ్మయందు లయమగును. అప్పుడేమియు ఉండదు. అంతా శూన్యమే!

నిద్రనుండి మెలకువ ఎలా వచ్చునో ఎవరికీ తెలియనట్లు ఆచేతన బ్రహ్మము నుండి మాయ అతనికితెలియకుండగానే అరుదెంచి జీవ జగదోపాదులను సృష్టి జేయునని తెలియుచున్నది. ఈ స్థితిగతులను గురించి ఆలోచించుటకు ఎవరికీ సాధ్యము కాని విషయము. అట్లే పిండ బ్రహ్మాండములు ఆవిర్భావ తిరోభావములు జెందుచుండును. ఆవిర్భావమున సృష్టి, తిరోభావమున లయము జరుగుచుండును. ఒకడుగా నున్న తాను "ఏకోహం" అదియే అతని స్థితి. "బహుశ్యాం" అను సంకల్పమే అతని గతి. అతని స్థితిగతులలో గల కాలము గుణించ మానవుని కసాధ్యము.

ప్రస్తుతము వైవస్వత మన్వంతరము జరుగుచున్నది. ఇతడు 7వమనువు.

ఆరుగురు మనువులు గతించిరని అవగతమగుచున్నది. 71 మహాయుగములు 1 మన్వంతరమగుట చేత ఒక మన్వంతరలో 284 యుగాలుండునని తెలుచున్నది. 6 మన్వంతరములు గడచిపోవుట వలన 1704 యుగములు గడచిపోయినవని మన కర్థమౌచున్నది. ప్రతి యుగమునందు ధర్మమునకు హాని కలిగినపుడు పురుషోత్తముడుద్భవించు చుండునని గీతావాక్యము ననుసరించి వైవస్వతుడు రాక పూర్వము 1704 అవతారము లెత్తిదుష్టులను దునుమి శిష్టుల సంరక్షించినటుల వ్యక్తమగుచున్నది. కాని సామాన్య మానవుడు నాలుగు యుగములు గడచిన వెంటనే సృష్టి నశించిపోవునని యనుకొనును కాని నిజమునకు పైన వివరించిన విధముగ సృష్టి క్రమముండునని మన వేదశాస్త్ర పురాణములు ఉద్ఘాటించుచున్నవి.

మన పురాణములందు కృతయుగమున నాలుగు పాదముల ధర్మముండెనని, త్రేతాయుగమున మూడు పాదముల ధర్మము నిలిచినదని ద్వాపరయుగమున రెండు పాదముల ధర్మమే మన గలిగినదని, కలియుగమున ఒకే ఒక పాద ధర్మము మిగిలియున్నదని ఛాందసులైన మతవాదులు వాదింతురు. వారన్నది ఎంతవరకు నిజమో ఒకింత పరిశీలించెదము.

కృతయుగమున నాలుగు పాదములధర్మమే యుండినచో భగవాను డవతరించ వలసిన యవసరమేలేదు కదా! దశావతారములలో అయిదు అవతారములు కృతయుగముననే అవతరించుట జరిగినది. సోమకాసురుని సంహరించుటకు మత్స్యావతారము కాగా, క్షీరసాగర మదన మొనర్చుట కొరకు కూర్మావతార మవసరమైనది. భూదేవిని సంరక్షించుటకొరకు హిరణ్యాక్షుని వధించుట కొరకు వరాహావతార మవసరమయ్యెను. నిజముగా నాలుగు పాదముల ధర్మమే యుండినచో మత్స్య, వరాహ, నారసింహావతారములెందుకు దాల్చవలసి వచ్చెను? "ధర్మ సంస్థాపన నార్థాయ సంభవామి యుగే యుగే"అను వాక్యము ననుసరించి కృతయుగమున ఒక పాద ధర్మము తప్ప మిగతా 3 పాదములు అధర్మమే యుండుటచేత వానిని బోకార్చుటకై మూడవతారములెత్తక తప్పలేదనుట నగ్నసత్యము. బలిచక్రవర్తి కాలమున ధర్మము నాలుగు పాదములు భూనభోంతరాళముల యందు విరాజిల్లు చుండినది.

స్వర్గమందు కూడ ధర్మమే ప్రకాశమానమై విరాజిల్లు చుండినదనుమాట సత్యదూరము కాదు. కాని వామనావతారమున మూడడుగుల దానమడిగి రెండింటిచే భువిని, దివిని వశపరచుకొని మూడవపాదమున బలిని పాతాళమునకు త్రొక్కుట జరిగినది. ఇది మూడు పాదముల ధర్మమును పాతాళమునకు అణగద్రొక్కబడిన

దనుట నిత్య సత్యమైన నిజము. అందుకే కృతయుగమున ఒకే ఒక్క పాద ధర్మ ముండుట చేత మిగతా మూడింటిని సంరక్షించుటకే మత్స్య, వరాహ, నారసింహావ తారము లవసరమయ్యెనని చెప్పక తప్పదు.

త్రేతాయుగమున మూడుపాదముల ధర్మముండినదని చెప్పుట నిజమే యైనచో పరశురామ శ్రీరామ అవతారములవసరమా! పరశురాముడు 28 పర్యాయములు దండయాత్రలు చేసి దుర్మందాంధులైన రాజుల తలలను నేల కొరగించుటెందులకు. శ్రీరాముడు విశ్వామిత్రుని వెంట వెళ్ళి తాటకిని,సుబాహులను చంపుటే గాక, రావణ కుంభకర్ణాదులనెందరినో సంహరించుటెందులకు? రెండు పాదముల ధర్మము మాత్రమే యుండి మరి రెండుపాదముల ధర్మముండుట చేతనే 2 అవతారములెత్తవలసిన అవసరము ఆ పరమాత్మునికి తప్పలేదు.

ఇక ద్వాపరమున రెండుపాదముల ధర్మము మాత్రమేయుండినదని యందురు. ఈ యుగమున కృష్ణావతారము తప్ప మరొక అవతారమెత్తబడలేదు. అందువలన ఒకే ఒక పాదము అధర్మముండి 3 పాదముల ధర్మముండియుండునని అని అనక తప్పదు.

కలియుగమున...1 పాదధర్మము మాత్రమేకలదు. 3 పాదముల అధర్మము కలదని చెప్పబడుట శోచనీయము. ఈ యుగమున బౌద్ధావతారము తప్ప మరొక అవతారము లేదు. హింసపై అహింస ధ్వజమెత్తబడినది. సర్వ సమానత్వము చాటబడినది. వర్ణ వర్గ భేదాలు వద్దన్నారు. సర్వమానవ సౌభ్రాతృత్వము సాధించాలని చాటిరి. వేదములు చదువుటకు, వినుటకు అందరికీ అర్హత కలదని విశ్వసించిరి. శూద్రులకు స్త్రీలకు మోక్షార్హత లేదనుమాటను బూటకమనిరి. సర్వ సమానత్వము సాధింపబడినది. నిరంకుశ రాజరికం నిలువునా కూల్చివేయబడినది. సామాన్యుని గళమునకు స్వాతంత్ర్యమబ్బినది. మున్ను యుగాలలో ప్రభుత కొరకే ప్రజలుండిరి. ఈ యుగాన ప్రజల కొరకే ప్రభుత నిలచినది. ఒకే దేశములో అనేక రాజ్య వ్యవస్థలుండినవి. ఇప్పుడవి అంతరించినవి. దేశాలన్నీ ఏకమై ఒకరినొకరు సహకరించుకొనుచున్నారు. కరువు కాటకములుగాని, ఈతిబాధలు కాని కలిగినపుడు ప్రపంచమంతా ఏకమై ఆర్తులను ఆదుకొనుటజరుగుచున్నది. రవాణా సౌకర్యములు,ప్రయాణ సౌకర్యములు వర్ధిల్లినవి. వైద్య ఆరోగ్యముల సంక్షేమ శాఖలు ఈ యుగముననే మెండు. "సర్వేజనాః సుఖినోభవంతు" అనుమాట ఈ యుగముననే సార్థకత పొందినది. ఆ యుగాలలో పృథ్వీపతుల చరితలే పురాణములుగా ఇతిహాసములుగా వెలసినవి. ఈ కలియుగమున సర్వజనావళి యొక్క సంక్షేమ

సమాచార మందించబడుచున్నది. ఆ యుగాలలోరావణుడో రాముడో లేక గయుడో విమాన యానము చేసిరి. నేడు అట్టి విమానములెన్నో ఎన్నెన్నో. కాలినడక పయనము నాడైతే నేడు బస్సులు, రైళ్ళు, కార్లు, ద్విచక్రవాహనములునేడందరికీ అందుబాటులో కలవు. ఈ యుగమున అంటరానితనము అంతరింపజేయుటయే గాక అట్టివానిని ఈ దేశమునకు అధ్యక్షుడిగా నియమింపబడుట అతి సామాన్యులకు మహోన్నత పదవి నొందుట కవకాశమేర్పడినది. కృతయుగమే ధర్మ యుగము అనుమాట సత్యదూరమై పోయినది. ఎందుకన మత్స్య, వరాహ, నరసింహా వతారములు ధర్మగ్లాని కలుగుటచేతనే ఎత్తవలసి వచ్చినదని చెప్పక తప్పదు. బుద్ధుడు, మహావీరుడు మొదలైన వారే గాక శంకరుడు, రామానుజులు, మధ్వాచారి, ఏసుక్రీస్తు, మహమ్మద్ మొదలైన ప్రవక్తలేగాక ప్రజానాయకులు మొదలైన వారెందరో ఈ యుగమున సొంతలాభము కొంతమానుకొని పొరుగువారికి తోడ్పడుమని ఉద్బోధించుచున్నారు. అందరికీ ఒకేన్యాయము, ఒకే ధర్మము ప్రతిపాదింపబడి అమలు చేయబడుచున్నది. నాడు ప్రభునకొక ధర్మము ప్రజలకొక ధర్మముండినది. సర్వ జనానీకమునకు ఒకే ధర్మము ఈ కలియుగమునందే అమలు చేయబడుచున్నది. ఈ యుగమే ధర్మ యుగము. ఈ యుగమునందే ధర్మము నాలుగు పాదాలతో వర్థిల్లుచున్నదనుట "ధర్మసంస్థాప నార్థాయ సంభవామి యుగే యుగే" అను నానుడిని ధృవపరచుచున్నదని గ్రహించుట ఉత్తమము.

## మతావిర్భావ స్వరూపము పరిపూర్ణభావము

దేశకాల పాత్రల ననుసరించి మతము లావిర్భవించుట మార్పులు జెందుట తటస్థించుచుండును. కారణమేమన మతములు సంఘాచారముతో ముడివడి యున్నవి. ఆచారములు సంఘీయుల సమ్మతముపై నాధారపడియున్నవి. మతి చంచలముకనుక మతములోను చంచలత్వమేర్పడును. ఇది సిద్ధాంతము. దీని నెవ్వరును కాదనలేరు. కాని అభిమానము మాత్రము అడ్డుతగులకమానదు.

ఆర్యులకు పూర్వము వేదములు లేవు. వారి తీవ్ర తపోదీక్ష వలన వేదములు తదాచారములు ప్రవర్తిల్లినవి. అందుకే అట్టి పెద్దలగువారిని ఆర్యులన్నారు ఆర్యులను మాటకు పెద్దలు అని అర్థమున్ను వచ్చినది. వారికి పూర్వము గల మానవుడు చెప్పుకోదగిన నాగరికత కలవాడు కాదు. వాడు తన యజ్ఞానముచే చెట్టు, పుట్ట, గుట్ట మొదలైన వానిని దేవుడని పూజించుచుండెను. వైదికమనగా వేదముపై

నాధారపడినదని యర్థము. మనము వేదములను వాని శిరోభాగములైన ఉపనిషత్తులను పరిశీలించినచో నవి భిన్నాభిన్నములుగా గోచరించును. అందువలన అవి కాలానుగుణ్యముగా మార్పులు జెందినవని విదితమగుచున్నది.

వేదకాలాంత్యమున మనదేశములో వర్ణవివక్షత ప్రబలి సామాన్య మానవుడు వేదములు వినుటకు, మోక్ష సముపార్జనమునకు అనర్హుడని నిర్ణయింపబడెను. హింసాత్మకమగు దురాచారములను రూపుమాపుటకు జైన, బౌద్ధమతములు స్థాపింపబడెను. సామాన్య మానవునికి అందుబాటులోనుండు భాషను, ఆచారములను బౌద్ధమతము ప్రవేశపెట్టినది. అందువలన అది మన దేశమునందే గాక విదేశములయందును వ్యాపించెను? "మోక్షసాధనకు, మానవులందరర్హులే ననియు, దేవుడున్నాడా? లేడా? యను వాదనమవసరము లేదనియు సర్వము చలనాత్మకమనియు, ప్రతీది కార్య కారణములపై నాధారపడియుండుననియు, సత్ప్రవర్తన కలిగియుండినచో మోక్షం సంప్రాప్తమౌ"ననియూ యీ మత ప్రబోధము.

శ్రీ ఆదిశంకరులవారు బౌద్ధమత ప్రాబల్యమునకు 'వైదికమతము క్షీణించుటకు' వైదిక మతము యొక్క కర్మకాండలోగల దురాచారములే కారణమని గ్రహించి కర్మము కంటె జ్ఞానము శ్రేష్టమనియు తెలియక చేసినదంతయు నిరర్థకమనియు, దేవుడనిన ఎవరోకారు! నీవే యనియు, నీవు పరిశుద్ధుడవని తెలిసికొని చేసిన చేష్టవలన నీవు పరిశుద్ధుడవై మోక్షమును పొందెదవని' బోధించుచు కర్మవాదియు కర్మిష్టియునైన మండన మిశ్రునిపై దండయాత్రసలిపి, శాస్త్ర చర్చలలో గెలచి, అద్వైతమునకు అనగా కర్మ విరహితమగు జ్ఞాన యోగమునకు పునాదులను వేసి తద్రీత్యా బౌద్ధమత ప్రాబల్యమునరికట్టెను.

బౌద్ధమతము హీనయాన మాహాయానములుగా చీలి విగ్రహారాధనలతో ప్రారంభమై క్రమశః దిగజారి మనదేశమున అథః పతనమై పోయినది. అద్వైత మతావలంబకులా సిద్ధాంతము సరిగా నవగాహన మొనర్చుకొనలేక "నేనే బ్రహ్మము. నేనేమిచేసిన నాకేమిటియను వితండవాదమునకు లోనై భక్తిశ్రద్ధలు లేక తమ ఇష్టానుసారము ప్రవర్తించు సమయమున శ్రీ రామానుజ స్వాములవారు "శ్రీ శంకరుడు ప్రచ్ఛన్న బౌద్ధుడనియు భక్తిలేనిచో ముక్తి లేదనియు జీవుడు దేవుడుగాడు గాని అతనికి శరీరభూతుడని, అంతర్యామిగా పరమాత్మ సర్వదేహవిశిష్టుడై యున్నాడని, ఆ పరమాత్మయే వైకుంఠవాసియగు విష్ణువని, నవవిధ భక్తులచే యా విష్ణుని యారాధించినచో సాలోక్య, సామీప్య, సారూప్యముక్తులు కలుగునని,

బోధించుమార్గమగు విశిష్టాద్వైత్వమతమును స్థాపించిరి. కాని కొంతకాలమునకు యీ మతానుయాములలో దురాచారములు దుష్ట ప్రవర్తనములు చెలరేగినవి. తమ యారాధ్య దైవమగు విష్ణువే భోగప్రియుడగుచో తాము భోగప్రియులుగానెందు కుండకూడదను పిడివాదముతో తమ అధర్మపు ప్రవర్తనను సమర్థించుకొనుచుండిరి. చివరికీ మతమున వంగలై, తెంగలై అను శాఖాభేదము లేర్పడి రచ్చకెక్కి అపహాస్యము పాలైనది.

మధ్వాచార్యులవారు "రెండు స్వతంత్రవస్తువెలెన్నటికీ ఒకటి కాబోవనియు, జీవుడు అణువనియు, దేవుడు విభువనియు, దేవునివలె జీవుడును ఆనంద మయు డనియు, మోక్షానంతరమతడు తన స్థానాన్ని తాను చేరుకొనగలడనియు దేవుడు తన వినోదార్థము జీవులనాటాడించుననియు, సత్కర్మాచరణ వలన పుణ్యము, దుష్కర్మాచరణ వలన పాపము సంప్రాప్తమౌననియు కర్మ సిద్ధాంతమును" బోధించెను. మధ్వమతము బ్రాహ్మణులయందు మాత్రమే కొంత వ్యాప్తి చెందినది. మిగతా ఆస్తిక మతములన్నియు కించిన్మాత్ర భేదములతో ద్వైతాద్వైతా విశిష్టాద్వైత సిద్ధాంతముల రూపాంతరములే.

మతాచార్యులు ప్రస్థానత్రయమునకు భాష్యములు వ్రాసి ఎవరి మతమును వారు స్థిరపరచుకొనుట విశేషము. విచిత్రము. దక్షులు కనుకనే వారు తమ తమ యభీష్టానుసారము భాష్యములను రూపొందించుకొనగల్గిరి. "ఎవరికివారే యమునా తీరే" యన్నటుల ఎవరిమతమును వారు గొప్పగా వర్ణించుకొన్నారు. కాని వారిలో సామరస్యము గోచరించదు.

ధర్మక్షేత్రమైన కురుక్షేత్రమునందు యుద్ధము సంభవించగా నరునకు ధర్మ సందేహము కల్గినది. ధర్మస్వరూపుడైన నారాయణుడు ధర్మాధర్మ ప్రబోధ చేసి చివరకు (సర్వధర్మాన్ పరిత్యజ్య) సర్వ ధర్మములను అహంకారముతో బాటు (ఎరుకతో బాటు) పరిత్యజింపుమని బోధించెను. కాని మతాచార్యులట్లుగాక ఏదోయొక ధర్మరూపకమైన యోగము ననుష్ఠించుమని బోధించుచున్నారు. వివిధ ధర్మోపదేశములు వినినవారిలో ధర్మసమ్మూఢత్వము సంప్రాప్తమై తబ్బిబ్బులొందుట తటస్థించుచున్నది. అట్టి తరుణమున శ్రీ శివరామదీక్షితులు ధర్మ సంస్థాపనార్థమ వతరించి తాను అద్వైత బ్రాహ్మణుడై యుండియు కులమతముల కతీతమై సనాతనమై సర్వదేశకాల పాత్ర కనుగుణ్యమై నిత్యమై సత్యమైనయున్న అచల పరిపూర్ణ సిద్ధాంతమును శ్రీ శ్రీధర స్వాములవారి వలన గ్రహించి ఆంధ్ర సోదరులవలీలగా నర్థము చేసుకొను గ్రామీణభాషలో "బృహద్వాశిష్టమను గ్రంథమును వ్రాసిరి.

"మతముల వారలు తమ సమ్మతమైనటువంటి శాస్త్ర మర్యాదలచే మిత మేరుపరచుకొని బహుగతులను కలహింతురట్టిగతి నీకేమిటికి! చపలతిచెందేస్థితి నీకేమిటికి?" యని శ్రీ కృష్ణదేశికేంద్రులవారు సెలవిచ్చినారు. వీరు మతాంతర వాక్యములను త్రోసిపుచ్చక అవి "ఎరుక" నిర్ణయమునకు సరిపోవునని స్వీకరించి, "పరిపూర్ణ పరబ్రహ్మమును కనుగొని ఎరుకను వీడు" మని సిద్ధాంతముజేసిరి. అన్ని మతములయందున్న సత్యాసత్యములను పూర్ణముగ పరిశోధించి సిద్ధాంతము చేయబడినది. పరిపూర్ణ భావము. యిదియొక ప్రత్యేక మతము కాదు. ఏ మతాభిమానములకును యిందు తావు లేదు. కనుకనే పరిపూర్ణభావమను పేరు దీనికి సార్ధకమైనది.

## ప్రబోధలు - ప్రచారములు

మానవుడు ఆదిలో మృగము లేక పశుతుల్యుడు. తనకు శారీరకముగాను మానసికముగాను కలుగు సంక్షోభములకు తపించుచు తరుణోపాయముల గురించి ఆలోచించసాగెను. ఆ ఆలోచనలు అతనిలో కలుగుటవలననే నడకలోను, మాట లోను, కట్టు,బొట్టులోను తనను సంస్కరించుకొంటూ వన జీవితము నుండి గ్రామ జీవితమునకును, గ్రామ జీఖితమునుండి పట్టణ మరియు నగర జీవితమునకు అలవాటుపడెను. మొదటిలో ఈతనికి భాషరాదు. దిగంబరుడు. ఆకులు అలములను వలువలుగా ధరించుటముందు నేర్చుకొని క్రమేపి వస్త్రధారణ నేర్చుకొనెను. స్థావర జంగమ జీవులైన వృక్షములు, నదీనదములు, పశు, పక్షి, మృగాదుల వలన ఆహార విహారాదులతో బాటు మాటలు నేర్చుకొనెను. ఇతనికి పుట్టుకతోనే అన్ని జీవులకంటే అధికమగు ఆలోచనా సరళి అబ్బుటచే శరవేగముతో తనను తాను సంస్కరించు కొనెను.

క్రమముగా సూర్యచంద్ర నక్షత్ర నవగ్రహములను,ప్రకృతిని ప్రకృతిలోని తరు, లతా, గుల్మములను, పంచభూతములను వానికతీతమైన శక్తులను గురించి ఆలోచించి తన అనుభవములను తన మస్తిష్కములో రికార్డు చేస్తూ వానిని తన తరువాతి వారికి ప్రబోధించి వానిని వారి మేధస్సులందు నిక్షిప్తం చేస్తూ వెళ్ళెను. ఈ మేధాసంపద కొందరి సొత్తైనది. ఇది అందరి సొత్తు కావలెననే భావములకు భాషను అభ్యసించినట్లుగానే భాషకు తగిన లిపినికూడ కనిపెట్టుటకోగలిగెను. అనేక ప్రాంతములవారు అనేక భాషలను అనేక లిపిలను వారివారికి తోచినటుల నేర్పరచు కొనిరి. కాని ఇప్పటికీ ఈ నాగరిక ప్రపంచములోని కొందరికి భాషకలదు కాని లిపిలేదు.

ఈ లిపి అనేకరీతుల సంస్కరింపబడి సంస్కృత భాషగా మహోన్నతముగా విరాజిల్లుచున్నది. దీనికన్నిటికి మూలము తపన. ఈ తపననే తపస్సుగా మారినది. మహత్తరమైన జ్ఞాన సంపదను సముపార్జించినవారు మహర్షులుగా విఖ్యాతి జెందిరి. వారు ఆరణ్యకములు, పురాణములు, శాస్త్రములు, ఇతిహాసములు, స్మృతులు, శృతి రూపమైన వేదములను, ఉపనిషత్తులను, భగవద్గీత వంటి అనేక గీతములను మనకందజేసిరి. దీనినన్నింటిని ఆపోశనము పట్టినవారు మానవులు. మానవ జీవితమే ఒక చరిత్రయని ఏ మార్పు వచ్చినా ఏసంఘటన జరిగినా దీని కొరకేనని వీని అంతరంగమునందు మహాగ్ని పర్వతములు మహాంబుధులే గాక రామణీయక మైన నందనోద్యానములును విరాజిల్లుచున్నవనియు గమనించెను.

దుఃఖానికి దూరముగా సుఖసంతోషాలకు చేరువగా నుండుటకై అనేక మార్గములను అన్వేషించి ఒక క్రమ జీవితమును అలవరచుకొని వానిని ఆచరణలో నుంచుటకు సిద్ధాంతములను సూత్రీకరించి మానవ మనుగడకు మతమవసరమని మేధా సంపన్నులు మతములను ఏర్పరచి మత సిద్ధాంతముల ప్రకారము తమ అనుయాయులను అనుసరించుకొనునటుల ఆ దేశ సూత్రముల నేర్పరిచిరి.

దీనిలో ముఖ్యమైనవి శాక్తేయము, శైవము, వైష్ణవము, సౌరము, గాణాపత్యము, కాపాలికము, జైనము, బౌద్ధము, పారసీకము, క్రైస్తవము మరియు ఇస్లాం లేక మహమ్మదీయ మతములు. ఇవన్నియు మానవులకు దుఃఖనివృత్తి యొనర్చి సుఖ సంప్రాప్తిని కలిగించుటకొరకు ప్రయత్నించినవి. మోక్షమే దుఃఖనివృత్తిని చేకూర్చునని నుద్భోధించినవి. వీనిలో కొన్ని వైదికమైనవి. మరికొన్ని అవైదికమైనవి. అవైదికమైనంత మాత్రమున అవి నాస్తికములు కావు. దేవుడున్నాడని వాని అనుగ్రహముంటేనే మోక్షము లభించునను నమ్మిక కలిగినవన్నీ ఆస్తిక మతములే. మరికొన్ని దైవ ప్రమేయం లేకుండా జన్మ కలదనియు సుఖదుఃఖములు కలవనియు మరణముకూడ కలదనియు పునర్జన్మ కూడ కలదనియు దాని నివారణ చేసికొనుటయే మోక్షమని నిర్ధారించి లోకమునకు చాటినవి. దేవునికి ప్రాముఖ్య మివ్వకపోవుటచే అట్టి మతములను నాస్తిక మతములని పేరు బెట్టిరి. వేదమునకు ప్రాముఖ్యమివ్వక తమ మతకర్తల వలన చెప్పబడిన లేక వ్రాయబడిన గ్రంథములకే ప్రాముఖ్యమిచ్చు మతములు కూడ లేకపోలేదు. క్రైస్తవులు బైబిలుకు ప్రాధాన్యమిస్తే, మహ్మదీయులు ఖురాన్‌కు ప్రాముఖ్యమిచ్చెదరు. అట్లే సిక్కులు గురుగ్రంథసాహెబ్ అను దానికి విలువ నిచ్చెదరు. మత మౌఢ్యము మన దేశముననే గాక అనేక దేశములయందు ప్రబలినది. ఆనాడు ధాచరిక పరిపాలనలుండుటచే రాజులు తమ రాజ్యవిస్తరణ

కొరకు కూడ ఈ మతములను వినియోగించుకొనిరి. ఇవి విదేశములలో మహా ఘోరముగా జరిగినవి. అట్లనిన మన దేశమున జరుగలేదని కాదు. మన పురాణములే అందుకు తార్కాణము. దేవతలని పిలువబడిన వారు వైష్ణవులు, రాక్షసులని పిలువబడిన వారు శైవులు. వీరి యుద్ధములను దైవాసుర సంగ్రామములనిరి. మొన్న మొన్న జరిగిన పలనాటి యుద్ధము బ్రహ్మన్న వైష్ణవుడైతే నాగమ్మ శైవ మతస్థురాలు. వీరిలోదాగియున్న మత వైషమ్యమే మారణ హోమమునకు దారితీసినది. అందుకే శ్రీ భాగవతకృష్ణదేశికేంద్రులవారు "మతముల వారలు తమ సమ్మతమైనటువంటి శాస్త్రమర్యాదలచే మితమేరుపరచుకొని బహుగతులను కలహింతురు అట్టి గతి నీకేమిటికి? చపలత జెందే స్థితి నీకేమిటికి? అని సెలవిచ్చిరి. కాన వారి గొడవలు మనకవసరము లేదు. కాని వారు మోక్ష సంప్రాప్తి కొరకు ప్రయత్నములు కొనసాగించిన మాట వాస్తవమే. ప్రపంచము లన్నింటిని వర్గీకరిస్తే మూడు వర్గముల క్రిందికి రాగలవు. 1. అద్వైతము; 2. ద్వైతము; 3. విశిష్టాద్వైతము. వీనిలో కూడ అనేక శాఖోపశాఖలున్నవి. వుంటే యుండని కాని ముఖ్యమైనవి మూడే.

అయితే ఇవి దేశకాల పరిస్థితుల ననుసరించి ఆయా దేశాలలో అవి వ్యాప్తి లోనికి వచ్చినవి. ఏ మతముకూడ చెడును బోధించదు. మంచినే బోధించును. ద్వేషాన్ని బోధించదు. ప్రేమనే బోధించును. హింసను బోధించదు. అహింసనే బోధించును. కాలానుగుణ్యముగా మనిషిలో గల మానవత్వము నశించి దానవత్వము విజృంభించినపుడు హింస విలయతాండవమొందినది. యజ్ఞములు కల్యాణము కొరకు కాక నయ్యవి వ్యక్తిగత సౌఖ్యము కొరకు వినియోగింపబడినవి. వేద ప్రమాణమైనది వైదిక మతము. మనము హిందువులను హిందూమతము అని అనుకొనియెదము. అది పొరబాటు. హిందు అనునది ఒక దేశీయత లేక జాతీయత. హిందూ మహాసముద్రముచే పరివేష్ఠింపబడిన ఈ భూభాగమునకు హిందూ దేశమని పేరు. జర్మనీ దేశములో నున్నవారిని జర్మనులన్నట్లుగ, రష్యా దేశములోనున్నవారిని రష్యనులని యన్నట్లుగా, అమెరికా దేశమున నున్నవారిని అమెరికనులని యన్నట్లుగా ఇంగ్లాండులో నున్నవారిని ఇంగ్లీషువారని యన్నట్లుగా హిందూదేశములో నున్న వారందరు హిందువులే. విదేశీయుల దండయాత్రకు పూర్వము మనదేశమున వైదిక మతము మాత్రమే యుండినది.

మోక్ష సంప్రాప్తికొరకు మన మహర్షులు షడ్దర్శనముల నేర్పరచి వైదిక మతము పూర్వ మీమాంస యను దర్శనమునకు ప్రాధాన్యత నొసగినది. అందువలన వర్ణ వ్యవస్థకు ప్రాధాన్యత యేర్పడినది. మొదట నాలుగు వర్ణములే యుండినవి.

ఈ వర్ణములు పలువలు చిలువలుగా విభజించబడి అనేక కులములుగా నేర్పడి అంతఃకలహములకు దారితీసినవి. ఇందు మోక్షాధికారము అందరికీ లేదు. బ్రాహ్మణులకే కలదు. అందునా పురుషులకే కలదు. స్త్రీలకు లేదు. స్వర్గమనునది యజ్ఞయాగాది క్రతువులు చేసిన చేయించిన వారికి ప్రాప్తించును. ఈ స్వర్గము కూడా బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులకే పరిమితమై పోయినది. అందువలన స్త్రీ పురుష భేదములు లేకుండా, కులమతములకు తావీయకుండా మానవులందరికీ మోక్షాధికారము కలదని బౌద్ధమతము చాటినది. బుద్ధుడు క్రీ.పూ. 567-486 లోనివాడు. బుద్ధుని శరణువేడి, బౌద్ధ సంఘములో చేరి బౌద్ధధర్మములను అనగా 1. దృష్టి; 2. సంకల్పం; 3. వచనము; 4. కర్మ; 5. జీవనము; 6. ప్రయత్నము; 7. స్మృతి; 8. సమాధి ఈ ఎనిమిది సంయమనములతో చేసిన వారికి నిర్వాణము లేక మోక్షము సంప్రాప్తము కలదని చెప్పుటవలన వారు వీరనకుండా అనేకులు ఈ మతము నాశ్రయించిరి. సత్సంకల్పముచే ప్రారంభింపబడిన ఈ మతములలో కూడ మంత్రతంత్రములు పూజలు పునస్కారములు స్వార్థపరుల ప్రవేశము వలన చోటు చేసికొనబడినవి. ఇట్టి తరుణములో శ్రీశంకరాచార్యులు కేరళ ప్రాంతములో కాలడియను గ్రామములో జన్మించిరి. వీరు క్రీ.శ. 788-820 వరకుండిరి. వీరు పిన్న ప్రాయములోనే ఆసేతు హిమాచలము వరకు పర్యటించి మండన మిశ్రుడను వారు వైదిక సిద్ధాంతములో అతనిని మించినవారు లేకపోవుట వలన వారితోవాదించి పూర్వ మీమాంసను పూర్వ పక్షము చేసి యజ్ఞయాగాది కర్మకాండవలన ప్రయోజనము లేదని ఉత్తర మీమాంసయందు ప్రతిపాదింపబడిన జ్ఞానకాండ వలననే మోక్షము కలదని సిద్ధాంతీకరించిరి. శ్రీ శంకరులు 1. బ్రహ్మసూత్రములకు; 2. ఉపనిషత్తులకు; 3. భగవద్గీతలకు భాష్యములు వ్రాసిరి. వీనికి ప్రస్థాన త్రయములని పేరు. వీరు "బ్రహ్మసత్యం జగన్మిథ్యాజీవో బ్రహ్మైవ నాపరః" జగత్తు అసత్యమైనది. బ్రహ్మము సత్యమైనది జీవుడు బ్రహ్మకు వేరు కాదు అనగా జీవుడే బ్రహ్మము బ్రహ్మమే జీవుడు అని చాటిరి. సత్యమే బ్రహ్మ అనియు సత్యప్రవర్తన లేక సత్ప్రవర్తన కలవారెల్లరు బ్రహ్మ స్వరూపులేనని గ్రహించిన వారందరికీ మోక్షము కలదని బోధించుట వలన ఇటు వైదికులే గాక అటు బౌద్ధులు కూడ ఆకర్షితులై వారందరు అద్వైతములోచేరిరి. చతుర్విధ మోక్షములలో అద్వైతులు సాయుజ్యమును అంగీకరించిరి. వీరిలో కొందరికి అహంభావన పెరుగట వలనను మరికొందరు సిద్ధాంతము నర్థము చేసికొనకపోవుటవలనను కొందరు శిష్టాచారులుగను మరికొందరు వామాచారులు గను మారిపోవుటవలన నేనే బ్రహ్మమగుట వలన నేనేమి చేసినా నాకేమియు

లేదనియు నన్నేమియు అంటవనియు మాయలోలురకే అన్నియు నంటుకొనునను పెడవాదమేర్పడుట వలన దీనియందు దురాచారములు ప్రబలినవి. కాని శంకరులు చెప్పినది సాయుజ్య మోక్షము. నదులు సముద్రములో కలిసి ఏకమగునటుల జీవుడు బ్రహ్మలో నైక్యమగుట సాయుజ్యమని యందురు.

ఇట్టి తరుణములో క్రీ.శ. 1039-1139 ప్రాంతములో రామానుజుల వారు విశిష్టాద్వైత మతమును స్థాపించి వ్యాపక మొనరించిరి. వీరు తమిళనాడులోని పెరుంబూరులో జన్మించిరి. వీరు సర్వమానవ సౌభ్రాతృత్వమును కోరిరి. అతడు అన్ని కులములవారు మోక్షమున కర్హులని చాటి అందరికీ తిరుమంత్రోపదేశము చేసిరి. నిరాకార నిర్గుణుడైన దైవము వలన ప్రయోజనము లేదనియు సాకారుడు సగుణుడైన వాడే 'కో' అని పిలిచితే 'ఆ'అని భక్తులను ఆదుకొనువాడే భగవంతుడు. భగవంతుడు సత్యము, ప్రకృతి సత్యము, జీవుడు కూడా సత్యము. దేవునికి జీవునికి మధ్యన అడ్డుతెరగా ప్రకృతి యున్నదనియు ఆ ప్రకృతి మాత కరుణ అత్యవసర మనియు, ఆమె కరుణకు పాత్రులైన వారే భగవంతుని దర్శింపగలరనియు, అతని కరుణామృత దృష్టి ఈ జీవునిపై పడగనే ఈ జీవునియందు కించజ్ఞత్వాది గుణములతో బాటు ఇతని జీవరూపము నశించి దైవరూపము ఇతనికి కలుగుననియు అట్లు సారూప్య స్థితి బొందుటయే మోక్షమనియు నవవిధ భక్తుల ద్వార భగవంతునికి ఆత్మ నివేదనము చేసికొనిన వారికి సారూప్య మోక్షము కలుగుననియు రామానుజులు బోధించిరి. కాని వారి యనంతరము దానిలోను బాలభోగము, రాజభోగము, పవళింపుసేవలు చేయుటకు దేవాలయములందు దేవ దాసీలను ఏర్పరచి, భగవంతుని కన్న భక్తుడే మిన్నయనియు అతనిని సంతృప్తి పరిచితే భగవంతుని సంతృప్తి పరచినట్లేయని అర్చకులు భగవంతుడే తమ భర్తగా నెంచుకొని కన్యలను భోగలాలసులుగా నొనర్చి రాజులకును చివరకు ధనమధాందుల కెల్లరకును తమ శరీరమును అమ్ముకొని వారందరికి భోగమును ప్రసాదించు భోగము వారు అను కళంకితులను ప్రసాదించి మానవ సమాజమునకే ఒకమాయని మచ్చ దీనివలన కలిగెను.

శ్రీ మధ్వాచార్యులు 1199-1275 సంవత్సరాలలోనివాడు. ఇతడు ఉడిపి క్షేత్రమును కేంద్రముగా జేసికొని కవ్వమును పట్టుకొనివున్న శ్రీకృష్ణుడ్ని ఆరాధించుతూ వీరు, వీరి అనుయాయులు ద్వైత సిద్ధాంతమును బోధించిరి. వీరు బ్రహ్మసత్య మనియు జీవుడు కూడ సత్యమనియు అయితే ఈశ్వరుడు లేక బ్రహ్మ సర్వజ్ఞత్వాది గుణములు కలవాడనియు, ఈశ్వరుడు తన వినోదము కొరకు జీవుడుని జగత్తు

అనునాటక రంగస్థలముపై నటించుట కతనికొక పాత్రనొసగి తనపాత్రను పోషించుమని యతనిని కోరెను. అతడు తనపాత్రను చక్కగా పోషించి రక్తి కట్టించినచోనతడు సాలోక్య సామిప్య మోక్షమును పొందగలడనియు బోధించెను. రామానుజుల భక్తితోబాటు సదాచరణ యుక్త కర్మయోగమును, అనేక వ్రతముల రూపమున ప్రవేశబెట్టెను. ఈతడు అనగా మధ్వాచార్యులు త్రేతాయుగమున హనుమంతుడనియు, ద్వాపరమున భీముడనియు, కలియుగమున మధ్వాచారిగా ప్రభవించెననియు వీరి అనుయాయుల విశ్వాసము. వీరు ఈశ్వరుడు సర్వ లక్షణ విలక్షణుడనియు వానికి ఏ ఆవరణలు అంటుకొనవనియు జీవుడు మాత్రము ఆవరణలోలుడనియు వీరు నుడువుదురు. ఈతడు భక్తి ప్రపత్తులతో భగవంతుని ఆరాధించుచు సత్కర్మలాచరించుచు కింకరుడై సేవచేయుచు వెళ్ళిన జీవులలో కొందరు దైవ సన్నిధానమునకు చేరుదురనియు అదియే సాలోక్యమనియు అత్యంత ప్రీతిపాత్రమైన వారు మాత్రమే సామీప్య మగుదురనియు వీరిపై భగవంతుడు తమ కరుణామృత దృష్టిని ప్రసరించగా కొన్ని కోట్ల సంవత్సరము ఆనందానుభూతిని పొందుదురనియు వీరి భావన. కాని ఈ సిద్ధాంతమున జీవునకు ఏవిధమైన స్వేచ్ఛలేదు. అతడాడించువాడు, ఇతడు ఆడేవాడు.

ఈ ముగ్గురి కోవలోనికి చెందిన వారనేకులు కలరు. వారిలో వల్లభాచార్యులు, నింబార్కులు, చైతన్యుల వారేగాక మొన్నమొన్నటి వారైన శ్రీరామకృష్ణ పరమహంస, వివేకానందులవారు, స్వామి రామతీర్థ, రమణమహర్షి మొదలైన వారందరు కూడ ఆ మూడింటిలో కొద్ది కొద్ది మార్పులతో వానినే ప్రచురపరచిరి.

క్రీ.శ. 1603-1670 ప్రాంతములో తెలంగాణాలోని నల్లగొండజిల్లా నారాయణపురమను గ్రామమందు విశ్వనాథశాస్త్రి, నిర్మలాంబ అను పుణ్య దంపతులకు శివరామశాస్త్రి యనుపేరుగల నొక మహానుభావుడవతరించెను. వీరి భార్య పేరు సావిత్రి దేవి. వీరు అనేక యజ్ఞములు చేసి దీక్షితులని పేరు పొందిరి. వీరి పూర్వులు కరీంనగరు జిల్లా రామడుగు. దీక్షితులు వ్రాసిన అచల గ్రంథములో నుపయోగింపబడిన భాష ప్రతి మాట చివర 'అష' అనుపద ప్రయోగమా గ్రామమున ఉపయోగింపబడుచున్నందున వారు పూర్వము కరీంనగరు జిల్లాలోని రామడుగు గ్రామస్థులనియు కాలక్రమమున వారు నారాయణపురమున స్థిరపడినట్లు తెలియుచున్నది. అందుకే వారు రామడుగు శివరామదీక్షితులని ప్రసిద్ధికెక్కిరి. వీరు మొదట అద్వైతులు. శ్రీసమర్థరామదాసుగారు 1681 క్రీ.శ. లోని వారు. దాస బోధయందు శ్రీ సమర్థులు అనేకులను మఠాధిపతు లుగా నియమించి భారత

దేశమందంతటను హిందూ మత ధర్మమును నుద్ధరించు టకు పంపించినటులను వారెందరో కాని గణనకు రాలేదనియు పరిశోధనలో 86గురిజాడ తెలిసినదనియు వారిలోమచ్చునకు 26 మంది పేర్లను ప్రకటించుట జరిగినది. శ్రీధరుడు రామకోటయందును, శివరాముడు త్రిలింగ ప్రాంతము నందును వసించుచున్నట్లు వ్రాయబడియున్నది. కొందరు ఆ శివరాముడే మన రామడుగు శిరామ దీక్షితులని అపోహపడిరి. అదే దాస బోధయందు కలదు. "ఈ నామములు మూల నామములు కావు. ఇందు బెక్కు నామములు సమర్థుడు బెట్టినవి" అని కలదు. వీరిని మహంతులు అని పిలిచెడివారు. మహంతులలో శ్రీధరుడు అను వారు కూడ కలరు. ఇద్దరు ఒక గురువునకు శిష్యులే. వారిరువురు హైందవ ధర్మ ప్రచారకులే. కావున వారిరువురు అంతే వాసులౌదురు గాని గురుశిష్యులు కారు. శ్రీధరుల బోధకు సమర్థులవారి బోధకు సంబంధము లేదు. సమర్థులవారు బోధించిన బోధ వార్తీకమునకు చేరువగా కలదు. వారు సాకారమును సమర్థించిరి. అయితే నిరాకారమును ఉపేక్షించనూ లేదు. శ్రీశ్రీధరుల వారు వ్రాసిన భగవద్గీత వ్యాఖ్యానము పరిపూర్ణ బోధకు చేరువగా నున్నది. ఈ శ్రీధరులు పుండరీపుర వాస్తవ్యులు వారు వారే వీరు వీరే. అట్లే ఆ శివరాముడు శివరాముడే కాని ఈ శివరాముడు రామడుగు శివరామదీక్షితులు. వీరు కులమునకు మతమునకు అతీతులు. "పండరీ పురమందు నిలిచి భాగవత భగవద్గీతలు అఖండముగ భక్తులకు తెలిపిన కారణుండగు శ్రీధరేంద్రులకు హారతిదిగో మంగళహారతిదిగో" అని పీఠపరంపరా గురువుల కొసగే మంగళ హారతి యందు కలదు. కాన వీరు దాసుల వారు నియమించిన మహంతులు కారు. అట్లే రామడుగు శివరామదీక్షితులు కూడ మహంతుడు కాడు. ఇతడు స్వతంత్ర ప్రతిపత్తి గల ఒక అద్వైతి, ఇతడు నలుమూలలా అద్వైత ప్రచారము చేస్తూ పండరీ పురమందును ప్రచారము చేయుచుండగా శ్రీధరుల వారిని దర్శించు కొను భాగ్యము రామడుగు శివరామదీక్షితు లకు కలిగినది. అద్వైతాతీతమగు పరిపూర్ణాచలప్రబోధను శ్రీధరులవారివలన గ్రహించి తన భావనలో కలిగిన మార్పు నకు అనుకూలముగా అచల గ్రంథమును వ్రాసి దానిని ప్రచారము చేసిరి. అందువలన శ్రీ భాగవత కృష్ణదేశికేంద్రులవారు "ఈ క్షితి శివరామాన్వయ దీక్షితులకు బోధచేసి దిద్దిన సామ్యోదక్షుడు శ్రీధరమూర్తిని నిక్షేపముగాను మదిని నేవినుతింతున్" అని చాటిచెప్పిరి. అట్లే అచల ప్రబోధ ప్రతిష్ఠాపనాచార్యులుగా దీక్షితులను పేర్కొనిరి. "శ్రీమించు అచలబోధను ఏ మహనీయుండు జేసి యెగజల్లెనొయీ భూమిన్ సుజనుల కొరకా రాముడు గన్వయజ శివరామ దీక్షితులు" అని కందార్థము నందు నుగ్గడించిరి.

అందువలన రామడుగు శివరామదీక్షితుల వారు శ్రీ శ్రీధరుల వారి శిష్యులే!

శ్రీ శంకరులు అద్వైత సిద్ధాంతమును వెలికితీసి సుప్రతిష్ఠము జేసిరి. అందువలన దానికి శంకరాద్వైతము అనుటయే గాక శంకరమతమని జన సామాన్యము, వేనోళ్ళ పొగడుచున్నది. అట్లే విశిష్టాద్వైతమును రామానుజ మతమనియు, ద్వైతమను మాధ్వమని లోక ప్రసిద్ధి గాంచినవి. ఈ త్రిమతములు వారు పుట్టకపూర్వమే యున్నవి. అసలు అద్వైతమును ఔండులోమి, విశిష్టా ద్వైతమును క్రాచ్ఛకుచ్ఛుడు; మాధ్యమికుడు ద్వైతమును వెలుగులోకి తెచ్చిరి కాని ప్రబోధ ప్రచార పీఠస్థాపనలు జరుగలేదు. అందువలన వారంటే ఎవ్వరికీ తెలియదు. కాని కాలానుగుణ్యముగా అప్పటి పరిస్థితుల ననుసరించి వారి వారి కాలములందు పునరుద్ధరింపబడి మానవ కల్యాణము కొరకు వైదికధర్మము పునరుద్ధరింపబడినది. అనగా కాలానుగుణ్యముగా అది సంస్కరింపబడి మానవులనుకూడ సంస్కరించుటకు పూనుకొనినది. ఎందుకనగా "పరధర్మము భయావహమైనది. స్వధర్మము శ్రేయస్సు కలిగించునది" కావడమే. అయితే ఏ మతము కూడ మానవుని నిర్భయునిగాను, స్వతంత్రునిగాను నుద్ధరించలేకపోయినది. స్వతంత్ర ఆలోచనలకు తావీయలేదు. కొన్ని కట్టడలు ఏర్పరచి వానియందే వానిని బంధించిరి.

సర్వమానవ సౌభ్రాతృత్వమునకు అన్యోన్య సహకారమునకు ఐహికాముష్మిక పురోభివృద్ధికి అనుకూలముగా నుండునట్లును ఏ మత బంధములకు కట్టుబడక స్వతంత్ర ఆలోచనా శక్తి పెంపొంది జనన మరణ భ్రాంతినుండి విముక్తి గావించుట కొరకు కుల, మతములకు, వర్ణ, వర్గముల కతీతముగా నుండునట్లు శ్రీ మద్రామడగు శివరామదీక్షితులు ప్రస్తుత పరిస్థితులను 16వ శతాబ్దముననే గమనించి మనలకొక దివ్య సందేశము నందజేసిరి. వీరికి పూర్వము యీ సిద్ధాంతముండినను ఇది మరుగున పడి యుండెను. వీరు ప్రత్యేకముగా అచలగ్రంథము వ్రాయుట వలన ఈ సిద్ధాంతము వీరివలననే వెలికి రావడము వలనను ఇది శ్రీమద్రామడుగు శివరామ దీక్షితీయ అచల పరిపూర్ణ సిద్ధాంతమనియు దీక్షితీయ సిద్ధాంతమనియు, దీక్షితీయ అచల సిద్ధాంత మనియు ప్రసిద్ధి కెక్కెను. అచలగ్రంథమును దీక్షితుల వారు వ్రాయుట వలన దీనికి దీక్షితీయమని పేరు వచ్చినది. వసిష్ఠుల వారు బోధించిన వాసిష్టమున కతీత భావములను వీరు వ్యక్తీకరించుట వలన దీనికి బృహద్వాశిష్ఠమను పేరుతోనే దీనిని పిలుచుచున్నారు.

కొందరు ఛాందసులు, మరికొందరు మతమౌఢ్యులు, ఇంకొందరు జ్ఞాన దరిద్రులు, భగవద్గీతలో చెప్పినరీతిగా ఆర్తులు, అర్థార్థులు, జిజ్ఞాసులు ఒకేఒక

దేవుణ్ణికాక నెత్తిలో నున్న వెంట్రుకలనైన లెక్కపెట్టవచ్చునేమో ఆకాశమునగల నక్షత్రములకు విలువ కట్టవచ్చునేమో కాని వీరు ఆరాధించు దేవతలను దేవుళ్ళను లెక్కపెట్టలేము. కొందరు మహిమలు టక్కుటమారి విద్యలకు ఆకర్షితులై వారినే దేవునిగాభావించి కొలచెదరు. కట్టు,బొట్టులకు, వేషములకు భ్రమకు లోనగు వారెందరో! యోగులు కావలె, మహిమలు కావలె అవి కలవారే మహానుభావులని వారిని పూజింతురు. అచలఋషులు పదార్థము యొక్క యదార్థమును తెలిసికొని జన్మరాహిత్య స్థితిని కలిగించుకొమ్మని చెబుతారు. త్రిమతాచార్యులు మరుజన్మ కలదని నమ్మిరి. అందుకే మోక్షమవసరమని నుడివిరి. బౌద్ధులు దేవుని వూసు ఎత్తుకొనలేదు. కాని జన్మలు కలవని ఒప్పుకొనిరి. బుద్ధుడు ఎన్నో జన్మల అనంతరము గౌతమునిగా జన్మించి బుద్ధుడయ్యాడని తెలిపిరి. వీరు శ్వాసపైన ధ్యాసనిల్పితే చాలు మనో నిశ్చలత కలుగుతుంది, దుఃఖ నివృత్తి పొందుతారు. అదే మోక్షమని యన్నారు. ఇదేమీ కొత్తకాదు. ఇది తారక యోగములో ఒక భాగము మాత్రమే.

మీ బోధలో ఓంకారము యొక్క వూసేలేదు. మీరు ఆస్తికులెట్లౌవుతారని అమాయకపు ప్రశ్న వేస్తారు. క్రైస్తవులు, మహమ్మదీయులు ఓంకారమును పఠించరు వారు నాస్తికులా? అట్లే శైవులకు వేదములు ప్రమాణములు కావు, వారికి ఆగమములే ప్రమాణము. అట్లే సిక్కులు ఏ గ్రంథాన్ని నమ్మరు. 'గురుగ్రంథసాహిబ్'నే నమ్ముతారు. వారు నాస్తికులా? ఆలోచించాలి!

బ్రహ్మతత్వమొకటి కలదని త్రిమతాచార్యులు నమ్మినట్లే అచల ఋషులును నమ్మి దానికి అచలపరిపూర్ణపరబ్రహ్మమను నామముతో నుటంకించిరి. ఆ బ్రహ్మతత్వ మునకే శైవులు సదాశివుడనిరి. వైష్ణవులు విష్ణువనిరి.ఒకరు కైలాసములో నుంటే మరొకరు వైకుంఠములో నున్నాడని, కల్పన లేనిదే కైలాసము. కుంఠితము గానిదే వైకుంఠమని అచల ఋషుల అభిప్రాయము.

"దీనశుభము లేదు దివ్య కీర్తియులేదు
జగతి పుట్టి పుట్టి చచ్చి చచ్చి పొరలనేల?
మనకు పుట్టని చావని
త్రోవ వెదకి కొనుట దొడ్డబుద్ధి" అను భాగవత వాక్యముపై వీరికి విశ్వాసము కలదు. శ్రీకృష్ణుడు రెండే రెండు మార్గములనుద్భోదించిరి. "యోగులకు కర్మయోగము సాంఖ్యులకు జ్ఞానయోగము" అని తెల్పిరి.

"లోకేస్మిన్ ద్వివిధా నిష్ఠపురాప్రోక్తా మయనఘా

జ్ఞాన యోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినః" అనిభగవద్గీతలో బోధించిరి. జ్ఞానయోగము విహంగ మార్గముగా ప్రసిద్ధికెక్కినది. కర్మయోగము పిపీలికా మార్గముగా వర్ధిల్లినది. ఎవరికి నచ్చిన దారిలో వారు పయనించుచున్నారు. యోగమార్గమున పయనించు వారు మహత్తులు ప్రదర్శించి మహాత్ములుగా, యోగులుగా, బాబాలుగా, భగవానులుగా ప్రసిద్ధికెక్కుచున్నారు. కాని వారు పలు జన్మలెత్తుట తప్పుట లేదు.

ఎవరు ఎన్ని మార్గములలో పయనించినా వారు పయనించే దారి తిరిగి జన్మకు వచ్చే దారే కాని తిరిగిరాని దారి మాత్రము కాదనక తప్పదు. ఎందుకన శ్రీశంకరులు "నేనే బ్రహ్మనని" అని అనుకొంటే నీవు బ్రహ్మవైపోతావు. "అహం బ్రహ్మాస్మి" అని అనుకుంటూ శ్రమణ మనన నిధి ధ్యాసలు తైలధారవత్‌గా జరుపుకుంటే నీవు బ్రాహ్మీస్థితి పొందుతావు. అని అన్నారు. సరేబాగున్నది.

శ్రీ రామానుజుల వారు నవవిధ భక్తుల ద్వార నీ ఆత్మను భగవంతునికి నివేదించుకొంటే నీవు అతని స్వరూపం పొందుతావని యన్నాడు.

శ్రీ మధ్వాచారిగారు అతడు పోషకుడు నేను దాసుడనని తలపోస్తు వ్రతము లాచరిస్తూ యుండుమని బోధించిరి.

1. శ్రీ ఆదిశంకరుల వారు "బ్రహ్మోహం" అని అనుకోమన్నారు.
2. శ్రీ రామానుజులవారు భగవంతుడు శివ స్వరూపుడు. కావున నీవు ఆ స్వరూపుడవౌతావు కాన "శివోహం" అని తలంచుతూ యుండమన్నారు.
3. శ్రీ మధ్వాచార్యులవారు నీవు "దాసోహం" అని అనుకుంటూ యుండ మన్నాడు.

1) బ్రహ్మ+అహం=బ్రహ్మోహం; 2) శివ+అహం=శివోహం;

3) దాస+అహం= దాసోహం.

ప్రతివారు చెప్పిన దానియందు నేననే అహం కలదు. ప్రతివారు కోరుకొనేది బంధవిముక్తి. నేనున్నంతవరకు బంధము తప్పుట లేదు. బంధముముక్తి యనునవి ఓతప్రోతముగా కలవు. అందువలన ముక్తియనుమాట నేతిబీరకాయ లాంటిదే బీరకాయ యందునెయ్యి లేనట్లు నేనున్నంత వరకు బంధము తప్పుట లేదు. అని అచల ఋషులు గ్రహించిరి. అందువలన "బ్రహ్మై వాహమస్మి అహం పదార్థ రహితః"అని సిద్ధాంత పరచిరి. నేనుంటే సర్వము యున్నది. నేను లేకపోతే ఏమియు లేదు. కాన ఇదే లోకకల్యాణకర సిద్ధాంతము. ఎందుకంటే నేనుంటే స్వార్థముండును. నేను లేకపోతే అదియుండునా? యుండనేరదు. అది లేనినాడు

సర్వ మానవావళి ఒకటే. కాన సర్వమానవ సౌభ్రాత్రత్వము, అన్యోన్య సహకారము ఐహికాముష్మిక పురోభివృద్ధికి నాంది యగుననుట సత్యము, సత్యము, సత్యము.

## సాంఖ్య విచారణ
## బ్రహ్మాండము

| బ్రహ్మము | అవ్యక్తము | మహత్తు | మహదహంకారము | పంచ తన్మాత్రలు | పంచమహాభూతములు | జగత్తు | విరాట్టు |
|---|---|---|---|---|---|---|---|
| | సదాశివుడు | అం | పరాశక్తి | శబ్దము | సునీలము | | |
| | ఈశ్వరుడు | యం | ఆదిశక్తి | స్పర్శము | ధూమ్రము | | విశ్వ |
| ఆత్మ | రుద్రుడు | రం | జ్ఞానశక్తి | రూపము | అసితము | అనాత్మ | రూపము |
| | విష్ణువు | వం | ఇచ్ఛాశక్తి | రసము | శుభ్రము | | |
| | బ్రహ్మ | లం | క్రియాశక్తి | గంధము | రక్తము | | |

1. బ్రహ్మము నుండి విరాట్టు వరకు బ్రహ్మాండము
2. ఆత్మనుండి విశ్వరూపము వరకు ఈశ్వరాండము.

# బ్రహ్మాండ వివరణ

1. 1. బ్రహ్మము; 2. బ్రహ్మము నుండి అవ్యక్తము; 3. అవ్యక్తము నుండి మహత్తు; 4. మహత్తు నుండి మహదహంకారము; 5. మహదహంకారము నుండి పంచతన్మాత్రలు; 6. పంచతన్మాత్రలు నుండి పంచమహా భూతములు; 7. పంచమహాభూతముల వలన జగత్తు; 8. జగత్తుకు అధిపతి విరాట్టు.

2. 1. బ్రహ్మము కంటె స్థూలము అవ్యక్తము; 2. అవ్యక్తము కంటె స్థూలము మహత్తు; 3. మహత్తు కంటె స్థూలము మహదహంకారము; 4. మహదహంకారము కంటె స్థూలము పంచతన్మాత్రలు; 5. పంచతన్మాత్రల కంటె స్థూలము పంచ మహాభూతములు.

3. 1. పంచమహాభూతములకంటె సూక్ష్మము పంచతన్మాత్రలు; 2. పంచతన్మాత్రల కంటే సూక్ష్మము మహదహంకారము; 3. మహద హంకారము కంటె సూక్ష్మము మహత్తు; 4. మహత్తు కంటె సూక్ష్మము అవ్యక్తము; 5. అవ్యక్తము కంటె సూక్ష్మము బ్రహ్మము.

4. 1. బ్రహ్మము: స్వప్రకాశము, సర్వాధిష్ఠానమును, సర్వమునకు బీజ స్వరూపమును తెలిసికొనుటయు తెలియజేయుటయు లేనిది.

2. అవ్యక్తము : అస్పష్టరూపము, మాయా స్వరూపము, మూలమాయ, మూలప్రకృతి, త్రిగుణ స్వరూపిణి, సంకల్ప స్వరూపిణి.

3. మహత్తు : సర్వమునకు సత్తానొసగునది, ప్రాణప్రదాత.

4. మహదహంకారము : జీవేశ్వర అభిమానములు కలిగించునది.

5. పంచతన్మాత్రలు : గుణ స్వరూపము, విషయ స్వరూపము.

6. పంచ మహాభూతములు : స్థూల, సూక్ష్మోపాధులను ధరించునది.

5. 1) బ్రహ్మము యొక్క పరిణామము ఆత్మ;

2) అవ్యక్తము యొక్క పరిణామము దేవతలు. 1. సదాశివుడు; 2. ఈశ్వరుడు; 3. రుద్రుడు; 4. విష్ణువు; 5. బ్రహ్మ.

3) మహత్తు యొక్క పరిణామము బీజములు: 1. అం; 2. యం; 3. రం; 4. వం; 5. లం.

4) మహదహంకారము యొక్క పరిణామము : 1. పరాశక్తి; 2. ఆదిశక్తి; 3. జ్ఞానశక్తి; 4. ఇచ్ఛాశక్తి; 5. క్రియాశక్తి.

5) పంచతన్మాత్రల పరిణామము : 1. శబ్దము; 2. స్పర్శ; 3. రూపము; 4. రసము; 5. గంధము.

6. 1) 1. బ్రహ్మము కంటె సూక్ష్మము ఆత్మ; 2. ఆత్మ కంటె సూక్ష్మము బ్రహ్మము.

2) 1. అవ్యక్తము కంటె స్థూలము సదాశివుడు; 2. సదాశివునికంటే స్థూలము ఈశ్వరుడు; 3. ఈశ్వరుని కంటే స్థూలము రుద్రుడు; 4. రుద్రునికంటె స్థూలము విష్ణువు; 5. విష్ణువు కంటె స్థూలము బ్రహ్మ.

3) 1. బ్రహ్మకంటె సూక్ష్మము విష్ణువు; 2. విష్ణువు కంటె సూక్ష్మము రుద్రుడు; 3. రుద్రుని కంటె సూక్ష్మము ఈశ్వరుడు; 4. ఈశ్వరుని కంటె సూక్ష్మము సదాశివుడు; 5. సదాశివుని కంటె సూక్ష్మము అవ్యక్తము.

4) 1. మహత్తు కంటె స్థూలము అంబీజము; 2. అంబీజము కంటె స్థూలము యంబీజము; 3. యంబీజము కంటె స్థూలము రంబీజము; 4. రంబీజము కంటె స్థూలము వంబీజము; 5. వం బీజము కంటె స్థూలము లంబీజము.

5) లంబీజము కంటె సూక్ష్మము వంబీజము; 2. వంబీజము కంటె సూక్ష్మము రంబీజము; 3. రంబీజము కంటె సూక్ష్మము యంబీజము; 4. యంబీజము కంటె సూక్ష్మము అంబీజము; 5. అంబీజము కంటె సూక్ష్మము మహత్తు.

6) 1. మహదహంకారము కంటె స్థూలము పరాశక్తి; 2. పరాశక్తి కంటె స్థూలము ఆదిశక్తి; 3. ఆదిశక్తి కంటె స్థూలము జ్ఞానశక్తి; 4. జ్ఞానశక్తికంటె స్థూలము ఇచ్ఛాశక్తి; 5. ఇచ్ఛాశక్తి కంటె స్థూలము క్రియాశక్తి.

7) క్రియాశక్తికంటె సూక్ష్మము ఇచ్ఛాశక్తి; 2. ఇచ్ఛాశక్తి కంటె సూక్ష్మము

జ్ఞానశక్తి; 3. జ్ఞానశక్తి కంటె సూక్ష్మము ఆదిశక్తి; 4. ఆదిశక్తికంటే సూక్ష్మము పరాశక్తి; 5. పరాశక్తి కంటే సూక్ష్మము మహదహంకారము.

8) 1. పంచతన్మాత్రల కంటే స్థూలము శబ్దము; 2. శబ్దము కంటె స్థూలము స్పర్శ; 3. స్పర్శ కంటె స్థూలము రూపము; 4. రూపము కంటె స్థూలము రసము; 5. రసము కంటె స్థూలము గంధము.

9) 1. గంధము కంటె సూక్ష్మము రసము; 2. రసము కంటే సూక్ష్మము రూపము; 3. రూపము కంటె సూక్ష్మము స్పర్శ; 4. స్పర్శకంటె సూక్ష్మము శబ్దము; 5. శబ్దము కంటే సూక్ష్మము పంచతన్మాత్రలు.

10) 1. పంచమహాభూతములకంటే స్థూలము సునీలము; 2. సునీలము కటే స్థూలము ధూమ్రము; 3. ధూమ్రముకంటె స్థూలము అసితము; 4. అసితము కంటె స్థూలము శుభ్రము; 5. శుభ్రము కంటే స్థూలము రక్తము.

11) 1. రక్తము కంటె సూక్ష్మము శుభ్రము; 2. శుభ్రము కంటే సూక్ష్మము అసితము; 3. అసితము కంటే సూక్ష్మము ధూమ్రము; 4. ధూమ్రము కంటె సూక్ష్మము సునీలము; 5. సునీలము కంటే సూక్ష్మము పంచమహాభూతములు.

12) 1. బ్రహ్మాండమందు వర్ణ రూపకముగా నున్న పంచమహాభూతములు పిండాండమందు స్థూలమై పంచభూతములుగా మారెను.

1. సునీలము ఆకాశంగాను; 2. ధూమ్రము వాయువుగాను; 3. అసితము అగ్నిగాను; 4. శుభ్రము జలముగాను; 5. రక్తము పృథివిగాను మారెను.

7) 1. పంచాధి దేవతలకు అధిష్ఠానముగా నుండునది. ఆత్మ. ఈ ఆత్మకే బ్రహ్మాండమందు బ్రహ్మమనియు, ఈశ్వరాండమందు ఈశ్వరుడనియు, పిండాండమందు సూత్రాత్మయనియు పేర్లు కలిగెను. ఇది అణువు కంటె అతి సూక్ష్మముగా నుండి పిండ బ్రహ్మాండము రూపములుగా వ్యాపించి ఘనము కంటే మహాఘనరూపము వహించినది.

8) 1. ఈ సూత్రాత్మ పృథ్వి అధిష్ఠాన దేవతయగు బ్రహ్మ స్వరూపమున అంబీజ ప్రేరణచే క్రియాశక్తి రూపమున గంధతన్మాత్ర ద్వారా పృథివి నుండి సకలమును సృష్టించును. ఇది పృథివీ భూత స్తబకము.

2. ఈ సూత్రాత్మ జల అధిష్ఠాన దేవతయందు విష్ణుస్వరూపమున వంబీజ

ప్రేరేపణచే ఇచ్ఛాశక్తి రూపమున రస తన్మాత్రద్వారా జలము నుండి సకలమును పోషించును. ఇది జలభూతస్తబకము.

3. ఈ సూత్రాత్మ అగ్ని అధిష్ఠాన దేవతయగు రుద్రస్వరూపమున రంబీజ ప్రేరేపణచే జ్ఞానశక్తి రూపమున రూపతన్మాత్ర ద్వారా అగ్నినుండి సకలమును దహించును లేక రూపము యిచ్చిమార్చును. ఇది అగ్నిభూత స్తబకము.

4. ఈ సూత్రాత్మ వాయువు అధిష్ఠాన దేవతయగు ఈశ్వర స్వరూపమున యంబీజ ప్రేరేఫణచే ఆదిశక్తి రూపమున స్పర్శ తన్మాత్ర ద్వారా వాయువు నుండి సకలమును ఊర్ధ్వ అధోలోకములకు విస్తరింపజేయును. ఇది వాయుభూత స్తబకము.

5. ఈ సూత్రాత్మ ఆకాశ అధిష్ఠాన దేవతయగు సదాశివ స్వరూపమున అంబీజ ప్రేరేపణచే పరాశక్తి రూపమున శబ్ద తన్మాత్రద్వారా ఆకాశమునుండి సకలమును ఆకర్షించి వికర్షించును. ఇది ఆకాశభూత స్తబకము.

9) 1. పంచాధి దేవతలకు అధిష్ఠానముగా నుండు ఆత్మ పంచభూతముల వలన 1. సృష్టి; 2. స్థితి; 3. లయ; 4. విస్తీర్ణ; 5. ఆకర్షణలను పొంది అధోరూపపరిణామము జెంది అనాత్మ రూపము దాల్చును.

10) 1. ఈ అనాత్మ వ్యవహారమే విశ్వరూపము

## పంచీకృత పంచభూతనిర్ణయము

1. పంచభూతములనుండి స్థూల శరీరము; 2. పంచతన్మాత్రల నుండి ఇంద్రియములు; 3. పంచశక్తుల నుండి జీవుండు; 4. పంచబీజముల నుండి ప్రాణము; 5. పంచాధి ఆదిదేవతల నుండి ప్రత్యగాత్మ ఏర్పడెనని బుధులనిరి.

1) 1. ఆత్మనుండి ఆకాశము; 2. ఆకాశం నుండి వాయువు; 3. వాయువు నుండి అగ్ని; 4. అగ్ని నుండి జలము; 5. జలము నుండి పృథివి కలిగెను. ఈ పంచభూతములయందు ఆత్మ అధిష్ఠాన చైతన్యముగా కలదు.

| | భూతములు | దేవతలు | బీజములు | శక్తులు | తన్మాత్రలు | వర్ణములు | ఆకారములు | అంశములు |
|---|---|---|---|---|---|---|---|---|
| 1. | ఆకాశము | సదాశివుడు | అం | పరాశక్తి | 1. శబ్దము | సునీలము | వర్తులాకారం | బయలాంశం |
| 2. | వాయువు | ఈశ్వరుడు | యం | ఆదిశక్తి | 1. శబ్దము, 2. స్పర్శము | ధూమ్రము | షట్కోణాకారం | చలనాంశము |
| 3. | అగ్ని | రుద్రుడు | రం | జ్ఞానశక్తి | 1. శబ్ద, 2. స్పర్శ 3. రూపము | అసితము | త్రికోణము | తేజాంశము |
| 4. | జలము | విష్ణువు | వం | ఇచ్ఛాశక్తి | 1. శబ్ద, 2. స్పర్శ 3. రూపం, 4. రసం | శుభ్రము | అర్ధచంద్రా కారము | ద్రవాంశము |
| 5. | పృథివి | బ్రహ్మ | లం | క్రియాశక్తి | 1. శబ్ద, 2. స్పర్శ 3. రూప, 4. రసము 5. గంధము | రక్తము | చతుష్కోణం | కఠినాంశము |

**ఆత్మ సర్వాకారము - సర్వసత్తాంశము లేక చైతన్యాంశము - శుద్ధ స్ఫటిక వర్ణము**

# పంచభూతముల నుండి స్థూల శరీర నిర్ణయము

| | | ఆకాశము | వాయువు | అగ్ని | జలము | పృథ్వి |
|---|---|---|---|---|---|---|
| 1. | ఆకాశము | శోకము | కామము | క్రోధము | మోహము | భయము |
| 2. | వాయువు | దాటుట | పరుగుట | తిరుగుట | చలనము | సంకోచము |
| 3. | అగ్ని | నిద్ర | దప్పిక | ఆకలి | సంగమం | ఆలస్యం |
| 4. | జలము | జొల్లు | చెమట | మూత్రము | శుక్లము | శోణితము |
| 5. | పృథివి | నఖరోమములు | చర్మము | నరములు | మాంసము | అస్తులు |

1. 1. ఆకాశం గగనం శూన్యం అని నిర్ణయం కలదు.
అందువలన ఆకాశ శూన్యాంశము వలన శోకమాయెను.
2. ఆకాశాంశమునకు వాయుచలనాంశము చేరి కామమాయెను.
3. ఆకోశాంశమునకు అగ్నితేజాంశము చేరి క్రోధమాయెను.
4. ఆకాశాంశమునకు జలము యొక్క ద్రవాంశము చేరి మోహమాయెను.
5. ఆకాశాంశమునకు పృథ్వి యొక్క కఠినాంశము చేరి భయమేర్పడెను.

2. 1. వాయువు యొక్క చలనాంశము వలన పరుగుట కలిగెను.
2. వాయువాంశమునకు ఆకాశ శూన్యాంశము చేరి దాటుట కలిగెను.
3. వాయువాంశమునకు అగ్ని తేజాంశము చేరి తిరుగుట కలిగెను.
4. వాయువాంశమునకు జలము యొక్క ద్రవాంశము చేరి చలనము కలిగెను.
5. వాయువాంశమునకు పృథివి యొక్క కఠినాంశము చేరి ముదుచుకొనుట కలిగెను.

3. 1. అగ్ని యొక్క తేజాంశము వలన ఆకలికలిగెను.
2. అగ్ని తేజాంశమునకు ఆకాశ శూన్యత వలన నిద్ర కలిగెను.

3. అగ్ని తేజాంశమునకు వాయు చలనాంశము వలన దప్పిక కలిగెను.
4. అగ్ని తేజాంశమునకు జలము యొక్క ద్రవాంశము వలన సంగమము కలిగెను.
5. అగ్ని తేజాంశమునకు పృథివి కఠినాంశము వలన ఆలస్యము కలిగెను.

4. 1. జలము యొక్క ద్రవాంశము వలన శుక్ల మేర్పడెను.
2. జలము యొక్క ద్రవాంశమునకు ఆకాశ శూన్యత వలన జొల్లు కలిగెను.
3. జలము యొక్క ద్రవాంశమునకు వాయు చలనము వలన చమట కలిగెను.
4. జలము యొక్క ద్రవాంశమునకు అగ్ని తేజాంశము వలన ఆకలి కలిగెను.
5. జలము యొక్క ద్రవాంశమునకు పృథివి కఠినాంశము వలన రక్తము కలిగెను.

5. 1. పృథివి యొక్క కఠినాంశము వలన ఎముకలు కలిగెను.
2. పృథివి యొక్క కఠినాంశమునకు ఆకాశశూన్యత వలన గోళ్ళు వెంట్రుకలు కలిగెను.
3. పృథివి యొక్క కఠినాంశమునకు వాయువు చలనాంశము వలన చర్మము కలిగెను.
4. పృథివి యొక్క కఠినాంశమునకు అగ్ని తేజాంశము వలన నరములు కలిగెను.
5. పృథివి యొక్క కఠినాంశమునకు జలము యొక్క ద్రవాంశము వలన మాంసము కలిగెను.

6. ఈ మొత్తమునకు స్థూల శరీరమని పేరు. ఇందు నరప్రమాణము.

1) 96 అంగుళము లేక 8 జానల పొడవు; 2) 4 జానల వెడల్పు; 3) 33 కోట్ల వెంట్రుకలు; 4) 72వేల నాడులు; 5) 66 ఎముకలు; 6) 92 కీళ్ళు; 7) 33 మూరల పేగులు; 8) శేరుగుండెకాయ; 9) అర్ధశేరు నెత్తురు; 10) ముణుము నాలుగుశేర్ల మాంసము; 11) సోలెడు పైత్యము; 12) అరసోలెడు శ్లేష్మము కలిగియుండును. దీని ధర్మము జనన మరణములు.

# పంచతన్మాత్రల వలన ఇంద్రియముల పట్టిక

| దేవతలు | తత్వ విచారకులు | యోగ అభ్యాసకులు | మతముల వారు | భక్తులు | మంత్ర ఉపాసకులు | మానవులు | తురీయం |
|---|---|---|---|---|---|---|---|
| శబ్ద తన్మాత్ర | జ్ఞానము | మనస్సు | బుద్ధి | చిత్తము | అహంకారము | అధ్యాత్మికము | అంతరేంద్రియములు |
| | ఎఱుగుట | సంకల్పము | నిశ్చయం | చింతన | అభిమానము | అధిభౌతికము | |
| | కూటస్థుడు | చంద్రుడు | బృహస్పతి | క్షేత్రజ్ఞుడు | రుద్రుడు | అధిదైవికము | |
| | భ్రూమధ్యము | కంఠము | ముఖము | నాభి | హృదయము | స్థానములు | |
| | ఆకాశం | వాయువు | అగ్ని | జలము | పృథ్వి | భూతములు | |
| స్పర్శ తన్మాత్ర | సమానవాయువు | వ్యాన వాయువు | ఉదాన వాయువు | ప్రాణవాయువు | అపాన వాయువు | అధ్యాత్మికము | ప్రాణేంద్రియములు |
| | పచనము | స్పర్శ | పలికించుట | ఉశ్వాస నిశ్వాస | విసర్జన | అధిభౌతికము | |
| | జయుడు | విశ్వయోని | అజుడు | విశిష్టుడు | విశ్వకర్త | అధిదైవికము | |
| | నాభి | సర్వాంగము | కంఠము | హృదయము | గుదము | స్థానములు | |
| | ఆకాశం | వాయువు | అగ్ని | జలము | పృథ్వి | భూతములు | |
| రూప తన్మాత్ర | శ్రోత్రము | త్వక్కు | చక్షు | జిహ్వ | ఘ్రాణము | అధ్యాత్మికము | జ్ఞానేంద్రియములు |
| | శబ్దము వినుట | స్పర్శనెరుగుట | రూపంనెరుగుట | రుచి నెరుగుట | వాసననెరుగుట | అధిభౌతికము | |
| | దిక్కులు | వాయువు | సూర్యుడు | వర్ణుడు | అశ్వినీదేవతలు | అధివైవికము | |
| | చెవులు | చర్మము | కన్ను | నాలుక | ముక్కు | స్థానములు | |
| | ఆకాశం | వాయువు | అగ్ని | జలము | పృథ్వి | భూతములు | |
| రసతన్మాత్ర | శబ్దము | స్పర్శ | రూపము | రసము | గంధము | అధ్యాత్మికము | విషయేంద్రియములు |
| | ధ్వని | తాకుట | వర్ణము | రుచి | వాసన | అధిభౌతికము | |
| | సదాశివుడు | ఈశ్వరుడు | రుద్రుడు | విష్ణువు | బ్రహ్మ | అధిదైవికము | |
| | చెవులు | చర్మము | కన్నులు | నాలుక | ముక్కు | స్థానములు | |
| | ఆకాశం | వాయువు | అగ్ని | జలము | పృథ్వి | భూతములు | |
| గంధ తన్మాత్ర | వాక్కు | పాణి | పాదము | గుహ్యాము | గుదము | అధ్యాత్మికము | కర్మేంద్రియములు |
| | వచనము | దానము | గమనము | ఆనందము | విసర్జన | అధిభౌతికము | |
| | అగ్ని | ఇంద్రుడు | విష్ణువు | బ్రహ్మ | మృత్యువు | అధిదైవికము | |
| | నోరు | చేతులు | కాళ్లు | లింగము | ముద్ది | స్థానములు | |
| | ఆకాశం | వాయువు | అగ్ని | జలము | పృథ్వి | భూతములు | |
| రాక్షసులు | వచియించును | దానము చేయును | గమనము చేయును | ఆనందించును | మల మూత్రములు విసర్జించును | పశువులు | జాగ్రత్త స్వప్న సుషుప్తి |

## పంచతన్మాత్రల వలన ఇంద్రియములు ఏర్పడుట

1. 1. శబ్దమెక్కడుండునో అక్కడ జ్ఞానముండును. అందువలన శబ్దతన్మాత్ర వలన జ్ఞానము కలిగెను.
   2. ఈ జ్ఞానమునకు స్పర్శ తన్మాత్ర చేరి మనస్సాయెను.
   3. ఈ జ్ఞానమునకు రూప తన్మాత్ర చేరి బుద్ధి కలిగెను.
   4. ఈ జ్ఞానమునకు రసతన్మాత్ర చేరి చిత్తమాయెను.
   5. ఈ జ్ఞానమునకు గంధ తన్మాత్ర చేరి అహంకారమాయెను.
   1. జ్ఞానము; 2. మనస్సు; 3. బుద్ధి; 4. చిత్తము; 5. అహంకారము ఇవి అంతరేంద్రియములు. అధ్యాత్మికము.
   2. జ్ఞానమునకు తెలిసికొనుట, మనస్సునకు సంకల్పము, బుద్ధికి నిశ్చయించుట, చిత్తమునకు చింతన జేయుట, అహంకారమునకు అభిమానపడుట, అధిభౌతికములు.
   3. జ్ఞానమునకు అధిపతి కూటస్థుడు, మనస్సునకు అధిపతి చంద్రుడు, బుద్ధికి అధిపతి బృహస్పతి, చిత్తమునకు అధిపతి క్షేత్రజ్ఞుడు, అహంకారమునకు అధిపతి రుద్రుడు అధిదైవికములు.
   4. జ్ఞానమునకు స్థానము భ్రూమధ్యము, మనస్సునకు స్థానము కంఠము, బుద్ధికి స్థానము ముఖము, చిత్తమునకు స్థానము నాభి, అహంకారము నకు స్థానము హృదయము. స్థానములు.
   5. జ్ఞానము ఆకాంశాంశము, మనస్సు వాయువాంశము, బుద్ధి అగ్ని అంశము, చిత్తము జలాంశము, అహంకారము పృథివాంశము. ఇవి భూతములు.
2. 1. స్పర్శ తన్మాత్ర వలన వ్యానమేర్పడెను.
   2. ఈ వ్యానమునకు శబ్ద తన్మాత్ర చేరి ఉదానమాయెను.
   3. ఈ వ్యానమునకు రూప తన్మాత్ర చేరి ఉదానమాయెను.
   4. ఈ వ్యానమునకు రసతన్మాత్ర చేరి ప్రాణమాయెను.
   5. ఈ వ్యానమునకు గంధతన్మాత్రచేరి అపానమాయెను.
3. 1. 1. సమాన; 2. వ్యాన; 3. ఉదాన; 4. ప్రాణ, 5. అపానము. ఇవి ప్రాణేంద్రియములు అధ్యాత్మికములు.
   2. సమానమునకు పచనము చేయుట, వ్యానమునకు శీతోష్ణస్పర్శల నెరిగించుట, ఉదానమునకు పలికించుట, ప్రాణమునకు ఉచ్ఛ్వాస

నిశ్వాస, అపానమునకు విసర్జన. ఇవి అధిభౌతికములు.

3. సమానమునకు అధిపతి జయుడు, వ్యానమునకు అధిపతి విశ్వయోని, ఉదానమునకు అజుడు, ప్రాణమునకు విశిష్టుడు, అపానమునకు విశ్వకర్త అధి దైవికములు.
4. సమానమునకు నాభి, వ్యానమునకు సర్వాంగము, ఉదానమునకు కంఠము, ప్రాణమునకు హృదయము, అపానమునకు కటి స్థానములు.
5. సమానము ఆకాశాంశము, వ్యానము వాయువాంశము, ఉదానము అగ్న్యాంశము, ప్రాణము జలాంశము, అపానము పృథివ్యాంశము ఇవి భూతములు.

4. 1. రూపతన్మాత్ర వలన చక్షువు కలిగెను.
2. ఈ చక్షువునకు శబ్ద తన్మాత్ర చేరి శ్రోత్రమాయెను.
3. ఈ చక్షువునకు స్పర్శ తన్మాత్ర చేరి త్వక్కాయెను.
4. ఈ చక్షువునకు రసతన్మాత్ర చేరి జిహ్వా ఆయెను.
5. ఈ చక్షువునకు గంధ తన్మాత్ర చేరి ఘ్రాణమాయెను.
1. శ్రోత్రము; 2. త్వక్కు; 3. చక్షువు; 4. జిహ్వ; 5. ఘ్రాణము ఇవి జ్ఞానేంద్రియములు. అధ్యాత్మికములు.
2. శ్రోత్రమునకు శబ్దము వినుట, త్వక్కునకు స్పర్శనెరుగుట, చక్షువునకు రూపము నెరుగుట జిహ్వాకు రుచి నెరుగుట, ఘ్రాణమునకు వాసన నెరుగుట అధిభౌతికము.
3. శ్రోత్రమునకు చెవులు త్వక్కునకు వాయువు, చక్షువునకు సూర్యుడు, జిహ్వాకు వర్ణుడు, ఘ్రాణమునకు అశ్వనీ దేవతలు అధిదైవికము.
4. శ్రోత్రమునకు చెవులు, త్వక్కునకు చర్మము, చక్షువునకు కన్నులు, జిహ్వాకు నాలుక ఘ్రాణమునకు ముక్కు స్థానములు.
5. శ్రోత్రము ఆకాశఅంశం, త్వక్కు వాయువాంశం, చక్షువు అగ్ని అంశం, జిహ్వాజలాంశం, ఘ్రాణము పృథివ్యాశం ఇవి భూతములు.

5. 1. రసతన్మాత్ర వలన రసేంద్రియమాయెను.
2. రసనేంద్రియమునకు శబ్ద తన్మాత్ర చేరి శబ్దేంద్రియమాయెను.
3. రసనేంద్రియమునకు స్పర్శ తన్మాత్ర చేరి స్పర్శేంద్రియమాయెను.
4. రసనేంద్రియమునకు రూపతన్మాత్ర చేరి రూపేంద్రియమాయెను.
5. రసనేంద్రియమునకు గంధతన్మాత్రచేరి గంధేంద్రియమాయెను.
1. శబ్దేంద్రియములు; 2. స్పర్శేంద్రియము; 3. రూపేంద్రియము; 4.

రసనేంద్రియము; 5. గంధేంద్రియము. ఇవి విషయేంద్రియములు అధ్యాత్మికములు.

2. శబ్దమునకు ధ్వని, స్పర్శకు తాకుట, రూపమునకు వర్ణము, రసమునకు రుచి, గంధమునకు వాసన. అధిభౌతికములు.

3. శబ్దమునకు సదాశివుడు, స్పర్శకు ఈశ్వరుడు, రూపమునకు రుద్రుడు రసమునకు విష్ణువు, గంధమునకు బ్రహ్మ అధి దైవికములు.

4. శబ్దమునకు చెవులు, స్పర్శకు చర్మము, రూపమునకు కన్నులు, రసమునకు నాలుక, గంధమునకు ముక్కు స్థానములు.

5. శబ్దము ఆకాశాంశము, స్పర్శవాయువాంశము, రూపము అగ్ని అంశము, రసము జలాంశము, గంధము పృథివ్యాంశము. ఇవి భూతములు.

5. 1. గంధతన్మాత్ర వలన గుదేంద్రియమాయెను.

2. ఈ గుదేంద్రియమునకు శబ్ద తన్మాత్ర చేరి వాక్కు కలిగెను.

3. ఈ గుదేంద్రియమునకు స్పర్శ తన్మాత్ర చేరి పాణి కలిగెను.

4. ఈ గుదేంద్రియమునకు రూప తన్మాత్ర చేరి పాదము కలిగెను.

5. ఈ గుదేంద్రియమునకు రస తన్మాత్ర చేరి గుహ్యాము కలిగెను.

1. వాక్కు; 2. పాణి; 3. పాదము; 4. గుహ్యాము; 5. గుదములు. కర్మేంద్రియములు. అధ్యాత్మికము.

2. వాక్కుకు వచనము, పాణికి దానము, పాదమునకు గమనము, గుహ్యామునకు ఆనందము, గుదమునకు విసర్జన అధి భౌతికము.

3. వాక్కునకు అగ్ని, పాణికి ఇంద్రుడు, పాదమునకు విష్ణువు, గుహ్యామునకు బ్రహ్మ, గుదమునకు మృత్యువు అధిదైవికము.

4. వాక్కునకు నోరు, పాణికి చేతులు, పాదమునకు కాళ్ళు, గుహ్యామునకు లింగము, గుదమునకు ముడ్డి స్థానములు.

5. వాక్కు ఆకాశాంశము, పాణి వాయువాంశము, పాదము అగ్న్యాంశము, గుహ్యాము జలాంశము, గుదము పృథ్వ్యాంశము ఇవి భూతములు.

## స్తబకములు

1. ఈ జ్ఞాత కూటస్థుడగు అధిదేవత చేత ప్రేరేపింపబడి సమాన వాయువుతో కూడి శ్రోతేంద్రియము ద్వారము వలన చతుర్విధ శబ్దములను గ్రహించి వాక్కు ద్వార వచియించును. ఇది ఆకాశతత్వస్తబకము.

2. ఈ జ్ఞాత చంద్రాధిదేవత చేత ప్రేరేపింపబడి మనోరూపుడై వ్యానవాయుతో

కూడి త్వగింద్రియము ద్వారము వలన పంచవిధ స్పర్శలను గ్రహించి పాణేంద్రియము ద్వార యిచ్చి పుచ్చుకొనును. ఇది వాయు తత్త్వస్తబకము.

3. ఈ జ్ఞాత బృహస్పతి అధిదేవత చేత ప్రేరేపింపబడి బుద్ధిరూపుడై ఉదాన వాయువుతో కూడి చక్షురింద్రియము ద్వారము వలన దశవిధ రూపములను గ్రహించి పాదము ద్వార గమనము చేయును. ఇది అగ్ని తత్త్వస్తకము.

4. ఈ జ్ఞాత క్షేత్రజ్ఞుడగు అధిదేవత చేత ప్రేరేపింపబడి చిత్తరూపుడై ప్రాణ వాయువుతో కూడి జిహ్వేంద్రియ ద్వారము వలన షడ్రుచులను గ్రహించి గుహ్యాము ద్వార ఆనందించును. ఇది జలతత్వ స్తబకము.

5. ఈ జ్ఞాత రుద్రుడగు అధిదేవత చేత ప్రేరేపింపబడి అహంకారరూపుడై అపానవాయువుతో కూడి ఘ్రాణేంద్రియ ద్వారము వలన మలవిసర్జన చేయును. ఇది పృథివితత్త్వస్తబకము.

6. 1. పైన వివరించిన తత్త్వముల యొక్క విచారణ చేయువాడు మానవుడు.
   2. ఈ మానవుడు ఆహార, నిద్ర, భయ, మైథునముల కొరకై పాటుపడినచో అతడు మానవపశువు.
   3. ఇట్టి మానవ పశువు జాగృత, స్వప్న సుషుప్తులనే అవస్థలయందే మగ్గును.
   4. ఈ మానవులలో అహంకారమే ప్రధానముగాకలవారు మంత్రోపాసకులు.
   5. ఈ మానవులలో చిత్తమే ప్రధానముగా గలవారు భక్తులు.
   6. ఈ మానవులలో బుద్ధియే ప్రధానముగా గలవారు మతములవారు.
   7. ఈ మానవులలో మనస్సే ప్రధానముగా కలవారు యోగాభ్యాసకులు.
   8. ఈ మానవులలో జ్ఞానమే ప్రధానముగా కలవారు తత్త్వవిచారకులు.
   9. ఈ తత్త్వ విచారణ ద్వార మానవులు తురీయస్థితిని పొందుదురు.
   10. ఇట్టి తురీయావస్థను పొందువారే మానవులలో దేవతలు వీరు లోక కల్యాణ కార్యములు చేయుదురు.
   11. ఇట్టి దేవత్వము సిద్ధించినదను అహంకారముతో లోక కంటకములగు కార్యములు చేయబూనినచో అతడే మానవ రాక్షసుడుగా పతనము జెందును.

1. స్థూల శరీరము, ఇంద్రియములు, జీవుడు, ప్రాణము, ప్రత్యగాత్మలతో కూడిన వ్యవహారమునకే జాగ్రదావస్థయందురు. ఇది స్థూల శరీరమందు కనపడును. అభిమాని విశ్వుడు.

2. ఇంద్రియములు, జీవుడు, ప్రాణము, ప్రత్యగాత్మల వ్యవహారమునకు స్వప్నావస్థ యందురు. ఇది సూక్ష్మశరీరమందు జరుగును. అభిమాని తైజసుడు.

3. జీవుడు, ప్రాణము, ప్రత్యగాత్మల వ్యవహారమునకు సుషుప్తి అవస్థ యందురు, ఇది కారణ శరీరమందు జరుగును. అభిమాని ప్రాజ్ఞుడు.
4. ప్రాణము, ప్రత్యగాత్మల వ్యవహారమునకు తురీయావస్థయని యందురు. ఇది మహాకారణ శరీరమందు జరుగును. అభిమాని ప్రత్యగాత్మ.
5. ప్రత్యగాత్మ స్థూల శరీరమందభిమానము కలిగి, తన కొరకు ఒక జీవన విధానమును ఏర్పరచుకొని జీవించవలెనను గాఢమైన కాంక్ష అనగా శరీరమును శాశ్వతముగా నంటిపెట్టుకొను కోర్కెగలవాడు జీవుడు.

| సంఖ్య | శరీరములు | అవస్థలు | ఇంద్రియములు | స్థానములు | వ్యవహారము |
|---|---|---|---|---|---|
| 1. | స్థూలశరీరం | జాగ్రత | 25 | నేత్రము | క్రియారూపము |
| 2. | సూక్ష్మశరీరం | స్వప్న | 17 | కంఠము | భావనారూపము |
| 3. | కారణశరీరం | సుషుప్తి | 3 జీ+ప్రా+ప్ర | హృదయము | ప్రాణరూపము |
| 4. | మహారణశరీరం | తురీయము | 2 ప్రా+ప్ర | మూర్ధ్ని | సర్వాత్మకము |

## కోశములు

1. కోశమనగా : కత్తి ఒర, గర్భము, పట్టుకాయ, ధనాగారము, రాశియని నానార్థములు కలవు. అయితే తనయందు ఇమడ్చుకొన్న దానిని, అన్నిటిని తనయందు ప్రోగుచేసుకున్న దానిని కోశమందురు.
1. అన్నరసముతో షోణిత శుక్లమయమైన స్థూల శరీరమే అన్నమయకోశము, దీని ధర్మము హానివృద్ధులు.
2. పంచప్రాణములు, పంచకరేంద్రియులు కలిసి ప్రాణమయకోశము, దీని ధర్మము ఆకలి దప్పులు.
3. జ్ఞానము మనస్సు జ్ఞానేంద్రియములతో కలిసి మనోమయకోశమని పిలువబడును. దీని ధర్మము సంకల్ప వికల్పములు.
4. బుద్ధి జ్ఞానేంద్రియములతో కూడి విజ్ఞానమయ కోశమనబడును. దీని ధర్మము నిశ్చయ, అనిశ్చయములు. ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయములు కలిసి సూక్ష్మశరీరమనబడును.
5. అవిద్యయందు మనసు కలిసిన ఆనందమయ కోశమనబడును. దీని ధర్మము ఆనందించుట, దుఃఖించుట. ఇదియే కారణ శరీరము.
6. ప్రత్యగాత్మయొక్క ప్రజ్ఞాతత్వమునకు లేక ప్రకాశమునకు హిరణ్మయ కోశమనబడును. గుర్తెరుగుట గుర్తెరిగించుట దీని ధర్మము. ఇదియే మహాకారణ శరీరము.

1. అంతరేంద్రియములు : ధర్మాధర్మ ప్రేరేపకములు
2. ప్రాణేంద్రియములు : వాహనములు
3. జ్ఞానేంద్రియములు : ద్వారములు
4. విషయేంద్రియములు : భోగములు
5. కర్మేంద్రియములు : పనిముట్లు

## పంచశక్తుల నుండి జీవుడేర్పడిన విధానము

1. అధిష్ఠాన చైతన్యము వలన పరాశక్తి శక్తివంతమై అంతరేంద్రియములకు ఎరుగుట, సంకల్పించుట, నిశ్చయించుట, చింతించుట, అభిమానపడుట అను శక్తులను ప్రసాదించెను.
2. అటులే ఆదిశక్తి ప్రాణేంద్రియములకు పచనము చేయుట, స్పర్శనెరుగుట, పలికించుట, ఉచ్ఛ్వాస నిశ్వాసలు చేయుట, విసర్జన చేయుట అను శక్తులను ప్రసాదించెను.
3. జ్ఞానశక్తి జ్ఞానేంద్రియములకు శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధముల నెరుగు శక్తులను ప్రసాదించెను.
4. ఇచ్ఛాశక్తి విషయేంద్రియములకు విషయ వాసనలను కలిగించెను.
5. క్రియాశక్తికర్మేంద్రియములకు వచన, దాన, గమన, ఆనంద, విసర్జనలను చేయు శక్తులను ప్రసాదించెను.
6. అందువలన ప్రత్యగాత్మ అంతరేంద్రియముల ద్వారా సంకల్పించి జ్ఞానేంద్రియముల ద్వార విషయ పంచకమును తెలిసికొని కర్మేంద్రియముల ద్వారా కర్మాచరిస్తూ స్థూల దేహాభిమానియై జీవన విధానమును ఏర్పరచుకొని జీవించవలెనను ప్రగాఢ కాంక్షారూప జీవ భావము కలిగి జీవుడని పిలువ బడెను. అందువలన పంచశక్తుల నుండి జీవుడేర్పడెనని నిర్ణయించనైనది.

## పంచబీజముల నుండి ప్రాణము

1. అధిష్ఠాన చైతన్యము వలన సూత్రాత్మ పంచభూతములను సృష్టించి వానికి కదలిక కలిగించెను. వీణాతంత్రుల కదలిక వలన నాదమేర్పడిన విధముగ పంచభూతచలనము వలన ధ్వన్యాత్మకమగు శబ్దము కలిగెను. అది 1. పరా; 2. పశ్యంతి; 3. మధ్యమ; 4. వైఖరీ వాక్కులుగా మారెను. అట్లే వరుసగా ఆకాశ, వాయువు, అగ్ని, జలము, పృథివీ చలనమువలన వర్ణాత్మకమగు అం, యం, రం, వం, లం, బీజము లేర్పడి వాని వలన ఏబది వర్ణములేర్పడెను.

5×10=50

1. అం : 1. అం; 2.ఌ 3.ౡ 4.జ; 5. ఞ; 6. ణ; 7. న; 8. మ; 9.శ; 10.ఆః
2. యం : 1.యం; 2.అ; 3.ఆ; 4.ఏ; 5.క; 6.చ; 7.ట; 8.త; 9.ప; 10.ష
3. రం : 1.రం; 2.ఇ; 3.ఈ; 4.ఐ; 5.ఖ; 6.ఛ; 7.ఠ; 8.థ; 9.ఫ; 10.ళ
4. వం : 1.వం; 2.ఋ; 3.ౠ; 4.ఔ; 5.ఘ; 6.ఝ; 7.ఢ; 8.ధ; 9.భ; 10.ళ
5. లం : 1.లం; 2.ఉ; 3.ఊ; 4.ఓ; 5.గ; 6.జ; 7.డ; 8.ద; 9.బ; 10.హ

అంబీజము వలన ఆకర్షణ క్రియము, యం బీజము వలన ఉచ్చాటన క్రియము, రంబీజము వలన మారణ క్రియము, వంబీజము వలన మోహనక్రియము; లంబీజము వలన స్తంభన క్రియము జరిగెను. వీనివలన సమాన, వ్యాన, ఉదాన, ప్రాణ అపానములను ప్రాణ పంచక మేర్పడి పిండ బ్రహ్మాండముల వ్యాపించెను. అందువలన పంచబీముల వలన ప్రాణమేర్పడినదని నిర్ణయించనైనది.

## పంచాధి దేవతల వలన ప్రత్యగాత్మ

1. అధిష్ఠాన చైతన్యము వలన సదాశివుడు అంతరేంద్రియాధిష్ఠాన దేవతలగు కూటస్థుడు; 2. చంద్రుడు, 3. బృహస్పతి; 4.క్షేత్రజ్ఞుడు; 5.రుద్రుడను వారిని.
2. ప్రాణ పంచక అధిష్ఠాన దేవతలగు 1. జయుడు; 2. విశ్వయోని; 3. అజుడు; 4. విశిష్టుడు; 5. విశ్వకర్త అనువారిని ఈశ్వరుడు.
3. జ్ఞానేంద్రియ అధిష్ఠాన దేవతలగు 1. దిక్కులు; 2. వాయువు; 3. సూర్యుడు; 4. వర్ణుడు; అశ్వనీ దేవతలను వారిని రుద్రుడు.
4. విషయేంద్రియ అధిష్ఠాన దేవతలగు 1. సదాశివుడు; 2. ఈశ్వరుడు; 3. రుద్రుడు; 4. విష్ణువు; 5. బ్రహ్మలనువారిని విష్ణువు.
5. కర్మేంద్రియ అధిష్ఠాన దేవతలుగు : 1. అగ్ని; 2. ఇంద్రుడు; 3. ఉపేంద్రుడు; 4. బ్రహ్మ; 5. మృత్యువు అనువారిని బ్రహ్మ. ఇట్లు 25 ఇంద్రియములకు అధిపతులుగా నియమించిరి. వీరు ఇంద్రియములకు ప్రేరేపణ కలిగించగా అవి వాని పనులు నిర్వర్తించుకొనునపుడు జీవుడు 1. జాగృత; 2. స్వప్న; 3. సుషుప్తి; 4. తురీయములను అవస్థలకు లోనై జాగ్రతయందు విశ్వుడనియు, స్వప్నమునందు తైజసుడనియు, సుషుప్తియందు ప్రాజ్ఞుడనియు, తురీయమునందు ప్రత్యగాత్ముడనియు పిలువబడెను. ఈ ప్రత్యగాత్మ అవస్థా త్రయములకు సాక్షిగా మెలగుట వలన పంచాధి దేవతల వలన ప్రత్యగాత్మ యేర్పడెనని నిర్ణయించనైనది.

## ధర్మములు

1. స్థూల శరీర ధర్మములు : 1. బాల్యము; 2. కౌమారము; 3. యౌవనము; 4. వార్ధక్యము.
2. ఇంద్రియ ధర్మములు : 1. జాగృత; 2. స్వప్న; 3. సుషుప్తి; 4. తురీయము.
3. జీవ ధర్మములు : ఇంద్రియ భోగంబులననుభవించుట
4. ప్రాణ ధర్మములు : ఆకలిదప్పులు మరియు ఉచ్ఛ్వాస నిస్వాస
5. ప్రత్యగాత్మ ధర్మము : అవస్థాత్రయములకు సాక్షిగా నుండుట.

## శుద్ధులు

1. ఆసనముల వలన స్థూల శరీర శుద్ధి; 2. తారకయోగము వలన ఇంద్రియముల శుద్ధి; 3. సాంఖ్య యోగము వలన జీవశుద్ధి; 4. అమనస్క యోగము వలన ప్రాణశుద్ధి; 5. మహావాక్య శ్రవణాదుల వలన ప్రత్యగాత్మ శుద్ధి కలుగును.

## త్రివృత్కరణి

| సంఖ్య | భూతములు | స్థూలాంశ | మధ్యాంశ | సూక్ష్మాంశ | అధిష్ఠానము |
|---|---|---|---|---|---|
| 1. | పృథివి(అన్నం) | మలము | మాంసం శుక్లం | మనస్సు | ఆత్మ |
| 2. | జలము(నీరు) | మూత్రము | రక్తముషోణితం | ప్రాణము | వాయువు |
| 3. | అగ్ని(చమురు పదార్థాలు) | ఎముకలు | మజ్జ-మేధస్సు | వాక్కు | ఆకాశము |

1. పిండాండము :- మధ్యాంశములైన 1) మాంసము; 2) రక్తము; 3) మజ్జ మరియు సూక్ష్మాంశములైన 4) మనస్సు; 5) ప్రాణము; 6) వాక్కు కలిసి పిండాండమయ్యెను.
2. బ్రహ్మాండము :- పృథివి, జలము, అగ్ని మరియు అధిష్ఠానములైన ఆత్మ వాయువు ఆకాశములు కలిసి బ్రహ్మాండమయ్యెను.

## స్థూలాంగము - లింగాంగము

1. అన్నం యొక్క స్థూలము, మలము, మధ్యమము, మాంసము - సూక్ష్మము, శుక్లము - అతిసూక్ష్మము మనస్సు.
2. ప్రాణము యొక్క స్థూలము మూత్రము, మధ్యమము, రక్తము, సూక్ష్మము - షోణితము - అతి సూక్ష్మము ప్రాణము.

3. అన్న సూక్ష్మమగు శుక్లము జల సూక్ష్మమగు షోణితము కలిసి స్థూల శరీరమయ్యెను.
4. అన్నాతిసూక్ష్మము మనస్సు జలాతిసూక్ష్మము ప్రాణము కలిసి లింగ శరీరమయ్యెను.
5. ఈ లింగ శరీరమునే ఎరుకయని యందురు.
6. వేదాంతమునందు 1. స్థూల; 2. సూక్ష్మ; 3. కారణ; 4. మహాకారణములను నాల్గు దేహములు పిండాండమునకును.

   1. అనందాంగము; 2. చిన్మయాంగము; 3. చిద్రూపాంగము; 4. శుద్ధ లింగాంగము అను నాల్గు దేహములు బ్రహ్మాండమునకు కలవు. అయితే వీనినే 1. సమిష్టి స్థూలము; 2. సమిష్టి సూక్ష్మము; 3. సమిష్టి కారణము; సమిష్టి మహాకారణములని కూడ పిలుతురు.

## బ్రహ్మాండ నిర్ణయము

1. ఈశ్వరునికి పంచభూతములే శరీరము : 1. పృథ్వీపాదములు; 2. జలము కటి; 3. అగ్ని హృదయము; 4. వాయువు గళము; 4. ఆకాశము శిరస్సు.

సర్వ ప్రాణులకు అన్నము ఆధారము, ఈ అన్నము పృథివి నుండి లభించు చున్నది. కావున పృథ్వి అన్నస్వరూపము. పృథివి యందలి ఓషధులు జలముచే పోషింపబడుచున్నవి. కావున జలము కూడ అన్నరూపము. ఈ జలము అగ్నివలన మేఘమండలము వాని ద్వార వర్షము కలుగుచున్నది. కనుక అగ్ని కూడ అన్నరూపమే. అగ్ని వాయువు వలన ప్రకాశించుచున్నది. అందువలన వాయువు కూడ అన్నమే. ఈ వాయువు చలనమునకు ఆకాశ అవరణ మవసరమగుట చేత ఆకాశము అన్న స్వరూపమగుటచేత పంచభూతములు ఈశ్వరుని యొక్క అన్నమయకోశమనబడును. దీని ధర్మములు జనన మరణములు. దీని అభిమాని విరాట్.

2. పిండాండమందు గల 25 ఇంద్రియముల అధిదేవతలే ఈశ్వరునకు ఇంద్రియములు. 17 ఇంద్రియములతో కూడినది సూక్ష్మ శరీరము. కర్మేంద్రియ అధిదేవతలు 5+జ్ఞానేంద్రియ అధిదేవతలు 5+ ప్రాణేంద్రియ అధిదేవతలు 5+ చంద్రుడు + బృహస్పతి = 17 కలిసి సూక్ష్మశరీరము.

జ్ఞానేంద్రియ దేవతలు : 1. దిక్కులు; 2. వాయువు; 3. సూర్యుడు; 4. వర్ణుడు; 5. అశ్వనీ దేవతలు.

ప్రాణేంద్రియ దేవతలు : 1. జయుడు; 2. విశ్వయోని; 3. అజుడు;

4. విశిష్టుడు; 5. విశ్వకర్త. కర్మేంద్రియ దేవతలు; 6. అగ్ని; 7. ఇంద్రుడు; 8. ఉపేంద్ర; 9. బ్రహ్మ; 10. మృత్యువులు మరియు మనస్సునకు చంద్రుడు, బుద్ధికి బృహస్పతి కలిసి 17 ప్రాణమయ కోశము. దీని ధర్మము ఆకర్షించుట.

3. 1. దిక్పాలురు; 2. వాయువు; 3. సూర్యుడు; 4. వర్ణుడు; 5. అశ్వనీ దేవతలు; 6. చంద్రుడు కలిసి ఈశ్వరుని మనోమయకోశము దీని ధర్మము జీవులకర్మాను సారముగా వారియొక్క ఫలానుభవముల సృష్టించుట.

4. 1. దిక్పాలురు; 2. వాయువు; 3. సూర్యుడు; 4. వర్ణుడు; 5. అశ్వనీ దేవతలు; 6. బృహస్పతి కూడి ఈశ్వరుని విజ్ఞానమయ కోశము. దీని ధర్మము స్థితి చేయుట. అనగా ప్రాణమయ + మనోమయ + విజ్ఞానమయ కోశములు కలిసి సూక్ష్మశరీరము దీని అభిమాని హిరణ్యగర్భుడు. ఇదియే సమిష్టి లింగ శరీరం.

5. నిరవయాకాశమగు సమిష్టి ప్రాణము లేక పరాప్రకృతియే ఈశ్వరుని అన్నమయ కోశము. ఇదియే కారణ శరీరము. దీని ధర్మము సర్వము తనయందు లయము చేసికొనుట. దీని అభిమాని అవ్యాకృతుడు.

6. దహరాకాశమగు సమిష్టి అంతఃకరణమే ఈశ్వరుని హిరణ్మయకోశము. ఇదియే ఈశ్వరుని మహాకారణ శరీరమ. దీని ధర్మము తెలియజేయుట. దీనికి అభిమాని పరమాత్మ.

## మరొక విధముగా

1. 1. పంచాధిదేవతలు; 2. పంచ బీజములు; 3. పంచశక్తులు; 4. పంచ తన్మాత్రలు; 5. పంచమహాభూతములే ఈశ్వరుని స్థూల శరీరము.
2. 1. పంచాధిదేవతలు; 2. పంచబీజములు; 3. పంచశక్తులు; 4. పంచ తన్మాత్రలే ఈశ్వరుని సూక్ష్మశరీరము.
3. 1. పంచాధిదేవతలు; 2. పంచబీజములు; 3. పంచశక్తులు. ఈశ్వరుని కారణ శరీరము.
4. 1. పంచాధిదేవతలు; 2. పంచబీజములే ఈశ్వరుని మహాకారణ శరీరము ఈశ్వరుని 4 తనువులు కారణము. జీవుని 4. తనువులు కార్యము.
5. ఈశ్వరుడు ఎరుక జీవుడు మరుపు ఎరుకకు తన్మాత్రలు కలవు. మరుపుకు తన్మాత్రలున్నవి. ఈ రెండు ఒకటే. పరిపూర్ణము ఎరుక కాదు మరుపు కాదని అచల ఋషుల నిర్ణయము.

## పంచాకాశములు

| సంఖ్య | పంచాకాశములు | స్థానము | స్వరూపము | స్వభావము |
|---|---|---|---|---|
| 1. | పరాకాశము | అధిష్ఠానము | స్వప్రకాశము రాత్రింబవళ్ళు అనే నిర్ణయం లేదు | తెలిసికొనుట తెలియ జేయుట లేక తానుతానుగా నుండుట |
| 2. | దహరాకాశము | అవ్యక్తము (సమిష్టి అంతఃకరణం) | ప్రాతఃసంధ్యా రూపము చీకటి నశించి వెలుగుకుదారి | స్ఫురణ (సోకామయత బహుశ్యాం) |
| 3. | నిరవయాకాశము | దిక్కులు (పరాప్రకృతి) | సాయంసంధ్యారూపం వెలుగు నశించి చీకటికి దారి | కర్మఫలప్రదాత |
| 4. | సూర్యాకాశము | సూర్యుడు | ప్రకాశము | కర్మప్రేరకత్వము |
| 5. | భూతాకాశము | భూతసముదాయము | చీకటి | పంచీకృతమై విశ్వరూపము దాల్చుట |

## లయ పంచీకరణి

శరీరమందు ప్రాణముంటే శివం ప్రాణం పోతే శవం. బ్రహ్మాండమందు గల సూత్రాత్మపై పిండాండమందు గల పంచప్రాణములు ఆధారపడి యున్నవి. బ్రహ్మాండమందుగల సూత్రాత్మతో కలియుగమునకు వ్యానము తనపట్టును దేహమునుండి ఉపసంహరించుకొనును. సమానము నాభిస్థానము నుండి కదలును. అపానము సమానములో చేరును. నాడీమండలం అస్తవ్యస్తమగును. ఇంద్రియములు విచ్ఛిన్నమగును. తన్మాత్రలు తమ తమ గుర్తులతో సమానము ద్వారా ప్రాణమునకు చేరును. ఇంద్రియములు విచ్ఛిన్నము కాగా అధిష్ఠాన దేవతలు కూడ ప్రత్యగాత్మ గుర్తుయందు చేరిరి. ప్రాణము ప్రత్యగాత్మ గుర్తును స్వీకరించి ఉదానమునకు చేరెను. ఉదానము కంఠము నుండి బయలువెడలి ముఖమునుండి మనోరూప గుర్తుతో బయలు వెడలి బ్రహ్మాండములో లీనమగును. మరణ దేహము మన్నుగను, మన్ను నీరుగను... నీరు అగ్నిగా మారును. అగ్ని వాయువుగా మారును. వాయువు ఆకాశమందు చేరును. ఆకాశము మహదహంకారము నందు, అది మహత్తునందు, మహత్తు అవ్యక్తమునందు, అవ్యక్తము బ్రహ్మమునందు లీనమై గుర్తురూప శరీరము కలవాడగుటచేత కాలానుగుణ్యముగా పునరుద్భవమగును. ఈలోగ పరిపూర్ణ

గురుమూర్తి ద్వారా పరబయలును గుర్తెరిగి, గుర్తును బాసినచో దీపము శాంతము కాగా తాను తన ప్రకాశముతో వున్న చోటనే లేకపోయిన విధమున ఎరుక, గుర్తు, శరీరము మూడును లేకపోవును. జనన మరణభ్రాంతియు కూడ లేకపోవును.

## లయపంచీకరణ 2వ పద్ధతి

మనలో ప్రాణముంటే శివం – అది పోతే శవం. ప్రాణము పోయే సమయాన ఇంద్రియాల పటుత్వం తప్పుట వలన ఏ జ్ఞానమునకు స్పర్శ తన్మాత్ర చేరుట వలన మనస్సాయనో అవసాన కాలమున స్పర్శ తన్మాత్రవిడిపోగా మనస్సులయమగును. రూపతన్మాత్ర విడిపోగా బుద్ధి లయమగును. రసతన్మాత్ర విడిపోవుటచే చిత్తము లయమగును. గంధతన్మాత్ర విడిపోగా అహంకారము లయమగును. శబ్ద తన్మాత్ర వలన ఏర్పడిన జ్ఞానము మాత్రము నిలచును.

అట్లే వ్యానమునకు శబ్ద తన్మాత్ర చేరుటవలన ఏర్పడిన సమానము ఆతన్మాత్ర విడిపోవుటవలన సమానము, రూపతన్మాత్ర విడిపోవుట వలన ఉదానము, రసతన్మాత్ర విడిపోవుటవలన ప్రాణము, గంధతన్మాత్ర విడిపోవుట వలన అపానము లయమగును. స్పర్శ తన్మాత్రవలన ఏర్పడిన వ్యానము మాత్రము నిలుచును.

ఇక రూప తన్మాత్రచే ఏర్పడిన చక్షువునకు శబ్ద తన్మాత్ర చేరికవలన ఏర్పడిన శ్రోత్రము, స్పర్శ తన్మాత్రచే ఏర్పడిన త్వక్కు, రసతన్మాత్రచే ఏర్పడిన జిహ్వ, గంధ తన్మాత్రచే ఏర్పడిన ఘ్రాణము వాటి తన్మాత్రలు విడిపోవుట వలన శ్రోత్రము, త్వక్కు, జిహ్వ, ఘ్రాణము లయమగును. చక్షువు మాత్రము నిలుచును.

అదేవిధముగా రసతన్మాత్రచే ఏర్పడిన రసేంద్రియమునకు శబ్ద తన్మాత్ర వలన శబ్దేంద్రియము, స్పర్శతన్మాత్రవలన ఏర్పడిన రూపేంద్రియము గంధ తన్మాత్రచే ఏర్పడిన గంధేంద్రియములకు చెందిన తన్మాత్రలు విడిపోవుట వలన శబ్దేంద్రియము, స్పర్శేంద్రియము, రూపేంద్రియము, గంధేంద్రియము లయమై రసేంద్రియము మాత్రము నిలుచును.

చివరకు గంధ తన్మాత్రచే ఏర్పడిన గుదమునకు, శబ్ద తన్మాత్రవలన యైన వాక్కు, స్పర్శ తన్మాత్రవలన యైన పాణి, రూపతన్మాత్రవలన యైన పాదము, రస తన్మాత్రవలన యైన గుహ్యము ఆయా తన్మాత్రలు విడిపోవుట వలన వాక్కు, పాణి, పాదము, గుహ్యములయమై గుదము మాత్రముండును.

జీవుడు తన కర్మానుసారము ఆగామి కర్మను మూట కట్టుకొని ఆ గుర్తులన్నింటితో అతడు అంతఃకరణ స్వరూపమైన జ్ఞానమందు లయమగును.

ఈ జ్ఞానము వ్యానమునందు వ్యానము, చక్షువునందు, చక్షువు రసేంద్రియమునందు, రసేంద్రియము గుదమునందు లయమగును. సత్కర్మాచరణపరులు ముఖద్వారము నుండి అందుకు భిన్నులైన జీవులు గుదమునుండి లయము కాగా గంధ తన్మాత్ర మరణ దేహ రూపముగా మారును.

మరణదేహము మన్నగను, మన్ను నీరై, నీరు అగ్ని కాగా ఆ అగ్ని వాయువు నందు, వాయువు ఆకాశమునందు, ఆకాశము, మహదహంకారమునందు మహద హంకారము మహత్తునందు లయమై అవ్యక్తస్థితియందు నిలుచును కదలిక లేక పోవును. అయితే వెళ్ళిన జీవి కర్మయానము, పితృయానము, దేవయానముల పయనించి నను వారు వారు తమయందు నిలుపుకొనిన గుర్తులననుసరించి శింశుమార చక్రమునకు చేర్చబడి అటనుండి సూర్యమండలమునకు సూర్య మండలమునుండి చంద్రమండలమునకు అట నుండి మేఘరూపమును ధరించి, వర్షరూపమున కురిసి ఓషధులయందు చేరి అన్నముగా మారి ఋణానుబంధము ననుసరించి అయా రూపములు ధరించును.

అచలర్షి కరుణకు పాత్రులై గుర్తులేని స్థితియందున్న వారు కదలని అచలస్థితి నుండి శూన్యమై శూన్యమే మహాశూన్యమై ఏమీలేక ఏమిగాక పోవుదురు.

శ్రీ సద్గురవేనమః

# అధిష్ఠాన చేతన బ్రహ్మము నుండి జీవేశ్వర జగత్తు ఉత్పత్తి విధానము

1. అధిష్ఠాన చేతన బ్రహ్మము ఒక్కటియే తనకు తానై నేనను అహంకార వృత్తియైనను లేకయుండెను. ఈ స్థితియందు దానికి పురుషోత్తముడని పేరు. కాని ఆ బ్రహ్మమునందు సత్వరజస్తమస్సులను త్రిగుణములు అత్యంత సూక్ష్మరూపముగా బీజరూపమై యుండెను.

2. నిద్రనుండి మెలకువవచ్చిన రీతిగా ఆ బ్రహ్మమునకు ఒక దశయందు గుణత్రయ విజృంభణ వలన నేను అనే అహంవృత్తి కలిగి ఆ పిమ్మట ఆ నేను ఎవరు? ఎక్కడ ఉన్నది. ఇత్యాది సంకల్పములు కలిగి ఆయా ప్రశ్నలకు జవాబు తనకు తెలియనందున ఆ బ్రహ్మమునకే అనంతరము అవ్యక్తము అను పేరు కలిగెను. త్రిగుణములు కొంచెము వ్యాపకము చెందిన అనగా స్ఫురణ వికసించి యుండి నందున ఈ అవ్యక్తమునకే త్రిగుణ గర్భిణి అనియు మూల ప్రకృతి అనియు ప్రదానము అనియు పేర్లు వచ్చెను. యిందు సత్వ రజస్తమో గుణములు

హెచ్చుతగ్గులుగా ఉండక సమపాళ్ళలో ఉండును. కనుక దీనికి గుణసామ్యావస్థ అనియు పేరు.

3. అనంతర దశయందు ఈ త్రిగుణములు సామ్యావస్థనుండి తప్పుకొని ఒక్కొక్కటి గా విజృంభించి మిగతారెండు గుణములను అణగద్రొక్కి (అధిగమించి) తమ మహిమనే ప్రకటింపజొచ్చెను. ఆ విధముగా సత్వగుణము విజృంభించి రజస్తమో గుణములను అణగద్రొక్కినప్పుడు మూల ప్రకృతికే శుద్ధమాయ అని పేరువచ్చెను. ఏలననగా సత్వగుణము జ్ఞాన ప్రకాశము వలన శుద్ధ మాయగా ఉండును. తమోగుణము వలన అజ్ఞాన లక్షణము కలది. అది విజృంభించగా దానికి మలిన మాయ అని పేరువచ్చెను. సత్వగుణము. తమోగుణము మిశ్రమమై యున్నపుడు రజోగుణము ఏర్పడినందున రజోగుణ ప్రధానమగు మూల ప్రకృతి అవ్యక్తముగా నుండక మార్పు చెందుచుండును. ఈ త్రిగుణములోను సత్వగుణ ప్రధానమగు మూల ప్రకృతి అవ్యక్తముగా నుండక మార్పు చెందుచుండును. ఈ త్రిగుణముల లోను సత్వగుణ ప్రధాన మగు శుద్ధమాయతో కూడిన చేతన బ్రహ్మమునకు కూటస్థుడనియు అక్షరపురుషుడనియు, ఈశ్వరుడనియు పేర్లు 1. ఈశ్వరుని సత్వగుణాంశముచే దేవతాసృష్టి అంతయూ కలిగెను. 2. రజో గుణ ప్రధానమగు మిశ్రమమాయతో కూడిన ఈశ్వరుని నుండి 84 లక్షల జీవోపాదులు కలిగెను. 3. తమోగుణ ప్రధానమగు మలిన మాయతో కూడిన ఈశ్వరుని నుండి, పంచ భూతములు (ప్రకృతి) కలిగెను. ఈ 3 విధములగు మాయను తన స్వాధీనమందే ఉంచుకొని దానిపై పెత్తనము వహించి పాలించుచుండినందున ఈయనకు ఈశ్వరుడని పేరు కలిగెను.

శుద్ధమాయతో కూడిన చేతన బ్రహ్మమునకే ఈశ్వరుడని పేరు. ఈ విధముగా ఆదిలో ఒక్కచేతన బ్రహ్మమే తానుతానుగా ఉండి ఈశ్వరుడుగాను, జీవునిగాను, జగత్తుగాను మార్పు చెందెను. కనుక ఈశ్వరుడు, జీవుడు జగత్తుగా నుండు సమస్తమును వస్తువుయొక్క విమర్శనా దృష్టిచే చూచిన యెడల ఒక్క చేతన బ్రహ్మయే అయి ఉన్నది బ్రహ్మమునకు అన్యముగా ఏమియు కొంచమైననూ లేదని తెలియవలెను.

## బ్రహ్మణోన్యంనకించన

సత్వగుణము పాలు ఎక్కువగా యున్నందున ఈశ్వరుని యందును జీవుని యందును తెలివి ఎక్కువగా ఉండి ప్రకటమగుచున్నది. మలినమాయ అనగా తమోగుణము ఎక్కువగా ఉన్నందున జగత్తునందు తెలివి అంతగా ఎక్కువ

ప్రకటమగుట లేదు. జగత్తు జడము అందురే కాని దానియందును కొద్ది తెలివియున్నది. కాని సత్వగుణము తక్కువగుటచే ఆ తెలివి అంతగా ఎక్కువగా పైకి కనబడుట లేదు. అది మరుగైమరుపురూపముగా నున్నది.

## తారకము షట్చక్రముల నిర్ణయము

మన శరీరములో 72 వేల నాడులు కలవు. వీనిని రెండు విధములుగా వైద్యులు దమనులుగాను, సిరలుగాను విభజించిరి. ధమనులు పరిశుద్ధ రక్తమును శరీరమునకందజేయుటకు సిరలు చెడు రక్తమును రక్త శుద్ధి కర్మాగారమగు గుండెకు కొనిపోయి శుభ్రపరచుటకు దోహదపడును. వీనిలో ముఖ్యమైన పది. అతి ముఖ్యమైనవి మూడు నాడులు కలవు. ఈ నాడులు కొన్ని కొన్ని చోట్ల కలియుట విడిపోవుట జరుగును. ఊర్ధఘంటిక అథోఘంటిక లనుపేర రెండు ఘంటికలు కలవు. ఊర్ధ్వ ఘంటిక మూర్ధ్ని స్థానమునయుండును. శిరస్సునందు గల మేధస్సులేక మెదడు శృతి స్మృతులను రెండు విధముల తెలివిని కలిగియుండును. ముందు భాగమున కల మెదడు మనము వినేవి కనేవి అంటే శబ్దములను, స్పర్శలను, రూపములను, రసములను, గంధములను గ్రహించుటకుపయోగపడును. వెనుక భాగమున గల మెదడు గ్రహించిన విషయములను తనయందు భద్రపరచుకొని సమయానుకూలముగ మనకు గుర్తు చేయును. ఇది దెబ్బతినినచో తానెవ్వరో తనకే తెలియదు. ఇక తన చుట్టూర గల ప్రపంచమును తాను తెలిసికొనలేదు. శిరస్సున కుడివైపున గల ఒక నరము దెబ్బతినుట గాని రక్తము గడ్డకట్టి రక్త ప్రసరణమునకు అవరోధము కలిగించినచో శరీరమందలి ఎడమభాగము దెబ్బతినును. ఎడమ భాగము దెబ్బతినినచో కుడిభాగమునకు రక్త ప్రసరణముగాక ఆ భాగము చచ్చును. దానినే పక్షవాతమంతురు. ఆ భాగపు తెలివి స్పర్శలు నశించును. ఊర్ధ్వఘంటికపైన ఆధారపడి వ్యానవాయువు శీతోష్ణములను మనకు తెలియజేయును. లేనిచో ఏమియు గుర్తెరుగలేము. మనలో గుర్తు నశించును.

అధోఘంటికకు స్థానము నాభి. మన ఆహారము పచనము చేసిన రసముగా అనగా గ్లోకోజ్‌గా మార్చి దానిని రక్తమునందు చేర్చి సమముగా నాడీ సంచారమునకు దోహదపడును. నాభి జీవుడుండుచోటు అనగా క్షరస్థానము. ఈ జీవునకే క్షేత్రజ్ఞుడనే పేరుకూడ కలదు. ఇయ్యది సమానవాయునకు తోడ్పడును. ఇక అక్షరుడు, ఈశ్వరుడనుపేర పిలువ బడువాడు కూటస్థుడు. ఇతని స్థానము భ్రూమధ్యము. తర్వాత సర్వాధిష్ఠాన చైతన్య స్వరూపమైన బ్రహ్మతత్వమునకు స్థానము మూర్ధ్ని

అని అచలఋషుల నిర్ణయము.

ఇక ముఖ్యమైన పదినాడుల గురించి తెలిసికొందాము. 1. గాంధారి+2. హస్తిని యను ఈ రెండు నాడులు మనకు చూపును అందజేయును. వీనినే 'ఆప్టిక్ నర్వ్' అని అందురు. కుడివైపు గాంధారి, ఎడమవైపు హస్తిని అను నాడులుండును. 3. పూష అనునాడి కుడిచెవియందు, 4. ఆలంబ అనునాడి ఎడమచెవియందు వినికిడి కలుగజేయును. ఇవి దెబ్బతింటే చెవుడు వచ్చును. చెవుడు శిశువునకు వస్తే ఆ శిశువు మూగ వాడగును. 5. జిహ్వాయను నాడి నాలుక యందుండును. అది పని చేయనిచో నత్తి వచ్చును. చక్కగామాట్లాడలేదు. 6.పయశ్వని యను నాడి కంఠమందుండును. ఇది ఉదానవాయువునకు తోడ్పడును. వైఖరీ పలుకులు పలుకుట కుపకరించును. 7. శంఖని నాభియందండి సమాన వాయువునకు సహకరించును. ఇదే ప్రాణవాయువునకు కూడ ఆధారము. 8. శినీవాలియను నాడి గుహ్యా మందుండును. ఇది మూత్రవిసర్జనకు తోడ్పడును. 9. రత్నాహ్వాయు అను నాడి శుక్ల ద్వారమునందుండును. ఈ రెండు అనగా శినీవాలి రత్నాహ్వాయు రతిక్రీడయందు సతిపతులకు ఆనందానుభూతిని కలిగించును. 10. కుహు అను నాడి గుదముయందుండి మలవిసర్జనకు తోడ్పడును. చివరి మూడు నాడులు అపాన వాయువునకు కూడ ఉపకరించును.

అతి ముఖ్యమైన మూడు నాడుల గురించి తెలిసికొందాము. ఒక వీణకు మూడు తంత్రులున్నట్లు ఈ మొండెమునందు మూడు నాడులు కలవు. 1. ఇడ; 2. పింగళ; 3. సషుమ్న అని వీనికి పేరు. ఇడ ముక్కు ఎడమ భాగమునుండి భ్రూమధ్య స్థానమునకు చేరి అలాగే శిరస్సునుండి వెన్నెముక చివరి భాగమును చేరును. పింగళ ముక్కు కుడిభాగమునుండి బయలుదేరును. సుషుమ్న ముక్కు మధ్యభాగమునుండి బయలుదేరును. ఇవి రెండూ కూడ వెన్నెముక చివరి స్థానమునకు చేరును. ఈ మూడు స్త్రీల జడవలె వెన్నెముకను అల్లుకొని యుండును. ఈ వెన్నెముకకు బ్రహ్మదండియని యోగులు పిలుతురు. చక్రములు, కమలములు లేక పద్మములని అందురు. ఇవి పిండబ్రహ్మాండములందు కలసి పది యుండునని యన్నారు. కాని ఆధారమునుండి అనగా గుదస్థానమునుండి భ్రూమధ్యస్థానము వరకు 6 చక్రములని, మూర్ధ్ని స్థానమున గల సహస్రారముతో 7 చక్రములని తారకయోగులు తెలిపియున్నారు. కాని నవీన శాస్త్రజ్ఞులు యీ శరీరమందు కూడ దశ చక్రములు కలవని అన్నారు. వీరు తమశక్తిని ఆయా చక్రములయందు ప్రసరింపజేసి వ్యాధి నిరోధకమునకు దోహదపడుచున్నారు.

మనము ముక్కు ద్వారా శ్వాసనులోనికి తీసికొనుట ఉచ్ఛ్వాస , బయటకు వదలుటను నిశ్వాసయని యందురు. ఈ శ్వాస రెండున్నర ఘడియలు లేక ఒక గంటకు ఎడమ ముక్కు రంధ్రమునుండి కుడి ముక్కు రంధ్రమునకు అట్లే కుడి ఎడమలుగా మారుచుండును. ఇలా బ్రహ్మాండమునందు వాయువు పిండరూప శరీరమందు ప్రవేశించి నిష్క్రమించును. ఈ వాయువు కొలిమి తిత్తులలోనికి వెళ్ళి బహిర్గతమైనపుడు కొలిమిని వెలిగించినట్లు లోనికి పీల్చబడిన గాలి లేక ఊపిరితిత్తుల లోనికి వెళ్ళి బహిర్గతమగుచుండును. కాని కొంతభాగము రక్త నాళములందు లీనమై జీవి యొక్క జీవన విధానమునకు ఉపయోగపడుచుండును.

అయితే యీ వూపిరినే ప్రాణమని అందురు. ఈ ప్రాణము ముక్కు రంధ్రములనుండి పాము బుస కొట్టినటుల శబ్దముతో బయలు వెడలుటచేత దీనిని నాగేంద్రుడనియు, జీవునికి ఇది వాహనమగుటచేత హంసయని కూడ యోగులు పేరిడిరి. ఇది మన శరీరమందు 1. సమాన; 2. వ్యాన; 3. ఉదాన; 4. ప్రాణ; 5. అపానములను పేర పిలువబడును. ఇవి వరుసగా 1. నాభి; 2. సర్వాంగము; 3. కంఠము; 4. హృదయము; 5. కటి స్థానములందుండి వివిధ వ్యవహారములు అయిదు రూపములతో చేయుచుండుటచేత పంచవన్నెల రామచిలుక అని కూడా అన్నారు.

మన వ్రేళ్ళు వీణాతంత్రులను సోకగనే శబ్దోత్పత్తి జరిగినట్లుగా ఈ హంస ఆయాదళములను తాకగానే ఆయా శబ్దము లుత్పత్తి యగుచుండును. ముందు యీ శరీరమనే ఘటమును దానియందలి కమలములను పరిశీలించుదాం.

## 1. ఆధారచక్రము

మనమిపుడు గుదస్థానమునందు గల ఆధారచక్రమును పరిశీలించుకొందాము. పైన పేర్కొన్న అతిముఖ్యనాడులకు మూలము ఇదే. దీనినుండే అవి బయలుదేరును. అంటే మనము ఆసనము వేసి కూర్చొనుటకు ఇదే ఆధారము. యోగులు యోగాభ్యాసము చేసికొనుటకు భోగులు తమ లోక వ్యవహారములు చేసికొనుటకును ఇది ఆధారమగుటవలన దీనిని ఆధారచక్రము లేక ఆధార కమలమనికూడ అందురు. దీనికి నాల్గు దళములుండును. ఈ నాలుగు దళములందు వ,శ,ష,స అను అక్షరములకు ఇది ఉత్పత్తి స్థానము. ఇది పృథ్వీ భూత సంబంధమగుటచేత పృథ్వికి చతుష్కోణాకారమను చిహ్నముగా పెద్దలు నిశ్చయించిరి. ఇది కుంకుమ వర్ణము కలిగి యుండును. ఈనాడు మ్యాచింగ్ యుగమగుటచే ఎన్నో రకముల కుంకుమలు వచ్చినవి. కాని మన పెద్దలు ఎరుపువన్నెకే కుంకుమయని అన్నారు. కమల మధ్య

మందు 'లం' బీజముండును. ఈశ్వరుని పంచముఖములలో సద్యోజాత ముఖము కలిగి యుండునని చెప్పుదురు. ఇది క్రియాశక్తి స్వరూపిణి. దీనికి గణపతి అధిదేవత. ఇదే భూలోకం. ఇచ్చట ఇతనిని సద్భక్తితో కింకిణీనాదము అనగా గజ్జెలందియల సవ్వడితో ఆరాధించవలెనని పెద్దలందురు. ఒక్కో దళమునకు 150 చొప్పున 4 దళములకు 600 హంసలు సమర్పించబడాలి. ఈ నాల్గు దళములు ఘ్రాణేంద్రియము యొక్క లక్షణములు తెల్పును. ఘ్రాణేంద్రియమునకు సువాసన, దుర్వాసన సువాసనలో దుర్వాసన, దుర్వాసనలో సువాసన కలిసియుండుట చేత ఈ చక్రమునకు నాల్గు దళములు పెద్దలు నిర్ణయించియున్నారు. జీవుడు హంసారూఢుడై ఉదయము 6 గంటల నుండి 6గంటల 40 నిమిషముల వరకు ఇక్కడ నివాసముండునని గుర్తెరుగవలెను. ఒక్కొక్క దళమునకు 10ని. చొప్పున 4 దళములకు 40 ని.లు నిర్ణయించడమైనది. ఇక్కడ నాకొక సామెత గుర్తుకొచ్చుచున్నది. అదేమన "ప్రథమం దుర్జనం పూజయేత్ సజ్జనం తదనంతరం ముఖ ప్రక్షాళనాత్ పూర్వం గుద ప్రక్షాళనం కుర్యేత్" అనగా ఉదయం మేల్కొంటేనే చెంబు తీసుకొని బహి ప్రదేశమునకు వెళ్ళవలెనని దీని భావం.

## 2. స్వాధిష్ఠాన చక్రము

జీవుడు స్వయముగా యీ స్థానమును అధిష్టించి ప్రపంచోత్పత్తికి పూను కొనుటచే దీనికి స్వాధిష్ఠానమనే పేరు వచ్చినది. ఇది గుహ్య ప్రదేశమున యుండును. బ,భ,మ,య,ర,ల అను 6 అక్షరములుండుటచేత ఆరు దళములుగా నిర్ణయించిరి. ఇది జల భూతమగుటచేత అర్ధచంద్రాకారము నిర్ణయించిరి. జలమునకు అర్ధచంద్రాకార గుర్తునిడిరి. ఈ కమలమధ్యమున వం బీజముండును. ఎందుకన జలతత్వమునకు వం బీజమును సాంఖ్యులు నిర్ణయించిరి. దీని ముఖము వామదేవ ముఖము అని అనిరి. ఇది విద్యుత్ కాంతి వర్ణము కలిగి యుండును. ఇక్కడ ఇచ్ఛాశక్తినివసించును. దీనికి అధిపతి బ్రహ్మ. ఇదే భువర్లోకము. వీణానాదముతో బ్రహ్మను నైష్ఠిక భక్తి అనగా నిష్ఠ కలిగి ఇతనిని ధ్యానించవలెను. ప్రతిదళము ఒక వెయ్యి చొప్పున ఆరుదళములకు ఆరువేలహంసలు సమర్పించవలెను. ఈ ఆరు దళములు జిహ్వాయందుగల ఆరు రుచులను తెలియజేయును. జీవుడు ఉదయం 6 గంటల 40 నిమిషాలనుండి మధ్యాహ్నం 1 గంట 20 నిమిషాల వరకు ఇక్కడ నివాసముండును. ఒక్కొక్క దళమునకు 1గం. 6ని. $6^2/_3$ సె. చొప్పున దళమునకు 6గం. 40ని. కాలము పట్టును. అంటే మధ్యాహ్నిక భోజన సమయమును మధ్యాహ్నిక సంధ్యావందనానంతరము యీ పని ముగించుకొనవలెనని తెలిసికొనవలెను.

### 3. మణిపూరక చక్రము

ఇక్కడ మణులచే పొదగబడిన సింహాసనముండుటచే మణిపూరకమని యందురు. ఇది నాభిస్థానమున యుండును, డ,ఢ,ణ,త,థ,ద,ధ,న,ప,ఫ అను అక్షరములు కలిగిన పదిదళములు ఇక్కడ యుండును. ఇది అగ్ని తత్వమగుటచేత త్రికోణాకారమును నిర్ణయించిరి. ఇది శ్యామల వర్ణము కలిగియుండును. అగ్నికి 'రం' బీజమగుటచేత కమల మధ్యమున దీనినేర్పరచిరి. అంతేగాక త్రికోణాకార మేర్పరచిరి. దీని ముఖమును అఘోరముఖముగా నిర్ణయించిరి. ఇక్కడ జ్ఞానశక్తి నివసించును. దీనికి అధిపతి విష్ణువు. దీనినే మహర్లోకమనియందురు. వేణు నాదముతో అవధానభక్తితో ఇతనిని ధ్యానించవలెను. ప్రతి దళమునకు 500 చొప్పున ఆరువేల హంసలు ఇచట సమర్పించవలెను. ఇదియే సువర్లోకము. ఈ పది లక్షణములు నేత్రమునకు కలవు. అవి యేమన - 1. పొట్టి; 2. పొడుగు; 3. లావు; 4. సన్నము; 5. ఎరుపు; 6. తెలుపు; 7. నలుపు; 8. పసుపు; 9. ఆకుపచ్చ; 10. గులాబీ అనే దశవిధరూపములను నేత్రము గ్రహించును. ఈ చక్రమునకు నేత్రమును కారణముగా నిర్ణయించిరి. జీవుడు ఇక్కడ మధ్యాహ్నం 1 గంటల 20 నిమిషముల నుండి రాత్రి 8 గంటల వరకు ఉండును. సాయం సంధ్యావందన క్రియానంతరము భోజనము ముగించుకొని నిదురించవలెనని గ్రహించవలెను. అయితే ఒక్కొక్క దళమునకు 40 ని. చొప్పున 10 దళములకు 400 నిమిషములు లేక 6గం.40 ని. కాలము పట్టును.

### 4. అనాహతకమలము

ఈ అనాహత కమలము హృదయస్థానమునకు మధ్యన యుండును. దీనికి 12 దళములు. క, ఖ, గ, ఘ, ఙ, చ, ఛ, జ, ఝ, ఞ, ట, ఠ అను అక్షరముల కుత్పత్తి స్థానము. ఒక్కొక్క దళమునకు 500 చొప్పున 12 దళములకు 6 వేల హంసలు సమర్పించబడును. వాయుభూత మగుటచేత షట్కోణాకార గుర్తు దీనికి నిర్ణయించిరి. ఇది బంగారు వర్ణము కలిగియుండును. దీని మధ్యభాగమున 'యం' బీజము నిర్ణయించిరి. ఇది తత్పురుష ముఖము కలిగియుండును. ఇందు ఆదిశక్తి వసించును. దీనికి రుద్రుడు అధిపతి. శంఖనాదము చేయుచు భవభక్తితో ఇతనిని ధ్యానించవలెను. దీనికి మూలము త్వగింద్రియము. ఇది ఈ క్రింది స్పర్శలను- 1.తల్లి, 2. తండ్రి, 3. భార్య; 4. తనయులు; 5. సోదరులు; 6. మిత్రులు; 7. ధనము; 8. వాత; 9. పిత్తము, 10. శ్లేష్మము; 11. శరీరధారణ; 12. శరీర విసర్జన లక్షణములను ద్వాదశ దళములుగా నిర్ణయించిరి. జీవుడు నిద్రావస్థలో

రాత్రి 8 గంటలనుండి 2 గంటల 40 నిమిషముల వరకు ఇక్కడ వాసము చేయును. అంటే నిదురలో ఉచ్ఛ్వాస నిశ్వాసలు తప్ప మరేమీ యుండవు. ఇదే మహర్లోకము. అయితే ఒక్కొక్క దళమునకు 33 ని.20సె. చొప్పున 12 దళములకు 6 గం.40 ని. కాలము పట్టును.

## 5. విశుద్ధచక్రం

విశుద్ధ కమలమునకు స్థానము కంఠము. దీనికి 16 దళములుండును. అ,ఆ,ఇ,ఈ,ఉ,ఊ,ఋ,ౠ, ఌ ,ౡ,ఏ,ఐ,ఓ,ఔ, అం,అః అను అక్షరములు ఆ దళముల యందుత్పన్నమగుచున్నవి. జీవునకు గల నాల్గవస్థలు అనగా 1.జాగ్రత, 2. స్వప్న, 3. సుషుప్తి, 4. తురీయము అను అవస్థలు ఒక్కొక్కటి నాల్గు భాగములు కాగా అనగా

1. జాగ్రత; 2. జాగ్రతలో స్వప్నము; 3. జాగ్రతలో సుషుప్తి 4. జాగ్రతలో తురీయము-అట్లే
1. స్వప్నము; 2. స్వప్నములో జాగ్రత; 3. స్వప్నములో సుషుప్తి; 4. జాగ్రతలో తురీయము - అట్లే
1. సుషుప్తి; 2. సుషుప్తిలో జాగ్రత; 3. సుషుప్తిలో స్వప్నము; 4. సుషుప్తిలో తురీయము - అట్లే
1. తురీయము; 2. తురీయములో జాగ్రత; 3. తురీయములో స్వప్నము; 4. తురీయములో సుషుప్తి - ఇట్లు 4 ×4=16 అవస్థలే పదహారు దళములుగా నిర్ణయింపబడినవి. ఇది ఆకాశ తత్త్వమగుటచేత వర్తులాకారము నిర్ణయించనైనది. దీని మధ్య భాగమున 'అం' బీజము నిర్ణయించిరి. ఇది ఈశాన ముఖము. స్ఫటిక వర్ణము కలిగి యుండును. ఇందు పరాశక్తి వసించును. దీనికి అధిపతి ఈశ్వరుడు. ఇతనిని స్వానందభక్తితో మేఘ గర్జన చేయుచు ధ్యానించవలెను. దీనికి కారణము శ్రోత్రము. ఈ శ్రోత్రము శబ్దమును గ్రహించును. ఈ శబ్దములు కూడ జీవుడు 16 విధములుగా గ్రహించుటచేత 16 దళములు నిర్ణయింపబడినవి. 1. మెట్టెలు; 2. గజ్జెలు; 3. గాజులు; 4. వేణువు; 5. భేరి; 6.మృదంగము; 7. గంటానాదము; 8. తాళధ్వని; 9. ఘటవాద్యము; 10. నాదస్వరము; 11. నాగస్వరము; 12. వీణ; 13. మేఘ ఘర్జన; 14. తబలా; 15. హార్మోని; 16. వివిధ కంఠస్వరాలు. ఈ ఆకాశ తత్త్వ సంబంధమైనవి. జీవుడు రాత్రి 2గం.40 నిమిషములనుండి 3గం-46 ని॥ 40 సెకండ్లవరకు కూడ నిదురలోనే యుండును. దీనినే జనలోకమని యందురు. ఒక్కొక్క దళమునకు 4ని.10 సె. చొప్పున 16 దళములకు 1గం. 6ని.40 సె. కాలమగును.

## 6. అజ్ఞాచక్రము

ఈ అజ్ఞా చక్రమునకే ఆగ్నేయచక్రమని కూడ యందురు. ఇక్కడ జ్ఞాత సకలేంద్రియములు తమ తమ పనులు చేసికొనుటకు ఆజ్ఞాపించి క్రియోన్ముఖము చేయుటచేత యీ పేరు వచ్చినది. దీనికి హం, క్షం అను రెండక్షరములు కలిగిన రెండు దళములుండును. ఇది భ్రూమధ్యస్థానమున నుండును. ఇది మహత్తత్వం బిందు త్రికోణాకారములో నుండును. ఇది బీజ రహితమైనది. ఇది అంతర్ముఖము కలిగియుండును. మాణిక్యవర్ణమయమైనది. ఇది చిచ్ఛక్తి స్వరూపము. దీనికి అధిపతి సదాశివుడు. ఇతనిని సమరస భక్తితో అబ్ధినాదముతో ధ్యానించవలెను. దీనికి మూలము మనస్సు, మనస్సునకు సంకల్పము, వికల్పమనే రెండు లక్షణములు. ఇక్కడ ఒక్కొక్క దళమునకు 500 చొప్పున వెయ్యి హంసలు సమర్పించబడును. 3గం-46ని. 40సె. నుండి 4గం. 53ని. 20 సెకండ్లవరకు జీవుడు ఇచ్చట నివసించును. దీనినే తపోలోకమని యందురు. ఇప్పటినుండి 6 గంటలవరకు బ్రాహ్మీ ముహూర్తమందురు. ఈ సమయము యోగ సాధనకు విద్యాభ్యాసమునకు ఇది మంచిది. మేధాసంపత్తి జ్ఞాన సంపదను పెంపొందించును. ఒక్కొక్క దళమునకు 33 ని. 20సె. చొప్పున రెండు దళములకు 1గం. 6ని. 40సె. కాలము పట్టును.

## 7. సహస్రార చక్రము

ఈ సహస్రార చక్రమునే అష్టదళపద్మమని కూడ అందురు. ఎనిమిది పెద్ద దళములుండును. వానిపై ఒక్కొక్క దళమున 124 దళములు పేర్చబడి నట్లుండును. ఒక్కొక్క దానికి 125 చొప్పున 8 కి 1000 దళములగుటచే సహస్రారమని యందురు. ఇది మూర్ధ్నిస్థానమున నుండును. ఇది ఊర్ధ్వముఖము కలిగుండును. ఈ దళములకు అక్షరములు లేవు. ఎందుకన ఇది అధిష్ఠాన చైతన్యస్వరూపం. ఇది షట్కోణ బిందు యుక్తం. కాని ఇందు ఓంకార బీజముండును. ఇది సర్వసాక్షియగుటచే సహస్రముఖ మయమైనది. చిత్రవర్ణములు కలిగినది. దీనికి సహజాత్మశక్తి గలదు. దీనికి పరబ్రహ్మ స్వరూపుడైన గురుమూర్తి అధిపతి ఝుంకార నాదముతో పరమభక్తితో ఇతనిని ధ్యానించవలెను. దీనికి మూలము లేక కారణము జ్ఞానమగుటచేత సర్వమును తెలిసికొను లక్షణము దీనికుండును. ఇందు జీవుడు 4 గం. 53ని. 40సె. నుండి 6 గంటలవరకు వాసమొనర్చును. అజ్ఞాచక్ర నివాస సమయమునుండి సహస్రార్ధచక్రసమయమునకు బ్రాహ్మీ ముహూర్తమందురు. ఈ కాలమున ప్రాతః సంధ్యావందనము తప్పక ఆచరించవలెను. ఇదే సత్యలోకము. ఒక్కొక్క దళమునకు 4 సెకండ్ల చొప్పున సహస్ర దళములకు 400 సెకండ్లు అనగా 1గం. 6ని. 40 సె. కాలము పట్టును.

# అమనస్కయోగము

1. జీవుడు మనోరూపుడై మూర్ధ్నిస్థానమున గల అష్టదళపద్మము నందు సంచరించగా ఈ క్రింది మార్పులు కలుగును.
1. పూర్వ దళమునకు చేరగా పుణ్యమతి కలుగును.
2. ఆగ్నేయ దళమునకు చేరగా నిద్ర మరియు ఆలస్యము కలుగును.
3. దక్షిణ దళమునకు చేరగా క్రూరబుద్ధి కలుగును.
4. నైఋతి దళమునకు చేరగా పాపబుద్ధి కలుగును.
5. పశ్చిమ దళమునకు చేరగా క్రీడలయందు ఆసక్తి కలుగును.
6. వాయవ్యదళమునకు చేరగా క్రీడలయందు ఆసక్తి కలుగును.
7. ఉత్తర దళమునకు చేరగా రతియందు ప్రీతి కలుగును.
8. ఈశాన్య దళమునకు చేరగా ద్రవ్యదానము చేయుబుద్ధి కలుగును.
9. మధ్యభాగమునకు చేరగా వైరాగ్యబుద్ధి కలుగును.
10. కేసరమునందు ప్రవేశించగా జాగ్రదావస్థ కలుగును. స్థానము భ్రూమధ్య.
11. కర్ణికయందు ప్రవేశించగా స్వప్నం కలుగును. స్థానము కంఠము.
12. లింగమునందు చేరగా సుషుప్తి అవస్థ కలుగును. ఇవి యోగులకు భోగులకు సమానమే. స్థానము హృదయం.
13. పద్మ త్యాగమునందు తురీయస్థితి కుదురును అనగా అధిష్ఠాన పరబ్రహ్మ జ్ఞానమునందే మనస్సునుంచు కొనినచో విషయ వాసనలకు లోనుగాక మనస్సు బ్రహ్మతత్వమునందు తాదాత్మ్యము చెందును. స్థానము మూర్ధ్ని బ్రహ్మరంధ్రం. ఇదియే అమనస్కయోగమనబడును.

ఇక్కడ ఒక విషయమును గమనించవలెను. అదే మన విశుద్ధ చక్రమందు వెయ్యి హంసలు అని చెప్పబడిన ఒక్కొక్క దళమును 62 హంసల చొప్పున 992 మాత్రమే సమర్పింపబడును. 8 హంసలు లుప్తమగునని చెప్పబడినది. కాని జనలోకమునకు తపోలోకమునకు మధ్య గోలోకమొకటి కలదు. ఈ గోవు జనులను వైతరిణీ నదిని దాటించునని పురాణములు ఘోషించుచున్నవి. ఆ గోవు ఒక్కొక్క పాదమునకు రెండు గిట్టలుండును. గిట్టకు ఒకటి చొప్పున 4 పాదములకు 8 గిట్టలుండును. ఆ 8 హంసలను ఆ గోవు స్వీకరించును లేక మనము సమర్పించు కొనవలెను. అక్కడ రాధాకృష్ణులుందురు కావున ఆ 8 హంసలు రాధాకృష్ణులకు సమర్పించుకొనుచున్నామని అర్థము. అందువలన 'పయనించే ఓ చిలుకా ఎచటికో పరుగిడుచుంటివి నేడు' అను తత్వములో 'గోమండలమున గోపీనాథుని కోరి

భజించితివేమో' అని తెలియజేయబడినది.

శ్రీ దయానంద రాజయోగీంద్రులవారు జీవుడు పితృయాన, కర్మయాన, దేవయానముల ద్వారా పరలోక గమనము చేయునపుడు 600+1600+1200 = 3,400 హంసలు బ్రహ్మాండమందు సమర్పించుకొనునని యనిరి. దీనిని గూర్చి పరమహంస ప్రబోధినియను గ్రంథమును చూడగలరు.

సరే! దినమునకు 21,600 హంసలు ఆయా స్థానమున ఆయా హంసలు సమర్పించబడునని తెలిసికొన్నాము. అదెట్లో ఆలోచిద్దాము. మనకు మన శరీరమందు 72 వేల నాడులున్నవని తెలుసుకొన్నాము. ఇడా, పింగళ, సుషుమ్నల ద్వారా బ్రహ్మాండము నుండి గ్రహింపబడిన అమృతబిందువులు బ్రహ్మ రంధ్ర స్థానమునుండి ఈ మూడు నాడులయందు ప్రవేశించి మిగతా 72వేల నాడులకు సరఫరా చేయబడును. అందువలన ఆ నాడులయందు గల ప్రాణశక్తి 3 రెట్లు పెరుగును. అనగా 72000×3=2,16,000 అనగా రెండు లక్షల పదహారువేలగును. ముఖ్య నాడులు 10 అని చెప్పుకున్నాము. అవి బాహ్యేంద్రియములు ఆయా పనులు చేయుటకు ఆ శక్తిని తాము లాగుకొనును. 216000÷10 అనగా పదిచేత భాగించగా 21600. ఇరువదొక్కవేల ఆరువందల హంసలు షట్చక్ర సంచారమునకు వినియోగింపబడునని అర్థమగుచున్నది. మరొక విధముగా ఆలోచించగా దినముకు 60 ఘడియలు ఒక ఘడియకు 60 విఘడియలు 1 విఘడియకు 60 లిప్తములు అనగా 60×60×60=2,16,000 లిప్తములగును. ఈ లిప్తములను పదినాడులు దానిని తమలో లయము చేసికొనును. 216000÷10 = 21600 మాత్రమే మిగులును. అనగా పది లిప్తముల కాలమునకు ఒక హంస చొప్పున ఒక దినమునకు ఇరువదొక్క ఆరువందల హంసలు ఆయా స్థానములలో ఆయా అధిపతులకు ఒక దినములో సమర్పింపబడునని అవగతమగుచున్నది.

మరొక విషయము మన వ్యవహారమందు ప్రాణము ఈ విధముగా నష్టమగు చున్నది.

1. పనిలేని సమయమున 8 అంగుళముల శ్వాసను తీసికొని 12 అంగుళముల శ్వాసను వదలుదుము. అనగా 4 అంగుళముల శ్వాసను మనము నష్టపోవు చున్నాము.
2. నడచుటయందు 8 అంగుళములు తీసుకొని 16 అంగుళములు వదలు చున్నాము. నష్టము 8 అంగుళములు.
3. పరిశ్రమ అనగా పని పాటలు చేయుటయందు 10 అగుళాలు తీసుకొని 20

అంగుళాలు వదలుచున్నాము. నష్టము 10 అంగుళాలు.

4. మాట్లాడుట (ఉపన్యసించుట, చర్చించుట, వాదించుటయందు 12 అంగుళాలు తీసుకొని 24 అంగుళాలు వదలుట జరుగును. నష్టము 12 అంగుళాలు.
5. నిద్రయందు 15 అంగుళాలు తీసుకొని 30 అంగుళాలు వదులుదుము. 15 అంగుళాలనష్టము.
6. పరుగెత్తుటయందు 27అంగుళాలు తీసుకొని 54అంగుళాలు వదులుదుము. నష్టము 27 అంగుళాలు.
7. రతిక్రీడయందు 24 అంగుళాలు తీసుకొని 64 అంగుళాలు వదులుదుము. 40 అంగుళాలు నష్టము. కాన ప్రాణాయామము వలన ప్రాణ రక్షణ చేసికొనవలెనని యోగులందురు.

ఈ ప్రాణము ఆయా కార్యముల వలన లయమగుచున్నదని విచారణలో వ్యక్తమైనది. షట్చక్ర సంచారమందు కూడ ఇది జరుగునని పెద్దలు నిర్ణయించి యున్నారు. ఎట్లనగా సహస్రారమందు సమర్పింపబడు 1000 హంసలలో $333^{1}/_{3}$ లయమగుననియు అట్లే ఆజ్ఞాచక్రమునందు కూడ $333^{1}/_{3}$లయమగుననియు, విశుద్ధచక్రము నందు కూడ $333^{1}/_{3}$ లయమగుననియు అనాహత చక్రమునందు 2 వేలు మణిపూరకమందు 2 వేలు, స్వాధిష్ఠానమునందు 2 వేలు ఆధారమందు 2 వందలు లయమగును.

అనగా $333^{1}/_{3}+333^{1}/_{3}+333^{1}/_{3}+2000+2000+ 2000+2000 =$ 7200 హంసలు లయము కాగా $666^{2}/_{3} + 666^{2}/_{3} + 666^{2}/_{3} + 4000 + 4000 +4000 + 400 = 14,400$ హంసలు మాత్రమే ఆయా చక్రములు స్వీకరించునని గ్రహించవలెను. దీని వివరము ఇందు జతపరచిన షట్చక్రమును తిలకించగలరు.

బ్రహ్మరంధ్రస్థానము చెవుల రంధ్రాలు, కండ్ల రంధ్రాలు, ఎక్కడుండునో అక్కడ సుషుమ్న నాడి యుండును. అదే కుండలీస్థానము, త్రివేణీ సంగమము, ద్వాదశాంతము చతుఃపీఠము, త్రికూటము, ముక్తి ద్వారము, శృంగాటకం, పూర్ణ స్మశానము, ఆపోజ్యోతి స్థానము, పరమాత్మస్థానమని యందురు. ఈ రంధ్రమధ్యమున పింద, బ్రహ్మాండ, ఈశ్వరాండములన్నియు ఇమిడి ఉన్నవని కుండలోపనిషత్తు నిర్ణయించినది.

ఆగ్నేయ చక్రమున హం-క్షం అను రెండక్షరములలో మొదటి 'హం' ఆధారచక్రమునందు వ,శ,ష,స అను నాల్గక్షరములలో చివరిది 'స' ఈ రెండక్షరములు

కూడితే హంసయను పేరు మనకు లభించును. అనగా షట్చక్రములయందు సంచరించు హంస ఊర్ధ్వమునుండి అథోభాగమగు ఆధారమునకు చేరగా 'హంస' అదే మళ్ళీ ఊర్ధ్వమునకు చేరగా 'సహం' అనగా అదే నేను అని అర్థము. అట్లే వదలక జరుగుటవలన సోహం -హంసోహం అను భావన వ్యక్తమగును. అంటే అదే నేను నేనే అది అను భావన వ్యక్తమగును. దానినే అజపా గాయత్రి యని పిలుతురు. 'సోహం' యను ధ్వానియందు అ+ఉ+మ కారములు యున్నవి. దానినే ఓంకార స్వరూపమని కూడా అందురు.

జపము మనము మనస్సు చేత చేయుదుము. అలా మనస్సుతో పని లేకుండగనే తనకు తానే యీ జపము జరుగుచున్నది. అందువలన దీనినే అజపా గాయత్రి యని యందురు. వాయువును ఆశ్రయించి గంధతన్మాత్ర ఎలా ఉండునో అలాగే యీ వాయువును ఆత్మ ఆశ్రయించి యుండును. బ్రహ్మదేవుడు హంస వాహనుడని, విష్ణువు గరుడవాహనుడని మన పెద్దలందురు. ఇక్కడ బ్రహ్మ యనగా జీవుడని గ్రహించవలెను. విష్ణువు యనగా ఈశ్వరుడని అర్థము చేసికొనవలెను.

ముక్కు కొనయందు దృష్టియుంచి ఉచ్ఛ్వాస నిశ్వాసాలపైన మనస్సును లగ్నము చేయుటయే తారకయోగమని యందురు. ఈ యోగము వలన భూత భవిషద్వర్తమాన గతులను గమనించవచ్చును. అలా గమనించిన పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వాముల వారు కాలజ్ఞానమును వ్రాసిరి. ఇలా శ్వాసపై ధ్యాస యుంచుటయే తారకయోగము. శ్రీ బుద్ధ భగవానులు కూడ యీ మార్గము నవలంబించి తన జాతక కథలు చెప్పిరి. బ్రహ్మంగారు వీరభోగ వసంతరాయలుగా అవతరింతుమని చెప్పిరి. ఈ మధ్యనే పంచన్‌లామా అని పిలువబడు నాతడు కూడ బుద్ధావతారమని ఆ అనుయాయుల నమ్మిక. కొందరు శ్వాసలోనికి తీసికొనునపుడు 'రా' అను సంకల్పమును బహిర్గతమగునపుడు 'మ' అను సంకల్పమును మనసులో చేసికొనిన 'రామతారక' మని చెప్పుదురు.

రేచకము అనగా శ్వాసను బహిర్గతమొనర్చుట, పూరకము అనగా వాయువును లోనికి పూరించుట, కుంభకమనగా వాయువును తనలోనే నిలుపుకొనుట. శ్వాస రెండున్నర ఘడియల కొకమారు కుడి నుండి ఎడమకు ఎడమనుండి కుడికి మారునని తెలిసికొంటిమి. తన ఇష్టానుసారము శ్వాసను అటునుండి ఇటకు ఇటనుండి అటకు నడుచునట్లు ప్రయత్నము చేయుటయే ప్రాణాయామము. దీని అభ్యాసము వలన వ్యాధులు నిరోధించుకొనవచ్చును.

పతంజలియోగ శాస్త్రమునందు యమ, నియమ, ఆసన, ప్రాణాయామ,

ప్రత్యాహార, ధారణ, ధ్యాన సమాధి అని అష్టాంగయోగము కలదు. ఈ కుంభకమునే ధారణ అని అందురు. మూలబంధము, జాలంధరబంధము, ఓడ్యాణ బంధముల ద్వారా ఆధార చక్రము నందు దాగియున్న ప్రకృతిని లేక కండలినీశక్తిని ఊర్ధ్వగామిని గావించి సహస్రార చక్రమునందు నిలుపుటను వారు సమాధిస్థితి యనియనిరి. దానినే కొందరు ప్రకృతి పురుష సంయోగమని యనగా మరికొందరు జీవ బ్రహ్మైక్యము అని కూడా యన్నారు. ఈ స్థితియందున్నపుడు మనస్సు నిశ్చలంగా యుండును. ఈ నిశ్చలత మనము గాఢనిదురలో కూడ నున్నపుడు యుండును.

ఇవన్నీ తిరిగి వచ్చే మార్గములే కాని తిరిగి రాని మార్గములు కావు. ఉన్న పరిపూర్ణమును వున్నదని తెలిసికొనుటయే నిజమైన పూరకము లేని ఎరుక లేదని నెరుగుటయే రేచకము. ఉన్నదానియందు నేనెన్నడు లేననే భావన కుంభకము లేక ధారణ. నేను నన్నావరించిన సర్వము లేనిదే నాకు మూలము లేదు ప్రవేశించుట కవకాశము కాని స్థానము కాని లేదు. లేని అధిష్ఠానము కలదను భావమే భ్రాంతి. ఆ భ్రాంతినుండి నన్ను నేను విడిపోవుటయే నేను లేకపోవుట ఇదియే రాకడా పోకడా లేని రాజమార్గము. ఇదియే శ్రీమదచలర్షి రామడుగు శివరామ దీక్షితీయ సిద్ధాంతము. ఇదియే నిజమైన భవతారకము.

## మహావాక్య విచారణ

| సంఖ్య | మహావాక్యము | వ్యవహారనామం | వేదము | ఉపనిషత్తులు | అర్థము |
|---|---|---|---|---|---|
| 1. | ప్రజ్ఞానం బ్రహ్మ | విధివాక్యం లేక నిధి ధ్యాసవాక్యం | ఋగ్వేదం | తైతీరియోపనిషత్తు | ప్రజ్ఞానమే బ్రహ్మ |
| 2. | అహంబ్రహ్మాస్మి | అనుభవవాక్యం, మనన వాక్యం శిష్యవాక్యం | యజుర్వేదం | బృహదారణ్యక ఉపనిషత్తు | నేనేబ్రహ్మ |
| 3. | తత్వమసిబ్రహ్మ | ఉపదేశవాక్యం గురువాక్యం | సామవేదము | చాందోగ్యో పనిషత్తు | అది అనగా బ్రహ్మము నీవే అయితివి |
| 4. | అయమాత్మబ్రహ్మ | సాక్షాత్కారవాక్యం | అథర్వణ వేదము | మాండూక్యో పనిషత్తు | ఈ ఆత్మయే బ్రహ్మ |

1. తనయందు సర్వము సర్వమునందు తనను ఏ జ్ఞానము గుర్తెరుగునో ఆ జ్ఞానము ప్రజ్ఞతో కూడినది. ఆత్మ జ్ఞానమునకు బ్రహ్మమునకు వేరు లేదు.

అందువలన ప్రజ్ఞానం బ్రహ్మ అని నిర్ణయించనైనది.

2. అధోరూప పరిణామము వలన విషయ వాసనలకు లోనై జీవభావముతో నున్న తాను ఊర్ధ్వ ముఖుడై తాను ప్రత్యగాత్మ స్వరూపుడేనని తెలిసికొని నేను బ్రహ్మను ఐతిని అని తృప్తి చెందును. అదియే అహం బ్రహ్మోస్మి.

3. తత్ అనగా అది లేక పరమాత్మ, త్వం అనగా నీవు ప్రత్యగాత్మ, అసి అనగా ఐక్యము, బంగారము నగలుగా మారి ఆయా నగలపేరుతో పిలువబడును. ఆ నగలె బంగారము అను ఐక్యభావము కలిగినట్లు ఈ ప్రత్యగాత్మయే పరమాత్మయను ఏకభావము కలుగుటయే తత్వమసి అదియే బ్రహ్మస్వరూపము.

4. పిండాండమందు జీవనముతో జీవాత్మ అని పిలువబడు ఈ ఆత్మయే బ్రహ్మ అని తెలుసుకొనుటయే అయమాత్మ బ్రహ్మ.

శ్రీ సద్గురవేనమః

## అధిష్ఠాన చేతన బ్రహ్మము నుండి జీవేశ్వర జగత్తు ఉత్పత్తి విధానము

1. అధిష్ఠాన చేతన బ్రహ్మము ఒక్కటియే తనకు తానై నేనను అహంకార వృత్తియైనను లేకయుండెను. ఈ స్థితి యందు దానికి పురుషోత్తముడని పేరు. కాని ఆ బ్రహ్మమునందు సత్వరజస్తమస్సులను త్రిగుణములు అత్యంత సూక్ష్మరూపముగా బీజరూపమై యుండెను.

2. నిద్రనుండి మెలకువవచ్చిన రీతిగా ఆ బ్రహ్మమునకు ఒక దశయందు గుణత్రయ విజృంభణ వలన నేను అనే అహంవృత్తి కలిగి ఆ పిమ్మట ఆ నేను ఎవరు? ఎక్కడ ఉన్నది. ఇత్యాది సంకల్పములు కలిగి ఆయా ప్రశ్నలకు జవాబు తనకు తెలియనందున ఆ బ్రహ్మమునకే అనంతరము అవ్యక్తము అను పేరు కలిగెను. త్రిగుణములు కొంచెము వ్యాపకము చెందిన తర్వాత అనగా స్ఫురణ వికసించి యుండినందున ఈ అవ్యక్తమునకే త్రిగుణ గర్భిణీ అనియు మూల ప్రకృతి అనియు ప్రధానము అనియు పేర్లు వచ్చెను. యిందు సత్వ రజస్తమో గుణములు హెచ్చు తగ్గులుగా ఉండక సమపాళ్ళలో ఉండును. కనుక దీనికి గుణసామ్యావస్థ అనియు పేరు.

3. అనంతర దశయందు ఈ త్రిగుణములు సామ్యావస్థనుండి తప్పుకొని ఒక్కొక్కటిగా విజృంభించి మిగతా రెండు గుణములను అణగద్రొక్కి (అధిగమించి) తమ మహిమనే ప్రకటింపజొచ్చెను. ఆ విధముగా సత్వగుణము విజృంభించి రజస్తమో

గుణములను అణగద్రొక్కినప్పుడు మూల ప్రకృతికే శుద్ధమాయ అనిపేరు వచ్చెను. ఏలననగా సత్వగుణము జ్ఞాన ప్రకాశము వలన శుద్ధమాయగా ఉండును. తమోగుణము వలన రూప అజ్ఞాన లక్షణము కలది. అది విజృంభించగా దానికి మలినమాయ అని పేరు వచ్చెను. సత్వగుణము. తమోగుణము మిశ్రమమై యున్నపుడు రజోగుణము ఏర్పడినందున రజోగుణ ప్రధానమగు మూల ప్రకృతి అవ్యక్తముగా నుండక మార్పు చెందుచుండును. ఈ త్రిగుణములోను సత్వగుణ ప్రధానమగు మూల ప్రకృతి అవ్యక్తముగా నుండక మార్పు చెందుచుండును. ఈ త్రిగుణములలోను సత్వగుణ ప్రధానమగు శుద్ధమాయతో కూడిన చేతన బ్రహ్మమునకు కూటస్థుడనియు అక్షరపురుషుడనియు, ఈశ్వరుడనియు పేర్లు 1. ఈశ్వరుని సత్వగుణాంశముచే దేవతాసృష్టి అంతయూ కలిగెను. 2. రజో గుణ ప్రధాన మగు మిశ్రమమాయతో కూడిన ఈశ్వరుని నుండి 84 లక్షల జీవోపాదులు కలిగెను. 3. తమోగుణ ప్రదానమగు మలిన మాయతో కూడిన ఈశ్వరుని నుండి, పంచభూతములు (ప్రకృతి) కలిగెను. ఈ 3 విధములగు మాయను తన స్వాధీనమందే ఉంచుకొని దానిపై పెత్తనము వహించి పాలించుచుండి నందున ఈయనకు ఈశ్వరుడని పేరు కలిగెను.

శుద్ధమాయతో కూడిన చేతన బ్రహ్మమునకే ఈశ్వరుడని పేరు. ఈ విధముగా ఆదిలో ఒక్కచేతన బ్రహ్మమే తానుతానుగా ఉండి ఈశ్వరుడుగాను, జీవునిగాను, జగత్తుగాను మార్పు చెందెను. కనుక ఈశ్వరుడు, జీవుడు జగత్తుగా నుండు సమస్తమును వస్తువు యొక్క విమర్శనా దృష్టిచే చూచిన యెడల ఒక్క చేతన బ్రహ్మయే అయి ఉన్నది బ్రహ్మమునకు అన్యముగా ఏమియు కొంచమైననూ లేదని తెలియవలెను. బ్రహ్మణోన్యంనకించన.

సత్వగుణము పాలు ఎక్కువగా యున్నందున ఈశ్వరుని యందును జీవుని యందును తెలివి ఎక్కువగా ఉండి ప్రకటమగుచున్నది. మలినమాయ అనగా తమోగుణము ఎక్కువగా ఉన్నందున జగత్తునందు తెలివి అంతగా ఎక్కువ ప్రకటమగుట లేదు. జగత్తు జడము అందురేకాని దానియందును కొద్ది తెలివి యున్నది. కాని సత్వగుణము తక్కువగుటచే ఆ తెలివి అంతగా ఎక్కువగా పైకి కనబడుట లేదు. అది మరుగైమరుపురూపముగా నున్నది.

# ప్రణవ స్వరూప నిర్ణయము

శ్లో॥ ఓంకారప్రభవం సర్వం-త్రైలోక్యం సచరాచరం
ఓమిత్యేవ పరంరూపం - హృత్పద్మేచ వ్యవస్థితమ్ ॥ ఉగీ.

చరాచరాత్మకమగు ఈ లోకత్రయమును సర్వమును ఓంకారం వలననే పుట్టినవి. ఇది హృదయ కమలమందు "ఓం" అనురూపముతో విరాజిల్లుచున్నది. అని పై శ్లోకమువలన తెలియబడుచున్నది.

శ్లో॥ త్రిస్థానంచత్రిమాత్రంచ - త్రిబ్రహ్మత్ర్యక్షరం తథా
త్రిమాత్ర మర్ధ మాత్రంచ - ప్రణవస్య విశేషతః ఉ.గీ.

శ్లో॥ అష్టాంగంచ ఛతుష్పాదం - త్రిస్థానం పంచదైవతమ్।
ఓంకారంయో నజానాతి - బ్రాహ్మణోన సబ్రహ్మణః॥

ప్రణవమునందు మూడు స్థానములును, మూడు మాత్రలును, ముగ్గురు బ్రహ్మలును మూడక్షరములును, మూడు మాత్రలును అర్ధ మాతృకయును ఎనిమిది అంగములును, నాలుగుపాదములును, అయిదుగురు దేవతలును కలరు. ఈ వివరణ తెలిసిన వారెవరో వారే బ్రాహ్మణులు. తెలియని వారిని సద్బ్రాహ్మణులని కాని బ్రాహ్మణులని కాని పిలువబడుట కర్హులు కారు. అని పై రెండు శ్లోకముల యొక్క భావము.

శ్రీ భాగవత కృష్ణ దేశికేంద్రుల వారు తల్లావఝుల జాలమాంబ గారికి బోధించిన ద్వాదశ విధ బోధలయందు ప్రణవార్థమునుగూర్చి సీసపద్యమందు నిట్లు వివరించిరి.

సీ॥ జనులార ప్రణావార్థమును సద్గురుజేరి - సచ్ఛిష్యుడడిగిన సంతసించి
వినుమని జెప్పి జీవుని నాల్గంగముల్ గల వీశ్వరునికి నాల్గంగములును
గలవని లోచన కంజాతకమున జూడుమెరుపు, తెలుపునల్పుమేఘవన్నె
లివిజీవకాంతులు యెరుపులోపచ్చన, తెలుపులోపలనలుపు,నలుపులోన
తే॥గీ॥ శ్యామలము సునీలమందున స్ఫటిక కాంతి
గలుగునివి యీశ్వరుని దేహకాంతులన్ని
తనువులకు మీద శుద్ధ, పీత స్వరూపు
డైన బ్రహ్మంబు గలిగిందు నతడె నీవు ॥

అనగా ప్రణవము నాలుగు వ్యావృతులుగా వ్యాపించి యున్నదనియు దాని యందు అకార ఉకార మకార అర్ధమాతృక లను కళలు నేత్ర స్థానమందుగలవనియు నాలుగు వర్ణములు జీవ తను చతుష్టయమును గూర్చి తెలుపుననియు,ఎరుపు

అకారమునకు ప్రతీక మరియు స్థూల దేహమునకు సంజ్ఞ అనియు, తెలుపు ఉకారమునకు మరియు సూక్ష్మదేహమునకు గురుతనియు, నలుపు మకారమునకు మరియు కారణ శరీరమునకు సూచికనియు మేఘవన్నె లేక సునీలము అర్ధ మాతృకకు మరియు మహాకారణ శరీరమునకు ప్రతీకగా వివరించిరి. అట్లే ఎరుపు లోపల నలుపు సూక్ష్మదేహమును గూర్చి సూచించెననియు నలుపు లోపల శ్యామలము కారణ దేహమును గూర్చి వివరించుననియు సునీలమందు స్పటిక కాంతి మహాకారణ దేహమును గూర్చి చాటుననియు అష్టదేహంబులకు మీద శుద్ధ పీత స్వరూపమైన బ్రహ్మ తత్వము కలదు ఆ బ్రహ్మతత్వమునకు నీవు వేరుకాదు.అదే నీవు, నీవే అదియని ఆ పద్యమందలి భావము.

## శ్రీకృష్ణుడు భగవద్గీతయందు

శ్లో॥ ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యావహరన్మా మనుస్మరన్
యఃప్రయాతి త్యజన్ దేహం సయాతి పరమాంగతిమ్॥

అని అర్జుననకుపదేశించిరి. ఓమ్‌యను ఈ ఏకాక్షరమే బ్రహ్మ స్వరూపము. దీనిని నిరంతరము అనగా బొందిలోకొనయూపిరున్నంతవరకు మనస్సు నందు ధ్యానించుచుండిన వాడు దేహమును వీడగనే మోక్షమును బొందునని భగవానుడభయ మొసగెను.

అవాంతర వాక్యములలో "ఓమ్ ఇత్యేకాక్షరంబ్రహ్మ" అను వాక్యమునకు ప్రధమ స్థానము కలదు. భగవానుడు భగవద్గీతయందు కూడ ఏకాక్షరిగానే ప్రబోధించిరి. కాని "శృతస్య భిన్నః స్మృతస్య భిన్నాః అను శృతి ననుసరించి భేదములు కలవు.

నారదమహర్షి దీనిని అమాతృకగా నుడువగా శ్రీ వశిష్టుల వారు దీనిని త్రిమాతృకగా వివరించిరి. కాని యాజ్ఞవల్క్యుల వారు దీనిని చతురాక్షరిగా వర్ణించిరి. అందువలన శ్రీభాగవత కృష్ణ దేశికేంద్రుల వారు దీనిని చతురాక్షరిగానే స్వీకరించి తమ ప్రణావార్థ ప్రకాశిక యందద్దానిని బలపరిచిరి. కావున"అకార" "ఉకార" 'మ' కార అర్ధమాతృకా స్వరూపమైన ఈ ప్రణవము వలన ప్రపంచమెట్లు ప్రభవించెనో పరిశీలించెదము.

"అ"కారములయము పొందగాభూమి, అగ్ని,ఋగ్వేదము, భూలోకము బ్రహ్మలు ఆవిర్భవించిరి.

ఉకారము లయము పొందగా అంతరిక్షము, యజుర్వేదము, భువర్లోకము సనాతనుడైన విష్ణువు ప్రభవించిరి.

"మ"కారమువలన ద్యులోకము,సూర్యుడు, సామవేదము,స్వర్లోకము, మహేశ్వరుడు నుద్భవించారని శాస్త్రములు ఘోషించినవి.

అట్లే వాక్కు, పాణి, పాదము,గుహ్యము, గుదములను కర్మేంద్రియములు, శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధములను విషయేంద్రియములు, శ్రోత్రము, త్వక్కు, చక్షువు,జిహ్వ, ఘ్రాణములను జ్ఞానేంద్రియములు; సమానము, వ్యానము, ఉదానము, ప్రాణము, అపానములను ప్రాణేంద్రియములు, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారములను అంతఃకరణచతుష్టయమను ఇరువది నాలుగు తత్వములతో కూడినస్థూల దేహమును, జాగ్రదావస్థయును దీని యభిమాని విశ్వుడును, క్రియా శక్తియును, రజోగుణమును కలిగి నేత్ర స్థానమున ఆవాస మేర్పరచుకొని యుక్తభోగము లనుభవించు ఈ యాత్మ జీవాత్మ యను పేరున పిలువబడును. అనగా "అ" కారము వలన జీవుడేర్పడెనని భావము.

"ఉ"కారము వలన జ్ఞానేంద్రియములైదు, ప్రాణేంద్రియములైదు మనస్సు మరియు బుద్ధితో కూడిన సూక్ష్మశరీరము కలిగెను. ఈ శరీరమునకు స్వప్నావస్థయును తైజసుడను అభిమానియును ఇచ్ఛాశక్తి సాత్విక గుణమును కలిగెను. దీనికి స్థానము కంఠము. స్వేచ్ఛా భోగము ఈ అభిమాని కల్గి యుండును. దీనిని అంతరాత్మయని బుధులు పిలిచెదరు. ఈతడే ప్రాతిభాసకుడని పిలువబడే జీవుడు.

"మ" కారము వలన స్థూల, సూక్ష్మ శరీరముల రెంటికిని కారణమగు కారణ శరీర మేర్పడెను. ఈ శరీరమునకు సుషుప్తి అవస్థయును, ప్రాజ్ఞుడను అభిమానియు, తామస గుణమును ద్రవ్య శక్తియును కలిగెను. దీనికి స్థానము హృదయము. దీనికే ఆనందభోగము. ఈ కారణ శరీరమందు అవ్యాకృతుడను అభిమానము మహదహంకారమును కారణ శరీరమును అను త్రివిధ లక్షణము లుండుటచేత దీనికి త్రిగుణ గర్భమను పేరు కలిగెను.

అనగా అకారము వలన ఆనందాంగమను పిలువబడు సమిష్టి స్థూల శరీరమును మరియు వ్యష్టి స్థూలశరీరమును వాని అభిమానములును అయిన విరాట్టు, విశ్వుడను పేరుగల అభిమానులును సమిష్టి మరియు వ్యష్టి జాగ్రదావస్థలును రజో గుణమును క్రియాశక్తియును, సృష్టి కర్తయును, కలిగి సకల జీవోపాదులు సృష్టింపబడి విశ్వ వ్యవహారములకు నిలయమైన మిశ్రమ ఎరుక యేర్పెడెనని వ్యక్తమగు చున్నది. ఇదే సకల జీవోపాధుల స్వరూపము. 'దీనికి స్థానము నేత్రము. ఇదే ఋగ్వేదమును ప్రజ్ఞానం బ్రహ్మయను విధివాక్యమునకు మూలస్థానము.

ఉకారము వలన చిన్మయాంగము అని పిలువబడు సమిష్టి సూక్ష్మ

శరీరమును మరియు వ్యష్టి సూక్ష్మ శరీరమును దీనికి అభిమానులైన హిరణ్య గర్భుడును మరియు తైజసుడును, ఈ రెంటికి సంబంధించిన స్వప్నావస్థలును సత్వగుణమును ఇచ్ఛా శక్తియును కలిగిన విష్ణువు ప్రభవించి స్థితికారకుడై జగత్తును పోషించుచుండును. ఇట్టి లక్షణములు గల దీనిని శుద్ధ ఎరుకయని అచల ఋషుల నిర్ణయం. ఇది పంచాధి దేవతలకు నిలయము, దీనికి స్థానము కంఠము, యజుర్వేదమును అహం బ్రహ్మాస్మియను అనుభవ వాక్యమునకు నిలయమయ్యెను.

మకారము వలన చిద్రూపాంగము అని పిలువబడు సమిష్టి కారణ శరీరమును మరియు వ్యష్టి కారణ శరీరమును ఈ రెండింటికిని అభిమానులైన అవ్యాకృతుడును మరియు ప్రాజ్ఞుడును సుషుప్తి అవస్థయును తమోగుణమును జ్ఞాన శక్తియును, రుద్రుడును కలిగిరి. సృష్టిని స్థితిని లయమొనరించు మలినపు ఎరుక దీని వలన కలిగెనని రూఢియగుచున్నది. ఇది పంచభూతాత్మక మయము. దీనికి స్థానము హృదయము. సామవేదము తత్వమసియను ఉపదేశవాక్యమును మకారము వలన నుద్భవించెనని తెలియబడును.

అర్ధమాతృకవలన శుద్ధలింగాంగము అని పిలువబడు సమిష్టి మహాకారణ శరీరమును మరియువ్యష్టిమహాకారణ శరీరమును ఈ రెంటికి సంబంధించిన పరమాత్మ మరియు ప్రత్యగాత్మలనుఅభిమానులు తురీయావస్థలును ప్రధాన గుణమునుపరాశక్తియును సదాశివుడును వారివలన ప్రాప్తమగు మోక్షమును, దాని కాధారమగు అఖండ ఎరుక లేక పరాఎరుకకాధారమని స్పష్టమగుచున్నది. దీనికి స్థానముమూర్ధ్ని. అధర్వణవేదమును అయమాత్మబ్రహ్మ యనబడు సమాప్త వాక్యమునకు స్థానమని సువ్యక్తమగుచున్నది. అనగా ఈ ఓంకారము సగుణ నిర్గుణములకును సాకారనిరాకారములకును, నిలయమైన అధిష్టాన చైతన్యమునకును దానినుండి ప్రకటమైన మాయ జగత్తులకును ఆధార ఆధేయముగా నున్నదని స్పష్టమైనది.

అందులకే శ్రీమద్భాగవతుల శ్రీకృష్ణదాసుగారు "పంచాశదక్షరముల ప్రపంచము తానుద్భవించె ప్రణవాక్షరమందంచు శృతులెన్నె" అని తమ కందార్థమందు నుటంకించిరి. శ్రీ సచ్చిదానంద వేంకటేశ్వర అవధూతగారు తమ సద్గురు భక్త శతకమునందు

ఓంకార పీఠమందు గురుబోధ నొనరుగా నుండునెపుడు।
అహంకార రహితులయ్యి నాత్మలోవినవలయుభక్తులారా॥

అని నుడివి యున్నారు. మరియు ఉత్తర గీతయందు

శ్లో॥ యోవేదాదౌ స్వరః ప్రోక్తో - వేదాంతేచ ప్రతిష్ఠితః
తస్య ప్రకృతి లీనస్య యఃపరః సమహేశ్వరః॥

యనిభగవానుని ఉవాచ. ఆ శ్లోకభావమేమనగా ఏ వేదములు కలవో వాని ఆదియందును, మద్యయందును మరియు అంత్యము నందును యేస్వరము చెప్పబడినదో ఆ స్వరమే ప్రణవముఅని పిలువబడు ఓంకారము, అదేసృష్టికి మూలమగు ప్రకృతి. ఆ ప్రకృతియొక్క లయమునకు పరమై యుండువాడే మహేశ్వరుడని భావము. "ఆత్మానం ఆకాశశ్శరీరం" అనుశృతివాక్యమునుబట్టి ఆకాశము ఆత్మకు శరీరమని తెలియబడుచున్నది. దేహమును విడిచి దేహిదేహిని విడిచి దేహము యుండలేనటుల ఆకాశమును విడచి ఆత్మయును ఆత్మను విడిచి ఆకాశముండనేరదు. అనగా ఆత్మనేఆకాశముఆకాశమే ఆత్మయని రూఢియైనది.

"ఆకాశస్య గుణః శబ్దో" అను శృతి వాక్యముననుసరించి ఆకాశమునకు శబ్ద గుణము కలదని తెలియబడుచున్నది. ఈ శబ్దము ధ్వన్యాత్మకము వర్ణాత్మకము అని రెండు విధములు. ధ్వన్యాత్మకమందు పరా, పశ్యంతి, మధ్యమ, వైఖరి అను చతుర్విధరూప శబ్దములు అ. ఉ. మ. అర్థ మాత్రుక స్వరూపములే వర్ణాత్మకము.

"ఆకాశం గగనం శూన్యం"అనుశృతి ననుసరించి ఆకాశమునందుశబ్దము కాని మరేమియు లేవని తెలియబడుచున్నది. అనగా సృష్టికి పూర్వము అయ్యది అవ్యక్త స్వరూపమై యుండినదని పైశృతిననుసరించి ద్యోతకమౌచున్నది. దానినుండి శబ్దమెపుడుద్భవించునో అపుడే సృష్టి అవిర్భవించెనని వ్యక్తమగు చున్నది. శబ్దమెచట నున్నదో అచటనే జ్ఞానముండును. జ్ఞానమున్నచోటనేగురుశిష్యసంవాద రూపమైన బోధయు నుండును. బోధలేని చోట బాధయుండును. అవ్యక్త స్థితియందు శూన్యత్వ ముండును. ఆ శూన్యత్వ స్థితియే శూన్య సింహాసనము. అదియే ఓంకారస్థానము లేక ఓంకార పీఠము, ఆ పీఠమును అధిరోహించి శ్రీ సద్గురుమూర్తి యుండును. అటువంటి ఆ సద్గురుమూర్తికి శిష్యుడు

"వందేహం సచ్చిదానందం - భావతీతం జగద్గురుం।
నిత్యం పూర్ణం నిరాకారం - నిర్గుణం స్వాత్మ సంస్థితం ॥

నిరంతరము ఆత్మయందుండువాడును, నిత్యుడును, నిర్గుణుడును, నిరాకారుడును, సర్వత్రానుండువాడును, భావమున కతీతుడును, జగద్గురుడును సచ్చిదానంద స్వరూపుడైన సద్గురు మూర్తిని గూర్చి ధ్యానించుచు తనకున్న భ్రమ ప్రమాదులను బోకార్చుమని ప్రార్థించగా ఆ సద్గురుస్వామి సచ్ఛిష్యునకు సద్బోధను వినిపించును. అతడద్దానిని విని తరించును.

శృతి రూపమైన ఈ ఓంకారము మొదట నాగరలిపిలో అనగా సంస్కృత లిపిలో ओम अని వ్రాయుటజరిగినది. కాలక్రమముగా నది ॐ గా మార్పు చెందినది. "ఓమిత్యేకాక్షరం" అను శృతివాక్యముండుటచేత పండితులుదానిభావమును వర్ణాత్మకముగా లేక చిహ్నమును నా విధముగ గుర్తించినటుల వ్యక్తమగుచున్నది.

"ఓంకారబిందు సంయుక్తం నిత్యంధ్యాయన్తి యోగినః"అని యుండుటచేత పరమాత్మతత్వము బిందు స్వరూపమనియు ఆ స్వరూపము ఏ యోగిచే ధ్యానింప బడునో ఆ యోగి తన యభీష్టానుసారము మోక్షము పొందగలడని నుడువుట వలన బిందురూప ఓంకారమును బ్రహ్మవేత్తలు తమ యూహాబలము చేతబిందు సంయుక్తమైన ॐ అను చిహ్నమును కనిపెట్టినటులతెలియుచ్చున్నది. ఆ బిందువు నుండి తేజః కిరణములు పుంఖాను పుంఖములుగా ప్రసరింపబడునటుల సువ్యక్తమౌచున్నది.

శ్రీ మద్భాగవత కృష్ణ దేశికేంద్రుల వారిచే రచింపబడిన శక్తి ద్వయ నిరాసకంబైన శుద్ధ నిర్గుణ తత్వకందార్థ దరువులను క్షరాక్షరోపాది ద్వయదోష రహితమైన కంద పద్యములుశ్రీపూర్ణనంద అరిగె రామస్వామి వారి ప్రియశిష్యులైన శ్రీ దాసానంద ఈ పూరుశేషపాణిగారు పాకెట్‌సైజు పుస్తకమును 1988లో పునర్ము ద్రణ గావించిరి. దానియందు ఈ క్రింద కనబరిచిన ఓంకారమును ముద్రించిరి.



ఆ ఓంకారమునందొక ప్రత్యేకత సంతరించుకొనుట వలన ఆచిహ్నాము నందిమిడియున్న భావమునుతెలుపుడని జిజ్ఞాసువు లెందరో వారిని కోరుట వలన సోదరుడనైన నన్ను తద్భావమును వివరించుచునొక వ్యాసమును వ్రాయుటకై నన్నిటీవల కాలములో కోరిరి. శ్రీ మద్గురుడగు శ్రీ మదచలర్షి దయానంద పొన్నాల రాజయోగీంద్రుల వారి కృపాకటాక్షము వలన ఆ చిహ్నామును బాగుగా పరిశీలించి దానియందు నిక్షిప్తమైయున్న భావమును సుబోధకమగునటుల వ్రాయుట కుపక్రమించుచున్నాను.

అష్టదళ పద్మమునందు నాగరలిపిలో ఓంకార చిహ్నాము కలదు.దానియందు ఒక బిందువు. ఆ బిందువు నుండి సప్తకిరణములు బయల్వెడలినవి. ఆ సప్త కిరణములను పంచావరణ కిరణములు వర్తులాకారములో నావరించియున్నవి. ఈ పంచావరణములను పరివేష్టించి 36 వర్తులములు కలవు. ఈ 36 ఆవరణముల యందు 84 కిరణములు ప్రకాశింపబడుచున్నవి.

## అష్టదళపద్మము

శ్లో॥ హృదయంబుజే కర్ణికమధసంస్థం – సింహాసనే సంస్థిత దివ్యమూర్తిం
ధ్యాయేద్గురుం చంద్ర కళాప్రకాశం –సచ్చిత్సుఖాభీష్ఠ వరందధానం॥గు.గీ.

హృదయ కమలమునందు కర్ణిక మధ్య భాగమునొక దుద్దు కలదు. ఆ దుద్దును సింహాసనముగా జేసికొని తేజోమయరూపుడై వెన్నెలను విరజిమ్ము వాడును, కోరినకోర్కెలను నెరవేర్చువాడును సచ్చిదానంద స్వరూపము కలవాడును అయిన శ్రీగురు పరమాత్మను ధ్యానించవలెను, అని పై శ్లోకము యొక్క భావము.

హృదయపద్మమనగా హృదయమునందుగల కమలమని కొందరందురు. అయిదువన్నెలు కలిసిన చోటే హృదయపద్మమని మరికొందరి భావన. అయితే అవి ఎక్కడ కలిసినవి? అను ప్రశ్నకు నేత్రస్థానమందు స్పష్టముగా కనబడుచున్నవి. నేత్రస్థానమే హృదయపద్మమని రెండవ వాదన అదికాదు సహస్రారము అని ఇంకను కొందరందురు. ఇందు ఏకాభిప్రాయము లేదు. భిన్నాభిప్రాయములు గలవు. అందువలన దీనిని గురించి విమర్శ అవసరమై యున్నది. షట్చక్రముల విమర్శించి చూచెదము. మూలాధారము నుండి సహస్రారము వరకు 7 చక్రములు కలవు. వానిని సూక్ష్మముగా వివరించుకొనియెదము.

1) ఆధారము: దీనికి అధిపతి గణపతి. నాలుగుదళములు, వ,శ,ష,స అను నాల్గక్షరములు, లంబీజము, చతుష్కోణమును,

గుదస్థానమున యుండును. దీనికిసద్యోజాతముఖమును
భూలోకమును, క్రియాశక్తియును, కింకిణీనాదమును,కుంకుమ
వర్ణమును కలవు. ఆరునూర్లహంసలు

2)స్వాధిష్ఠానము: దీనికి అధిపతిబ్రహ్మ, ఆరుదళములు
బ,భ,మ,య,ర,ల అను షడక్షరములును
వంజీబీజమును, అర్ధచంద్రాకారమును
విద్యుత్కాంతివర్ణమును, గుహ్యస్థానమును
ఇచ్ఛాశక్తియును,వామదేవ ముఖమును,
భువర్లోకమును, వీణానాదమును,ఆరువేలహంసలు దీనికుండును.

3) మణిపూరకము : దీనికధిపతి విష్ణువు. పది దళములు.
డ,ఢ,ణ,త,థ,ద,ధ,న,ప,ఫ అను పది అక్షరములు.
రం బీజమును, త్రికోణాకారమును, అఘోరముఖమును
శ్యామలవర్ణమును, నాభిస్థానమును, జ్ఞానశక్తియును
సువర్లోకమును, వేణునాదమును ఆరువేల హంసలును
దీనికి గలవు.

4) అనాహతము: దీనికధిపతి రుద్రుడు. పన్నెండు దళములు.
క,ఖ,గ,ఘ,ఙ,చ,ఛ,జ,ఝ,ఞ,ట,ఠ లను పన్నెండు అక్షరములు.
యం బీజము తత్పురుష ముఖము, బంగారు వర్ణము
ఆదిశక్తి, శంఖనాదము, మహార్లోకము, ఆరువేల హంసలు.
దీనికి స్థానము హృదయము.

5) విశుద్ధము : దీనికధిపతి ఈశ్వరుడు. 16 దళములు. అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఋ, ౠ, ఌ, ౡ, ఏ, ఐ, ఓ, ఔ, అం, అః అను పదహారు అక్షరములును, అంబీజమును, ఈ శాసనముఖమును స్ఫటిక వర్ణమును, వెయ్యి హంసలును కలవు. దీనికి స్థానము కంఠము.

6) ఆగ్నేయము : దీనిని ఆజ్ఞా చక్రమని కూడా నుడువుదురు. దీనికధిపతి సదాశివుడు. రెండు దళములు. హం, క్షం అను రెండు అక్షరములు సం అను బీజమును అంతర్ముఖమును మాణిక్య వర్ణమును చిచ్ఛక్తియును అబ్ధినాదమును తపోలోకమును సమరస భక్తియును, వెయ్యి హంసలును కలవు. దీనికి స్థానము భ్రూమధ్యము.

7) సహస్రారము: దీనికి అధిపతి సద్గురుడు. వెయ్యి దళములు ఓం బీజము సహస్ర ముఖములు. చిత్రవర్ణము, సహజాత్మ శక్తి. ఝుంకార నాదము, సత్యలోకము, పరమభక్తి, వెయ్యి హంసలు, దీనికి స్థానము మూర్ధ్ని.

సహస్రారమునందు గల అష్టదళ పద్మమే శ్రీ గురు నివాసస్థానమని షట్చక్ర వివరణమునందు తేట పడుచున్నది. దీనినే త్రికూటమని కూడ నందురు. ఇక్కడ ఈడ, పింగళ, సుషుమ్న అను మూడు నాడులు కలవు. సుషుమ్న నాడి చివరన ఒక సూక్ష్మ రంధ్రముండును. అదియే బ్రహ్మరంధ్రము. దానికే కుండలినీ స్థానమనియు, త్రివేణీ సంగమ మనియు ద్వాదశాంతమనియు, చతుఃపీఠమనియు ముక్తి ద్వారమనియు నాదబిందుకళ స్థానమనియు, శృంగాటక మనియు, పూర్ణ స్మశాన మనియు మండలత్రమనియు హంస స్థానమనియు అందురు. అదియే బిందుస్థానము. అదే శ్రీ గురు నివాస స్థానము. సహస్రారమును అష్టదళ పద్మ మనుటకు కారణమేమనగా దొంతులు ఒకదానిపై ఒకటి ఎన్నో కుండలమర్చినట్లు ఒక దళముపై అనేక దళములు అమరియుండును. 125 దళములు కలిగిన దొక దొంతి. ఇట్టి దొంతులు 8 మాత్రముండుట చేత సహస్రారములు గల అష్టదళపద్మమని యందురు. శ్రీ గురుమూర్తి ఆస్థానము నధివసించి తన పాద ద్వయమును నొక పీఠమందుంచి యుండును.

శ్లో॥ వందే గురుపద ద్వంద్వం - వాఙ్మనోతీత గోచరం
శ్వేత రక్త ప్రభా భిన్నం - శివ శక్త్యాత్మకం పరం ॥ గు॥ గీ॥

వాఙ్మనస్సులకు అగోచరమైనదియును స్వేత రక్తప్రభలకు భిన్నమైన పాటల వర్ణము గల శివశక్తి స్వరూపమునగు శ్రేష్ఠమైన శ్రీ గురుపాద పద్మములకు నమస్కారమును చేయవలయును. అనగా సహస్రారసింహాసనము నధిష్ఠించి తన పాద జంటను దిగువన గల ఆజ్ఞాచక్రమున గల ద్విదళములయందుంచి యుండును. వానిని పూజించు చుండవలెనని గురుగీత ప్రమాణము.

కేంద్రబిందు స్థానము సహస్రార మందుండిన ఆ బిందువు నుండే సప్తకిరణములు ప్రభవించినవి. ఈ కిరణములను పంచావరణములు ఆవరించినవి. ఈ ఓంకారమంతయు తేజోమయము. ఈ సప్తకిరణములు ద్వాదశరెట్లు వృద్ధి జెంది $7 \times 12 = 84$ జ్యోతిర్మయ రూపు దాల్చినవి. వీనిని 36 వర్తులములు ఆవరించియున్నవి. ఈ బిందువునుండే సూర్య, చంద్ర, అగ్ని, విద్య, అక్షరము, మాయ, అవిద్య, ఆత్మ, సప్త సముద్రములు, సప్త పర్వతములు, సప్త ద్వీపములు,

అధోలోకములు, ఊర్ధ్వలోకములు, పంచభూతములు, పంచాకాశములు, త్రిగుణములు, సప్తకోటి మహామంత్రములు, వేదములు, నాద, బిందు, కళలు, దిక్కులు, వాయువులు, బీజములు, సర్వ చరాచర జగత్తులు ప్రభవించినవి.

అనగా కేంద్రబిందువు అన్నింటికీ అధిష్ఠానము అదే సప్త కిరణములుగా వ్యాప్తి చెందినవి. అనగా సప్తవిధ చైతన్యములుగ పరిణమించినది. సప్తవిధ చైతన్యములనగా 1) శుద్ధ చైతన్యము; 2) ఈశ్వర చైతన్యము; 3) జీవ చైతన్యము; 4) ప్రమాత చైతన్యము; 5) ప్రమాణ చైతన్యము; 6) ప్రమేయ చైతన్యము; 7) ఫల చైతన్యము, ఇవి తేజోమయ విజ్ఞానములుగా విస్ఫూర్తి చెందినవి. కాని దీనిని పంచాకాశములు అనగా 1) పరాకాశము; 2) దహరాకాశము; 3) నిరవయాకాశము; 4) సూర్యాకాశము; 5) భూతాకాశములుగా పరివేష్ఠించి దేహికి దేహమువలె విక్షేపరూప చైతన్యములను ఆవరించినవి. అవి అజడములైతే నివి జడరూపములైవి. ఈ రెంటి కలయిక వలన జడాజడ మిశ్రమ సృష్టికి మూలము లైనవి. ఈ పంచావరణములు షట్ త్రింశతి అనగా 36 ఆవరణములుగా పరిణతి జెందినవి. అటు ఈశ్వరునికి 36 ఆవరణములు కాగా ఇటు జీవుని కూడా 36 ఆవరణములు కలవు. అవి యేవో ఒకింత పరిశీలించెదము.

1) అవ్యక్తము; 2) మహత్తు; 3) మహదహంకారము; 4) తన్మాత్రలు; 5) భూతములు; 6) అవ్యక్తమువలన పంచాధి దేవతలు; 7) మహత్తువలన పంచ బీజములు; 8) మహదహంకారము వలన పంచశక్తులు; 9) తన్మాత్రల వలన గుణములు; 10) మహాభూతముల వలన పంచ వర్ణములు పరిణమించినవి; 11) పంచాధిదేవతల వలన ప్రత్యగాత్మ; 12) పంచ బీజముల వలన ప్రాణము; 13) పంచశక్తుల వలన జీవుడు; 14) పంచ గుణముల వలన ఇంద్రియములు; 15) పంచ వర్ణముల వలన స్థూల శరీరము లేర్పడినవి. ఇవన్నీ సూత్రాత్మలేనిది జరుగలేదు కాబట్టి 5+25+5+1=36. ఈ ముప్పదియారు ఆవరణములు ఈశ్వరునివి.

ఇక పిండాండమందుగల 1) పంచభూతములు; 2) అజ్ఞానము; 3) అంతఃకరణ చతుష్టయము; 4) పంచప్రాణములు; 5) పంచ జ్ఞానేంద్రియములు; 6) పంచ విషయములు; 7) పంచకర్మేంద్రియములు; 8) మూడు శరీరములు; 9) మూడవస్థలు మొత్తం 36 ఆవరణలు జీవునివి.

ఇక భగవద్గీత విశ్వరూప సందర్శనయోగమున భగవానుడు నరునకు తన విశ్వరూపమును సందర్శించుమని ఈ క్రింది శ్లోకము ద్వార తెలిపెను.

శ్లో॥ పశ్యాఽఽదిత్యాన్ వసూన్ రుద్రాన్ - అశ్వినౌమరుతస్తథ

బహూన్యదృష్ట పూర్వాణి - పశ్యా2శ్చర్యాణి భారత॥
పై దానికి తెనుగు సేత

తే.గీ॥ వసువు లైనమండ్రు, ద్వాదశ భాస్కరులును,
పదునొకండు రుద్రలశ్వనీ వైద్యవరులు,
నలువదియను తొమ్మిది మరుత్తులును మరియు
ముందు చూడని యాశ్చర్యములను కనుము॥

(1) వసువులు-8; (2) ఆదిత్యులు-12; (3) రుద్రులు-11; (4) అశ్వనీ దేవతలు-2; (5) మరుత్తులు-49; (6) నరనారాయణులు-2; మొత్తము 84.

(1) మండలములు-7; (2) ఋషులు-7; (3) మాతృకలు-7; (4) గ్రహములు-7; (5) ఈశ్వరదేహావరణములు-7; (6) జీవ దేహావరణములు -7; (7) ఊర్ధ్వలోకములు-7; (8) అధోలోకములు-7; (9) సూర్యుని రథాశ్వములు-7; (10) అగ్నిదేవుని జిహ్వలు-7; (11) మేరు పర్వతములు-7; (12) మహా సముద్రములు-7; మొత్తము=84. అటు భగవద్గీత ప్రకారం విశ్వరూపమునందు 84 తేజస్సులని తెలుసుకుంటిమి. ఇటు మండాలాదులను పరిశీలించినను సప్త కిరణములు ఇంతింతై వటుడంతైయని యన్నట్లుగా 7×12=84 గా పరివ్యాప్తి చెందినటుల ద్యోతకమౌచున్నది. ఈ 84 ప్రకారముల వలన 84 లక్షల జీవోపాదులేర్పడినట్లు అవగతమగుచున్నది. వాని వివరములు ఈ క్రింది విధముగా నున్నట్లు సెలవిచ్చిరి.

1) స్థావరములు - 20 లక్షలు; 2) జలచరములు - 9 లక్షలు; 3) క్రిమికీటకములు - 11 లక్షలు; 4) పశువులు - 30 లక్షలు; 5) పక్షులు - 10 లక్షలు; 6) మనుజులు - 4 లక్షలు. మొత్తము - 84 లక్షలు.

జీవోపాధులని మను నిర్ణయము. అందువలన సృష్టికి మూల స్వరూపము ను సృష్టి స్వరూపమును ఈ ఓంకారమేనని యనుటలో సందేహము లేదు. పిండాండ, ఈశ్వరాండ బ్రహ్మాండముల కాధార మా ఓంకారమే. జీవేశుల రాకడ పోకడలకును అదియే జనని దాని నామోచ్చరణ వలననే సకల జీవోపాధులు సుఖశాంతులతో మనగలుగుచున్నవి. మానవులు దాని ద్వారానే బ్రహ్మత్వమును తెలియదగును. దాని మూలమును తెలిసికొనుటే బ్రహ్మతత్త్వమును తెలిసికొనుట. అద్దాని వలననే మోక్ష సంప్రాప్తి మానవులకు కలుగునని ఈ ఓంకార వివేచన వలన స్పష్టమైనది.

ఈ ఓంకారమును గురించి అచల ఋషులు కూడ సుదీర్ఘముగా నాలచించిరి. అన్ని కోణములనుంచి విమర్శించిరి. విమర్శించి సృష్టికి మూల

కారణము ఓంకారమే యనుమాటను అంగీకరించిరి. సృష్టి వలననే సకల జీవోపాధుల జననమును వాని మనుగడయు కొనసాగుచున్నదను మాటను కూడా ఆమోదించిరి. అయితే దేనివలన జన్మలు కలిగినవో దాని వలననే జన్మ రాహిత్యస్థితి కూడ కుదురగలదను భావము ఎంతవరకు సమంజసమగునని తీవ్రముగా చర్చించిరి. తపించిరి. వారి ఆలోచనా సరళిని గూర్చి మనమును విమర్శించెదము.

కం॥ పంచాశదక్షరముల ప్రపంచము తానుద్భవించె ప్రణవాక్షర
మందంచు శృతులెన్నె - దాన్నెరుకంచని నీ వెరిగి యెరుగు
మచలాము దీనన్ - నిల్పకు మెరుక నచాలము లోనన్
చంచాల మతిచేత చతురాక్ష రెక్కువంచెంచేద వెందుకు ఇది నమ్మకు?

"ప్రణవయి పరంబ్రహ్మ ప్రణవశ్చ పరిస్తృతః అను శృతిని యనుసరించి ఓంకారమే నిశ్చయముగ పరమాత్మ స్వరూపమే యనియు దానినే పరబ్రహ్మ స్వరూప మనియు నిర్ణయింపబడినది. కనుక వాచ్యమగు బ్రహ్మమునకు వాచకమగు ఓంకారము వేరు కానందున ఓంకారమే బ్రహ్మ స్వరూపమని నిర్ణయింపబడినది. ఏబది వర్ణములకు మాతృస్థానము కూడ ఓంకారమే. దీనిని శబ్ద బ్రహ్మమని కూడ నుడువుదురు. ఈ శబ్దము నాలుగు రీతులని ముందే తెలుసికొంటిమి. పరావాక్కు స్థావరములైన వృక్షాదులందు, భూమి జలములందు పశ్యంతియను వాక్కు, పశు పక్ష్యాదులయందు మధ్యమవాక్కు, మనుజులయందు వైఖరివాక్కు కలదు. ఈ వైఖరీవాక్కువలననే ఏబది వర్ణరూప వర్ణమాల సృష్టింపబడి వేద శాస్త్ర పురాణాదులకు స్థావరమయ్యెను.

శృతి: యద్యత్ పశ్యతి చక్షుభ్యాం - తత్తదాత్మేతి నిశ్చయః
యద్యత్ శృణోతి కర్ణాభ్యాం - తత్త దాత్మేతి నిశ్చయః

ఏదేని నీ కండ్లతో జూతువో ఏవేవి నీ చెవులతో విందువో అదంతయు ఆత్మేయని నిశ్చయింపబడినదని పై శృతి నుగ్గడించగా "యత్ర నాన్యత్ పశ్యతి నాన్యత్ శృణోతి నాన్యత్ విజానాతి సభూమ" "యతో వాచ నివర్తన్తే అప్రాప్య మనసా సహా" అను శృతుల ప్రకారము ఎక్కడ వాక్కు వర్ణించి తనకు చేత కాదని నిలిచి పోవుచున్నదో, ఎక్కడ మనస్సు కూడ నూహించి యూహించి తనకు చేత కాదని నిలిచి పోవుచున్నదో అక్కడ ఆ పరబయలు స్వతఃసిద్ధముగా నుండుననియు పై శృతి వాక్యముల యొక్కయు మరియు కందార్థము యొక్కయు భావములు యేకమగు చున్నవి. అందుకే చంచల మతిచేత చతరాక్షరెక్కువంచెంచెదవెందుకు? అ+ఉ+మ+ అర్ధమాతృక అను చతురాక్షరి స్వరూపమైన ఓంకారమే శ్రేష్ఠమని

నిర్ణయించుకొనుట ఒక భావము. దానికతీతమైన పరిపూర్ణ పరబాహ్యమును గురు సూచన ద్వారా గుర్తెరిగి, ఎరిగిన ఎరుకను విడచుటయే మానవ జన్మకు సార్ధక మనబడును. అప్పుడు ఓంకారమే పరంబ్రహ్మమను భావమభావ మగును.

పరిపూర్ణాచల సిద్ధాంత ప్రతిష్ఠాపనా చార్యులు శ్రీ మదచలర్షి శ్రీమద్రా మడుగు శివరామ దీక్షితులవారు. "బృహద్వాశిష్టం" లేక "అచలగ్రంథమును" వ్రాయుట చేత వారిపేర దానికి "శివరామ దీక్షితీయము" అను పేరు ప్రసిద్ధి పొందినది. వారు సంస్కృత భాషకు గాక తెనుగు భాషకే ప్రాముఖ్యత నొసగిరి. అట్లని వారికి సంస్కృతము రాదని తలంచరాదు. వారి తదనంతరపు వారు కూడ వారి జాడ ననుసరించిరి. ఇక్కడ ఓంకారమును గురించి తెలుగు మరియు సంస్కృత భాషకు గల భేదమును ముఖ్యముగా మనము గమనించవలయును. సంస్కరింప బడినది. సంస్కృతము ఇందు సంస్కరణకు పూర్వము 'ఓమ్'ను 'ओम' అని వ్రాయబడుచుండెను. సంస్కరణానంతరమది 'ॐ' గా మారెను. తెనుగున కూడ మొదట ఇది 'ఓమ్' అని వ్రాయబడుచుండెను. తర్వాత అది మార్పు చెంది 'ఓం' గా మారెను.

దీక్షితీయ సిద్ధాంతమునకు మెరుగులు దిద్దినవారు, శ్రీ మద్భాగవత కృష్ణ దేశికులవారు. వీరి శిష్యులు పీల్కాన లక్ష్మణరావు గారు. వీరి శిష్యులు శ్రీ సచ్చిదానంద వేంకటేశ్వర అవధూతగారు. వీరి శిష్యులు శ్రీ భూమానంద మందిప్పల హనుమంత రాజయోగి గారు. అవధూత మరియు భూమానందుల వారు దీక్షితీయ అచల పరిపూర్ణ సిద్ధాంతమును చిహ్నము ద్వారా చాటి చెప్పదలచిరి. దీనికి శ్రీకారము కృష్ణ దేశికులే చుట్టియుండిరి. వానిని పరిశీలింతము. "ఆకాశస్య గుణ శ్శబ్దో నిశ్శబ్దో బ్రహ్మ వుచ్యతే అను శృతి వాక్యమును దృష్టి యందుంచుకొని అవధూత గారు తమ సద్గురు భక్త శతకమునందు

"ఓకు వలపల బిందువు వుంచితే ఓమ్ అని శబ్దించును
ఓకు దాపల బిందువు నుంచితే యేమనదు భక్తులారా!
పరిపూర్ణ బోధచేత మేల్కొనిన ఎరుక ఎన్నడుయుండదు
గురు కటాక్షంబుచేత తొలగును గురు తెపుదు భక్తులారా! అని రచించిరి

శ్రీ కృష్ణదేశికేంద్రులవారు

"పంచాశదక్షరముల ప్ర
పంచము తానుద్భవించె ప్రణవాక్షరమం
దంచు శృతులెన్నె దాన్నెరు
కంచని ఎరిగి - ఎరుగుమ చలాము దీనన్ - నిల్వకు మెరుక నచాలము లోనన్

చంచల మతిచేత చతురాక్ష రెక్కువంచెంద వెందుకు?
అది నిల్వదు. అని సెలవిచ్చియున్నారు. చతురాక్షరి స్వరూపమైన ఓంకారము నిల్వదు అని దేశికులంటే "నిశ్శబ్దో బ్రహ్మ వుచ్చతే" అను పదభావమును గ్రహించి దానిని చిహ్నముగా రూపము నిచ్చి 'ంం' గా సిద్ధాంతీకరించి దానిని పరిపూర్ణ సిద్ధాంతమునకు ప్రతీకగా చాటిరి.

శ్రీకృష్ణదేశికుల వారు "ఒంటుకు దాపల బింద్వాం
ట్లంటించిన కొలది లెక్కయధికం బగునా
వొంటుకు వలపల బింద్వాక
టంటించిన లెక్క ఉళ్ళక్యాగదనోయీ
ఒంటుండి లేం దొగదా నోయి" అని సెలవిచ్చిరి

శ్రీ భూమానందులవారు.

"శంకలు దీరెను వినుమిది
అంకెలలో ఒంటునొకటి ఆత్మనబడునూ
రంకుల బొంకుల జగమిది
వంకలు లేనట్టి యచలం వాసీగ గనుడీ!
పై సున్నిడి వైకుంఠ మనుడీ ॥ దేశీకు శ్రీ వేంక
టేశ్వరు కృపచేత శాశ్విత పదవిల శబ్దించకుండుడీ"

అని ప్రశ్నోత్తర కందార్థముల యందు నుడివిరి. ఇయ్యది "ఆత్మాతీతం కేవలాత్మ" అను శృతిని రూఢి పరచినది. దీనినే "ంం" చిహ్నముతో వ్యక్తీకరించిరి. అదెట్లన ఒకటి యనునది యాత్మ. దాపలనున్న ఆకాశము. దీనివలన పంచ వింశతి తత్వ స్వరూపమైన ప్రపంచము యేర్పడుట. ఇది లెక్క పెరిగే పద్ధతి. వలపల సున్న పరిపూర్ణమునకు ప్రతీక "ఆత్మాతీతం కేవలాత్మ దేహో నాస్తి కదాచన" అను నానుడిని "మూలం లేని యీ గుర్తెరిగే శరీరం యేమిలేదు" అను భావమును స్థిరపరుచనైనది. అట్లే మరొక కందార్థమందు

"పలుకనిదే పరిపూర్ణము పలికినదే యెరుకయనుచు పలుకబడెను యీ
పలుకే ఓంకారంబగు పలుకని దోంకారా తీత పరిపూర్ణ మదిరా
దాపల బిందు బయలై యున్నదిరా! సురుచిర వలపల సున్ననిడిన
ఎరుక - గురుతూగ యుండి - ఆగురుతూ విడచీ యుండు॥పరిపూర్ణమదిరా

అట్లే కృష్ణదేశికులు

కం॥ పలుకున పలుకగ రాకను - తలపోయుదమనిన మదికి దగులకయెపుడున్

ములు గ్రుచ్చ సంధిలేకను కలిగున్నది బట్టబయలు కదరామాయన్నా
అదిగో చూడు కదలాదోయన్నా, పలుకన్న పలుకకా తలపన్న
దెరుగాక చలి, ఎండ, వానల, నలయక నిలచుండు కదరా॥

పై కందార్థము "అవాఙ్మ మానస గోచరము" అను శృతివాక్య భావమును "నయనం ఛిందంతి శస్త్రాణి" అను భగవద్గీత శ్లోక భావమును చాటుచున్నది.

## మాండుక్యోపనిషత్తు నందు :

1. శ్లో॥ : సోయ మాత్మా రధ్యక్షర మోంకారోధిమాత్రం
పాదమాత్రా, మాత్రాశ్చ పాదా, అకార, మకార ఇతి।

2. శ్లో॥ జాగరిత స్థానో వైశ్వానరో2_కార్చః ప్రథమ మాత్రాః।

3. శ్లో॥ స్వప్న సాథనో స్తైజస ఉకారో ద్వితీయ మాత్రో।

4. శ్లో॥ సుషుప్త్య స్థానః ప్రాజ్ఞో మకారస్తు మాత్రాః

5. శ్లో॥ అమాత్రశ్చతుర్థ వ్యవహార్యః ఆత్మైవ సంవిశత్యాత్మ।

ఈ యాత్మయే అక్షరము మరియు ప్రణవ స్వరూపమైన ఓంకారం ఇది ఏక పాదముగాను త్రిపాదములుగాను చతుష్పాదములుగాను వర్ణించబడినది. దీనినుండే నాలుగు శరీరములు, నాలుగవస్థలును, నలుగురు అభిమానులును ఇటు జీవునకు అటు ఈశ్వరునకు కూడ కలిగియున్నటుల వ్యక్తమగుచున్నది.

"తదేవ చతుషాత్పదబ్రహ్మ, వాక్పాదః ప్రాణః పాదః
చక్షుఃపాదః శ్రోతం పాత ఇత్యాదాత్మా ॥చాందోగ్యోపనిత్॥

బ్రహ్మమునకు నాలుగు పాదములనియు ఒక పాదము వాక్కుగాను, రెండవ పాదము ప్రాణముగాను, మూడవ పాదము చక్షువుగాను, నాల్గవ పాదము శ్రోత్రముగాను పై శ్లోకార్థము. ఇదే ఆత్మ. ఈ యాత్మనుండి లేక బ్రహ్మ తత్వమునుండి శబ్దము దయించినది. ఆ శబ్దమే వాయు తరంగములైనవి. వానినుండి రూప తరంగములు, వాని నుండి రసతరంగము లుద్భవించినవి. వీని నుండి ఓషధులకు ప్రాణమొసగు గంధము లుదయించినవి. ఓషధులవలన అన్నోద్భవమయ్యెను. అన్నసారము వలన శుక్లము జలసారము వలన శోణితము కలిగినవి. ఈ రెంటి మిశ్రమము వలన సకల జీవోపాదుల్పేడినవి. అట్లే అన్నపు సూక్ష్మాంశమువలన మనస్సు, నీటి సూక్ష్మాంశము వలన ప్రాణము లేర్పడినవి. ఈ ప్రాణ మనంబుల సంయోగమువలన ఎరుక ఏర్పడినది. అనగా స్థూల భాగము ఆవరణము కాగా సూక్ష్మభాగము విక్షేపమైనది. ఈ రెండి మిశ్రమము వలన వాక్కు కలుగుచున్నది. ఏ శబ్ద బ్రహ్మ స్వరూపమైన ఓంకారము. దానివలన ఏబది వర్ణములు. వానివలన శబ్దమయ

జగత్తు కలిగినదని అచలబుషుల నిర్ణయము. నిశ్శబ్దో బ్రహ్మ ఉచ్చతే అను శృతి ఓంకారాతీతమే పలుకులేని పలుకుల కందని పలుకులు మీరిన పరిపూర్ణమునకే చెల్లునని తీర్మానించి దాపల బిందువు బయలై యున్నదిరాయను భావమును సిద్ధాంతపరచిరి.

అయితే కృష్ణదాసు గారి వాక్యమునకు అవధూత మరియు భూమానందుల వారి వాక్యములు విభేదించుచున్నటుల వారి రచనలను చదివిన వారి కగుపడును. కాని ఈ మువ్వురు ఏక వస్తువునే బలపరచిరి. వారల స్థానమును గుర్తించి ఆ స్థానముల నందుండి శుద్ధాంతఃకరణతో పరిశీలించినచో వారి భావనలు ఏకమేనని మనకు వ్యక్తమౌను. ఇక్కడ దాపల మరియు వలపల యను రెండు పదములను ముందుగా పరిశీలించెదము. మనము రెండెడ్ల బండిలో కూర్చొని బండిని మనమే నడిపిస్తామనుకొనియెదము. మనము ఏ దిశకు ముఖము చేసి యుందుమో ఎద్దులు కూడ ఆ దిశకే ముఖము చేసియుండును. మనకు కుడిచేతివైపున్నవి వున్న వలపల యగును. శ్రీ కృష్ణదేశికుల వారు తనను తాను ఒకటి జేసికొని తనకు దాపల బిందువు ఒకట్లు వ్రాసి తన ఎదుటివారిని లెక్కచూడుమనిరి. ఎదుటివారు లెక్క చూడగా ఆ లెక్క పెరిగినది. అట్లే వలపల బిందు వుంచి చూడుమనగా వారు చూడగా ఆ లెక్క యుళ్ళక్కెనదని తేలినది. అనగా ఒంటుకు ఎడమవైపు దాపల, కుడివైపు వలపలయని తేలినది. అయితే దానిముందు మనము నిలబడి దానిని చూచినపుడు ఒంటుకు దాపలగా నున్నదే మనకు వలపలగా నుండును. అంటేదాని ఎడమ మనకు కుడియైనది. అట్లే దానికి వలపలగా నున్నదే మనకు దాపల యగును అనగా దాని కుడి మనకు ఎడమయైనది. అట్లే మనము అద్దము ముందు నిలబడి మనలను మనమే చూచుకొనిన మన ప్రతిబింబము మనకు కనబడును. మనము నిజ బింబము అద్దమునందు కనబడునది ప్రతి బింబము. బాగుగా ఆలోచించి చూడగా ప్రతి బింబములోని కుడిచెయ్యి నిజ బింబములోని ఎడమచేయి అట్లే దానియందలి ఎడమ మనయొక్క కుడియని గ్రహించనగును. బింబ స్థానములోని వస్తువులే ప్రతి బింబ స్థానములో తారుమారై దాపల వలపలగాను వలపల దాపలగాను తోచును.

శ్రీ కృష్ణ దేశికేంద్రులవారు బింబ స్థానములో నుండి అనగా ఈశ్వర స్థానమందుండి తన స్వరూప నిర్ణయము దెలిపిరి. జీవ స్థానమున నుండి చూచిన వారికి తారుమారుగా ద్యోతకమౌను, కృష్ణ దేశికుల భావమును మనము ఈశ్వర స్థానము నుండి గ్రహించిన మనకు వారి భావన సుబోధకమగును. భూమానందుల వారు అవధూత స్వాముల వారు జీవ స్థానమునకు ప్రాముఖ్యమిచ్చి జిజ్ఞాసువులకు

సుబోధకమగునటుల రచనలను కొనసాగించిరి. దేశికుల దాపల వీరిరువురకు వలపల అట్లే వారి వలపల వీరి దాపలయని గ్రహించినచో మనలో పొడసూపిన బేధములు మటుమాయమగును. అందుకే వీరు "దాపల బిందువు బయలై యున్నదిరా వలపల నున్ననిడిన ఎరుక" అని వ్రాసిరి.

ఇక ఓంకారమును గూర్చి సింహావలోకనము జేయుదము. షట్చక్రముల విచారణ మనమిది వరకు నొకింత విచారణ జేసియున్నాము. ఆజ్ఞా చక్రము నందు రెండు దళములు రెండక్షరములు కలవు. అందు మొదటి అక్షరము 'హం' అట్లే ఆధారమునందు నాలుగు దళములు నాల్గక్షరములు, అందు చివరి అక్షరము 'స' ఈ రెండక్షరములను కలుపగా 'హంస'యను పదము యేర్పడినది. అనగా ఆజ్ఞా చక్రమునుండి ఆధారము వరకు ఏ ప్రాణము సంచరింపబడుచున్నదో ఆ ప్రాణమునకే హంస యనిపేరు. ఈ ప్రాణము రేచకము పూరకముల ద్వారా నాసికా రంధ్రముల ద్వారా లోని నుండి బయటకు బయటినుండి లోనికి ప్రాణము ప్రతిరోజు 21600 హంసలు ఆయా అధిదేవతలకు అర్పించబడుచుండును.

అది లోనికి వెళ్ళునపుడు సో అను శబ్దముతోను బయటకు వచ్చునపుడు హం అను శబ్దముతోను వచ్చును. ఇది పదే పదే రాకడ పోకడ చేయుట వలన సోహం హం సోహం అను శబ్దములు మనకు తెలియకుండగనే స+అహం=అదే నేను, హంసోహం = నేనే అది, అనే భావము పొడసూపును. అట్లే ఓంకార వివేచన చేయగా నాలుగు మహావాక్యముల సారము కూడ అంతేయని తేలుచున్నది.

అందువలన అదియే సృష్టికి ఆధారమగు అధిష్ఠాన చైతన్య పరబ్రహ్మ మనియు సకల జీవోపాదుల సృష్టి స్థితిలయములకు మూలమనియు తేలినది. కాని దానికి మరొక మూలము లేకపోవుట వలన మూలములేని గుర్తెరిగే శరీరమేమియు లేదని అచల ఋషులు నిర్ణయించిరి. ఓం నిశ్శబ్దో బ్రహ్మ వుచ్యతే అను మాటను బలపరచునది. ఇదే మాటను తేజో బిందూపనిషత్తు నందు "ఆత్మేతి శబ్దహీనోయ ఆత్మ శబ్దార్థ వర్జితం సచ్చిదానంద హీనోయ యైషైవాత్మ సనాతనః" అను భావమును మన కందజేయగా "ప్రజ్ఞాన వాక్యహీనాత్మ అహం బ్రహ్మోస్మి వర్జితం తత్వమస్యాది హీనాత్మ అయమత్మేత్యభావతం" అను భావము ౦౧౦ బ్రహ్మైవాహమస్మి అహం పదార్థరహితః అను శృతిని బలపరచుచున్నది. కాన సృష్టికి కారణమైన వస్తువు నాశ్రయించితే జన్మసహితము తద్రహితమందే జన్మ రహిత స్థితి సిద్ధించునని తెలియజేయుటకే ఓం అను చిహ్నము ద్వారా తమ సిద్ధాంతమును చాటి చెప్పిరి. అచల ఋషుల నిర్ణయమే లోక కల్యాణకరమైనది. దానిని మనము అవగత మొనరించుకొని జన్మరాహిత్య స్థితిని పొందెదము గాక!

"శ్రీ గురు చరణార విందార్పణమస్తు"

## పంచభువనములు

| భూతాకాశము- పృధ్వీభువనము | | | | | |
|---|---|---|---|---|---|
| భూతము | ఆకాశము | వాయువు | అగ్ని | జలము | పృథ్వి |
| ఆకాశము | శోకము | కామం | క్రోధం | మోహం | భయం |
| వాయువు | దాటుట | పరుగుట | తిరుగుట | చలించుట | ముడుచుకొనుట |
| అగ్ని | నిద్ర | దప్పి | ఆకలి | సంగమము | ఆలస్యము |
| జలము | జొల్లు | చెమట | మూత్రము | శుక్లము | రక్తము |
| పృథ్వి | రోమము | చర్మము | నరములు | మాంసము | అస్తులు |

# స్థూల దేహ లక్షణము

1. స్థూల దేహము; 2. నేత్రస్థానము; 3. సార్ధత్రయ హస్త ప్రమాణము; 4. తామ్రవర్ణము; 5. విశ్వుడభిమాని;6. జాగ్రదావస్థ; 7. రజోగుణం; 8. విపరీతజ్ఞానం; 9. దృశ్యరూపం; 10. స్థూల భోగం; 11.అకారమాతృక; 12. ఋగ్వేదం; 13. వైఖరీవాక్కు; 14. పంచ భూతమయం; 15.పంచ వింశతితత్వాత్మకం.

## పృధ్వి యొక్క ప్రత్యేకకళలు

1. ఉత్పత్తి; 2.జాగ్రత్త; 3. బోధ; 4.వ్యాపారము.

## భూతాకాశము -పృధ్వీభువనము

పంచాకాశములలో భూతాకాశము ఒకటి. ఈ భూతాకాశమునందు ఆకాశము,వాయువు, అగ్ని, జలము, పృథ్వి చేరియున్నవి. ఈ భూతాకాశమునందే పిండాండసృష్టిజరుగును. సూర్యాకాశము ప్రాణసత్తానొసగునటువంటిది. సకల జీవోపాధులలో మానవోపాధికి ఫలశృతిని కలిగించును. దహరాకాశము సంకల్పస్వరూపమైనది. ఇది అధిష్ఠాన చైతన్యపరబ్రహ్మమునందు చలనము కలిగినపుడు సృష్టికామన గురించి సంకల్ప స్వరూపిణిగా యుండును. అయితే సృష్టి జరుగవలెనంటే గంధస్వరూపిణియైనపృథ్వినుండే జరుగవలెను. సర్వప్రాణులకు ఆధారము.

భువనము అనగా జగత్తు అనియు, ఆకాశము అనియు, ఆధారమనియు అర్థములు కలవు. పృథ్వీభువనమనగా పృథ్వి నుండి ఏర్పడిన జగత్తు అని అర్థము చేసికొనవలెను. ఈ పృథ్వీభూతము నందొక ప్రత్యేకత కలదు. దీనియందు గంధతన్మాత్ర గర్భీకృతమై యుండును. గంధతన్మాత్రలేనిచో ఏ ఉపాధి కూడ స్థూలాకృతి చెందనేరదు. మన కంటికి కనపడు ప్రతిప్రాణి కూడ నిర్దుష్టమైన ఆకారమును కలిగి యుండనేరదు. ఇది కఠినముగా యుండుటచేతనే ఆ ఆకృతి అలా యుండగలుగును. ఇతర భూతముల తన్మాత్రలన్నియు దీనియంధు చేరియుండును. అందువలన యిది అనేకాకృతులుగా మార్పు చెందగలుగుచున్నది. ప్రాణులకు కావలసిన వృక్ష సంపదను అందజేయుట వలన అన్ని ప్రాణులకు కావలసిన ఆహారమును అందజేయగలుగుచున్నది. వర్షధారలను తనయందు ఇమిడ్చుకొనగలుచున్నది. ఓషధులకు రసమును అందజేయ గలుగుచున్నది. ఎంత కఠినమో అంత మృదువుగా కూడ నుండును. సకల ప్రాణులకది నిలయము. కూర్చొనుటకు, శయనించుటకు నడయాడుటకు అది స్థావరమైనది. మనకు అది

అన్నమొసగునది. కాని మనము మలమూత్రములను విసర్జన చేయు చున్నాము. కాని అది తనలోలయం చేసికొని గంధతన్మాత్రగా మార్చుకొనిరసతన్మాత్రలో లీనమై వృక్షముల పెరుగుదలకు దోహదమొసగుచున్నది. గునపములతోగ్రుద్దినా నాగళ్ళతో గుండెను చీల్చుతూ పోయినా అది మననేమీ యనదు. అందువలన భూమికి గల ఓర్పును కలిగుండాలని యంటారు.

సరే అలా వుండని. ఇకపృథ్వీ సంబంధమైన ప్రపంచమునులేక జగత్తుని గురించిఆలోచిద్దాము. ఆకాశధర్మము బయలు. బయలు అని అంటే ఏమీలేని చోటు అని అర్థము. అంటే శూన్యమని కూడ అర్థమగును. అందుకే ఆకాశం గగనం శూన్యం అని అన్నారు. జ్ఞాన శూన్యం వలన శోకమేర్పడినది. వాయువు, అగ్ని, జల, పృథ్వి సంబంధ గుణములచేత కామ, క్రోధ, మోహ భయము లేర్పడినవి. వాయు సంబంధమైనచలనము వలన పరగుట, ఇతర భూత గుణముల చేత దాటుట, తిరుగుట, చలించుట, ముడుచుకొనుట అను పనులు ఉపాధుల యందు జరుగునని ఎరుగవలెను. అగ్ని యొక్క ప్రకాశము లేక తేజము వలన ఆకలి కలిగినది. నిద్ర, దప్పిక, సంగమము, ఆలస్యము అను గుణములు ఇతర భూతముల చేత ఉపాధుల యందు కలిగ్గినవి. జలమునందు గల పదునుకు స్నేహమని యందురు. స్నేహగుణము వలన శుక్లము ప్రతిప్రాణులయందుత్పన్న మగుచున్నది. అది లేనిచో సృష్టి అంతటితో నిలిచిపోవును. ఇతర భూత గుణముల చేత జొల్లు, చెమట, మూత్రము, రక్తములేర్పడినవి. ఇక పృథ్వియొక్క సహజగుణమగు కాఠిన్యత చేత ఉపాధులకు కావలసిన అస్థిపంజర మేర్పడుచున్నది. ఈ అస్థిపంజరము లేనిచో ఏ ఉపాధి ఏర్పడుటకు వీలు లేదు. ఇది ఏర్పడిన పిదప ఇతర భూతాంశ గుణములచేత నఖరోమములు, చర్మము, నరములు, మాంసము ఏర్పడుట చేత స్థూల శరీరములకు దోహదమైనది. అంటే, అండజ, పిండజ, శ్వేదజ, ఉద్భీజములు కలిగినవి. ప్రపంచమునకు యీ పృథ్వీ భువనము నిలయము.

ప్రతి ఉపాదులలో ఎన్నియో లక్షణములు, మార్పులు కలిగి యుండును. శోకమునకు గల కారణము అజ్ఞానము. ఈ అజ్ఞానము మనలో యున్నపుడు ఏమీ తోచదు అందువలన మనము పనులను సకాలమందు చేయక దాటవేయుటకు ప్రయత్నింతుము. అంతేగాక ఏ పనులను చేయుటకు ఇచ్ఛగించక యుండుటయే గాక చేయము. ప్రాణం మాత్రం ప్రాణధర్మాన్ని నిర్వర్తించుట ఇతర మేమి చేయకుండుట నిద్రయందే జరుగును. అలా ఏమి చేయకుండుట నిద్రతో సమమే కదా! నిద్రలో నుండువారికి జొల్లు కూడ రావడము పరిపాటి. శూన్య లక్షణము

మనకు రోమముల యందు కొనగోళ్ళయందు గోచరమగును.

మనకు మనస్సు కలదని జలభువన మందు తేట పడును. కాని వున్నదో లేదో తెలియదు. మనలో ఎన్నెన్నో కోర్కెలు సముత్పన్నమగును. ఇలా కోరుకోవడమునకే కామమని అంటారు. ఈ కామము కలిగినపుడు తత్సాధన కొరకు పరుగులు తీయుట సహజగుణమే దానినే పరుగుటయని యందురు. పరుగులు తీసినపుడు దాహము వేయుట కూడసహజమే.దానినే దప్పిక యందురు.నీరు త్రాగుతూపోతే చెమట పట్టుచుండును. ఆ చెమట చర్మము ద్వారా బయల్పడును.

అనుకొన్న పని నెరవేరకపోతే లేక చెప్పిన పని చేయకపోతే మనకు కోపము వచ్చును.ఆ కోపమునే క్రోధమందురు. అదిమనిషిని అతని మేధస్సును పాడు చేయును.అది నెరవేర్చుకొనుటకు అటు ఇటు తిరుగుట దానినే పోరాడుట అనికూడా అందురు. ఇది అగ్నియొక్క తీక్షణ స్వభావము. ఆ తీక్షణమే ఆకలి.ఈ ఆకలి లేకపోతే జీవచ్ఛవమే. ఇది యుండుట చేత ఆహారము గైకొనుట. అది సప్తధాతువులుగా పరిణామము జెందుచుండును. ఇది మానవ మనుగడకు మంచిదే కాని క్రోధావేశమును తీర్చుకొనవలెనని కోర్కె కూడా ఆకలియే. ఇది దుష్పరి ణామములకు దారితీయును. క్రోధము కలిగినపుడు నాడీ మండలము వేడెక్కును. శరీరము ఉష్ణోగ్రతకు లోనయినపుడు మూత్రవిసర్జన జరుగును. అది నరముల పటుత్వము తగ్గినపుడు అధికముగా జరుగును.

మనలోఅధికాపేక్ష కలిగితే అది కావలెననే కోర్కె పెరుగును. దానినే మోహమంటారు. మోహము కలిగినపుడు చిత్తచాంచల్యమగును.దానినే చలించుట యందురు. దీనివలన ఒకరితో ఒకరు కలిసికొనుటకు విరహ మేర్పడుట వలన కలసి కొందురు. స్త్రీ పురుషులు ఏకమౌదురు. దానిని సంగమ మందురు. దీనివలన ఇరువురియందు రేతస్సు విసర్జింపబడును. దానినే శుక్లమని యందురు. ఈ శుక్లమే పిండముగా మారును. అదియే మాంసము.

ప్రతి ప్రాణికి ప్రాణభీతి యెక్కువ దానినే భయమని అందురు. ఇది అనేక రకములు. అనుకొన్నది అనుకొన్నట్లు జరుగదేమో అనే అనుమానం కూడ భయం కావచ్చును. ఆ భయం కలిగినపుడు పిరికితనము పెరుగును. కాళ్ళుచేతులు ముడుచుకొనుట జరుగును. ఏమి పని చేయము. నిదానము చేస్తాము. దానినే ఆలస్యమందురు. ఇదే స్త్రీలలో ఋతువు ఆలస్యమైతే షోణితము అనగా రక్తము పిండ రూపము దాల్చును. అప్పుడే అస్తిపంజరము తయారగునని తెలియవలెను.

ఈ పృథ్వీభువనమును అండజ, పిండజ, శ్వేదజ, ఉద్భిజ రూపములైన

స్థూల దేహములందు చూడనగును. ముఖ్యముగా వీనిని విచారణ చేయు మానవ ఉపాధిని గురించియే అధికమాలోచించవలెను. ఎందుకన వీనిని తెలుసికొని వీనిని అధిగమించవలెనను ఆకాంక్ష గలవాడు వీడే గనుక.

మానవుడు అని గుర్తెరుగుటకు స్థూల దేహమే అవసరము. ఈ దేహముతో వ్యవహారమును చేయును. ఈ వ్యవహారకాలమునే జాగ్రదావస్థయని యందురు. నేత్రస్థానమున జీవుడుండి ఈ వ్యవహారమును జేయును. వీడు శరీరము కలిగి యుండును. తన మూరతో సుమారు మూడున్నర మూరలుండును. దీనిని సార్ధత్రయ హస్త ప్రమాణమందురు. పృథివి వర్ణము ఎఱుపు యని యందురు. దానినే తామ్ర వర్ణమని యనుట జరిగినది. అనేక రంగులు కలవారు కలరు కదా! అని అంటే అది ఇతర భూత మిశ్రమము వలన ఏర్పడినది. ఇది ఆయా ప్రదేశ వాతావరణముపై ఆధారపడియుండును. జాగ్రదావస్థ వ్యవహారమునకు విశ్వుడభిమాని. విశ్వ వ్యవహారములు చేయువాడగుట చేత ఆ పేరు వచ్చినది. జాగ్రదావస్థ అంతయు కోర్కెలతో కూడిన దగుట చేత రజోగుణ ప్రధానమైనదని యందురు. ఆలోచనలకు హద్దులు లేవు. అందుకే విపరీత జ్ఞానము కలదన్నారు. అన్నీ కంటితో చూచి తెలిసికొని చేయబడును కాన దృశ్యరూపమని యన్నారు. ఏమి అనుభవించినా స్థూల శరీర అనుభూతితోనే అందుకే స్థూల భోగమని యన్నారు. ఇది ఓంకారమందు గల నాలుగు పాదములలో మొదటి పాదమైన అకార మాతృక వలన ఈ దేహము దీని వ్యవహారమేర్పడినదని వేదాంత నిర్ణయము. ఇది యుంటేనే మిగతా అన్ని దేహాలు. అలాగే వేదములలో ఋగ్వేదము యీ దేహమును గూర్చి తెలుపునని గుర్తెరుగ వలయును. ఈ దేహ వ్యవహారమంతా వైఖరీ వాక్కుతో జరుగును. అయితే, పృథ్వీభువనము పృథ్వి వలననే ఏర్పడలేదు. పంచభూతముల సమ్మేళనమే ఈ స్థూల దేహము. ఈ దేహమందు ఇరువదియైదు తత్వములుండుట చేత పంచవింశతి తత్వాత్మకం అని అన్నారు.

దీనియందు నాలుగు కళలు ప్రత్యేకముగా కలవు. అవి యేమన

1. ఉత్పత్తి అనగా తననుండి అనేకముగా సృజన చేయుట
2. ఇవియన్నియు జాగ్రత్త అవస్థయందే జరుగును.
3. ఒక దానినుండి మరొకటి గ్రహించుట లేక ఒకరినుండి మరొకరు తెలిసికొనుటను బోధ అందురు.
4. సకల వ్యవహారములు ఈ దేహముతోనే జరుగును. ఈ వ్యవహారమునే వ్యాపారమని అందురు.

ఈ దేహమును అన్నమయ పురుషయోగము వలన సాధించుకొనదగును.

## భూతాకాశం - జలభువనము సూక్ష్మదేహం

| | 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|---|
| | భూతములు | ఆకాశం | వాయువు | అగ్ని | జలం | పృథ్వి |
| 1. | ఆకాశం | జ్ఞానము | మనస్సు | బుద్ధి | చిత్తం | అహంకారం |
| 2. | వాయువు | సమానం | వ్యానం | ఉదానం | ప్రాణం | అపానం |
| 3. | అగ్ని | శ్రోత్రం | త్వక్కు | చక్షువు | జిహ్వ | ఘ్రాణం |
| 4. | జలం | శబ్దం | స్పర్శ | రూపం | రసం | గంధం |
| 5. | పృథ్వి | వాక్కు | పాణి | పాదం | గుహ్యం | గుదం |

## సూక్ష్మ దేహలక్షణము

1. సూక్ష్మదేహం; 2. కంఠస్థానం; 3. అంగుష్ఠప్రమాణం; 4. శుక్ల వర్ణం; 5. తైజసుడభిమాని; 6. స్వప్నావస్థ; 7. సత్వగుణం; 8. అన్యధాజ్ఞానం; 9. దృష్టరూపం; 10. ప్రవివ్యక్తభోగం; 11. ఉకారమాతృక; 12. యజుర్వేదం; 13. మధ్యవాక్కు; 14. పంచీకృతమయం; 15. జలతత్వం; 16. మనోవికారం.

## జలము యొక్క ప్రత్యేకతలు

1. సాదృశం; 2. అసాదృశం; 3. యద్రుశం; 4. తాదృశం.

మనము యిదివరకు సాంఖ్యవిచారణలో పంచభూతముల వలన స్థూల శరీరము పంచతన్మాత్రల వలన సూక్ష్మశరీరము లేక ఇంద్రియము లేర్పడిన విధానమును సవివరముగా తెలిసికొన్నాము. ఇపుడు జలభువనమును లేక జల ప్రపంచమును గురించి తెలిసికొందాము.

జలమునకు 'గంగ' యని కూడ అందురు. అనగా పవిత్రమైనదని అర్ధము. ఇది అపరిశుద్ధమైన వస్తువులను, శరీరములను, మనస్సులను పవిత్రత గావించు గుణము కలిగినది. చల్లని గుణము, ప్రవహించుట, స్వచ్ఛత, ఇతర యే వస్తువుతో నైన కలిసిపోవుట, ప్రాణమునకు ఆధారముగా నిల్చుట, జలమున్న చోటనే సకల జనులు జనులే కాదు సకల ప్రాణుల నివాసము, ఇది లేకపోతే పంటలు పండవు. ఏ ప్రాణీ కూడ బ్రతుకలేదు. ఇది పృథ్వికన్న సూక్ష్మము. అందువలన సూక్ష్మస్వరూప మైన ఇంద్రియముల సముదాయమంతా ఈ జలభువనములోనికి చేరినవని గ్రహించాలి.

1. శబ్దమున్నచోట జ్ఞానముండునని పంచీకరణము వలన తెలిసికొన్నాము.

సంక్షిప్తముగా ఇచట వివరించుకొందాము. స్పర్శ, రూప, రస, గంధ తన్మాత్రల కలయికచే ఈ జ్ఞానము అంతఃకరణ చతుష్టయముగా మారినది అనగా మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారములని పిలువబడే అంత్రరేంద్రియములేర్పడినవి.

2. స్పర్శ తన్మాత్ర వలన వ్యానమేర్పడగా శబ్ద,రూప, రస, గంధ తన్మాత్రల కలయికచే సమాన, ఉదాన, ప్రాణ, అపానములను ప్రాణేంద్రియము లేర్పడినవి.

3. రూప తన్మాత్ర వలన చక్షువు ఏర్పడగా శబ్ద, స్పర్శ, రస, గంధ తన్మాత్రల చేరికచే శ్రోత్రము, త్వక్కు, జిహ్వ, ఘ్రాణములను జ్ఞానేంద్రియము లేర్పడెను.

4. రస తన్మాత్రచేత రసమేర్పడగా, శబ్ద, స్పర్ష రూప, గంధ తన్మాత్రల చేత శబ్ద, స్పర్శ, రూప, గంధములతో కూడిన విషయేంద్రియము లేర్పడినవి.

5. గంధ తన్మాత్ర చేత గుదమేర్పడినది. శబ్ద, స్పర్శ, రూప, తన్మాత్రల చేరిక చేత 1. వాక్కు, పాణి, పాద, గుహ్యములను కర్మేంద్రియములేర్పడినవి. ఈ పంచ వింశతి అనగా ఇరువదియైదు తత్వములకే సూక్ష్మదేహమని అందురు.

ఇది కంటికి కనబడదు. కాని దీని వ్యవహారము స్థూల దేహ అవయవముల కదలికల వలననే కాననగును. అందుకే దీనిని సూక్ష్మ దేహమని యందురు. దీని వ్యవహారము కంఠస్థానమందు స్వప్నావస్థయందు తెలియబడును. ఈ యవస్థకు తైజసుడభిమాని. ఈ స్వప్నం శుక్ల వర్ణమయమై తేజోమయముగా నుండును. ఈ దేహము అంగుష్టమాత్రముగా నుండునని పెద్దల నిర్ణయము. దీని ప్రపంచము సువిశాలం. హద్దు, ఎల్లలు లేవు. ఇది సత్వ గుణ ప్రధానమైనది. జ్ఞానమునకు నిలకడలేదు ఎటుబడితే అటే అందువలన దీనిని అన్యధా జ్ఞానమని అందురు. ఇది జ్ఞాన నేత్రమునకు కనబడును. అందుచే దృష్టరూపమని చెప్పుదురు. ఇది మానసిక అనుభూతి మాత్రమే. చేసి చేయనట్లు చేయక చేసినట్లు. కావున ప్రవివ్యక్త భోగమని అన్నారు. ఓంకారమునందు నాలుగు మాత్రలలో రెండవది అనగా 'ఉ' కార మాతృక దీనికి మూలమని యందురు. వేదములలో రెండవదైన యజుర్వేదమునందు దీని వివరము తెలిసికొనదగును. ఈ దేహావస్థ ఎవరి కలవారికే ఎవరి మాట వారికే తెలియబడును గాన మధ్యమవాక్కని నిర్ణయించిరి. ఇది కూడ పంచతన్మాత్రల వలన పంచీకృతమై ఇరువదియైదు తత్వములుగా మారినది. ఇది రస తన్మాత్రకు మూలమగుట వలన జలతత్వమని యందురు. ఇది మనో వికారము వలన సంభవించును. కాన మొత్తము 16 లక్షణములతో కూడినదీ జల భువనము లేక సూక్ష్మదేహము దీని ప్రత్యేక కళలలో మొదటిది. సాదృశం అనగా జ్ఞాన నేత్రమునకు గోచరమగునని అర్థము. రెండవది అసాదృశం క[illegible]నది. క్షణంలో

మాయమగును. అందువలన అసాదృశమని అన్నారు. దీనికి ఒక తీరు వుండదు. ఒక రూపం ఉండదు. ఏ రూపమంటే ఆ రూపం ధరించుట యాదృశమని అందురు. త+అదృశం = తాదృశం అని అంటే కనబడినవి వెంటనే మాయమగుట అని ఒక అర్థం. మరొక అర్థమేమనగా దాని సంకల్పరూప దృశ్యములే కాని మన నిర్ణయాలు యేవి దానిముందు పనికిరావని అర్థం. దీనిని ప్రాణమయ పురుషయోగము వలన జయించవచ్చును.

## కారణ దేహము - తేజోభువనము

| | 1 | 2 | 3 | 4 | 5 |
|---|---|---|---|---|---|
| **భూతములు** | **ఆకాశం** | **వాయువు** | **అగ్ని** | **జలం** | **పృథ్వి** |
| **ఆకాశం** | **అవకాశము** | **శిధిలీకరణం** | **రూఢం** | **మృదుత్వం** | **పిండీ కరణము (చేర్చబడుట)** |
| **వాయువు** | **ఆవరణం** | **శోషణం** | **అవిచారం** | **పోషకత్వం** | **శబలత్వం** |
| **అగ్ని** | **నిరావరణం** | **ధీరత్వం** | **గూఢం** | **విశదత్వం** | **మూర్తిత్వం** |
| **జలము** | **విస్మృతి** | **భ్రాంతి** | **కృతజ్ఞత** | **క్లేదనత్వం** | **లజ్జ** |
| **పృథ్వి** | **అప్రమాణం** | **శంక** | **సంశ్లేషత్వం (ఆలింగనము) (బంధము)** | **ధారణత్వం** | **కాఠిన్యం** |

## కారణ దేహలక్షణము

1. కారణదేహము; 2. హృదయ స్థానము; 3. అంగుష్ఠ అర్థ ప్రమాణము; 4. కృష్ణవర్ణము; 5. ప్రాజ్ఞుడభిమాని; 6. సుషుప్త్యావస్థ; 7. తమో గుణము; 8. అజ్ఞాన స్థానము; 9. అదృశ్యరూపం; 10. ఆనందభోగం; 11. మకార మాతృక; 12. సామవేదం; 13. పశ్యంతి వాక్కు; 14. తేజో మండలం; 15. తేజస్తత్వం.

## అగ్ని యొక్క కళలు

1. మరణము; 2. విస్మృతి; 3. మూర్ఛ; 4. నిద్ర

## అవరోహణ క్రమము

ఆకాశమనగా దేనికి అవకాశమిచ్చుట కలదో దానిని ఆకాశమని అందురు. ఆ అవకాశమునకు వాయువు యొక్క చలనము చేరుటచే శిథిలీకరణము ఏర్పడును.

అనగా ఆ అవకాశము వస్తువుల నాశ్రయించుటచేత ఏ వస్తువునకు ఆ వస్తువే లెక్కకు రావడము వలన దానికి శిథిలమేర్పుడుట వలన శిథిలీకరణము ఏర్పడెనని యనవలసి వచ్చెను. ఆ అవకాశమునకు అగ్నియొక్క తేజము చేరుటవలన ఏ వస్తువున కావస్తువు తేటపడుటవలన రూఢమేర్పెడెనని యనిరి. ఈ అవకాశమునకు జల స్నేహమువలన మృదుత్వమేర్పడెనని చెప్పిరి. ఈ అవకాశమునకు పృథ్వి యొక్క కఠినత్వము చేరుటవలన పిండీకరణ మాయెననిరి. బిందువులు కఠిన రూపము దాల్చి అణుస్వరూపము పొంది ఒకచోట చేర్చబడెనని భావము.

వాయువు యొక్క చలనము వలన శోషణము కలిగెను. శోషణము అనగా పదార్థమునందు గల తేమను లేనట్లు చేయుటయని అర్థము. ఈ శోషణమునకు ఆకాశము యొక్క అవకాశము చేరుటవలన అది అన్నింటిని ఆవరించుట చేత ఆవరణమేర్పెడెనని యనిరి. శోషణమునకు అగ్ని యొక్క తేజము చేరుటవలన అజ్ఞానమనే చీకటి అంతరించుట చేత విచారము తొలగుటచే అవిచారస్థితి కలిగెనని చెప్పిరి. ఈ శోషణమునకు జలస్నేహము జతపడుటవలన అవిచార రూపజ్ఞానము పోషింపబడుటవలన పోషకత్వమేర్పడెనని చెప్పిరి. ఈ శోషణమునకు పృథ్వి యొక్క కఠినత్వము చేరుటవలన చిత్రవిచిత్ర ఉపాదు లేర్పడుట చేత శబలత్వము కలిగెననిరి.

అగ్ని యొక్క తేజము వలన గూఢము కలిగెను. గూఢము అనగా రహస్యమని యర్థము. ఈ సృష్టి నిరాకారము నుండి సాకారమునకు నిర్గుణము నుండి గుణరూపము ఎలా పొందెనో వీని సృష్టికర్త యగు బ్రహ్మదేవునకు గూఢ అగమ్యమని అందురు. అందువలన ఈ సృష్టి విధానము అగమ్యమగుటచే అగ్నివలన గూఢము కలిగెనని యనిరి. ఈ గూఢమునకు ఆకాశ అవకాశము చేరుటవలన నిరావరణ కలిగెను. అనగా అజ్ఞానమను తెర తొలగినదని భావము. ఈ గూఢమునకు వాయువు చలనము చేరుటవలన చేయవలసిన పనిని నిర్విఘ్నముగా చేయగలనను ధీమా కలుగుటచే ధీరత్వమేర్పడినదని నుడివిరి.

ఈ గూఢమునకు జలము యొక్క స్నేహము చేరుటవలన వ్యవహార మంతయు విపులమయ్యెను. అనగా సులువుగ తెలియబడెను. అందువలన విశదత్వ మాయెనని చెప్పిరి. ఈ గూఢమునకు పృథ్వి కఠినత్వముచేరి తేటపడిన సృష్టికి రూపకల్పన జరుగుటచే మూర్తత్వమేర్పడెనను మాట ప్రచారమయ్యెను.

జలమునకు స్నేహము అను రసగుణము కలదు. అందువలన అది దేనినైనను తడుపగలదు. అందువలన జలము వలన క్లేదనత్వమేర్పడెనని చెప్పిరి. ఈ క్లేదమునకు ఆకాశము యొక్క అజ్ఞాన అవకాశము వలన విస్మృతి కలిగెను.

ఈ క్లేదమునకు వాయువు యొక్క చలనము చేరుట చేత లేని దానిని కలదను భావ మేర్పడుట చేత భ్రాంతి ఏర్పడెనని యనిరి. ఈ క్లేదనత్వమునకు అగ్ని తేజము చేరుట అనగా భ్రాంతి రహిత బోధ అగ్నిచేత సంశయము తీరెను. అందువలన కృతజ్ఞత కలిగెను. ఈ క్లేదనత్వమునకు పృథ్వీ కఠినత్వము చేరుట చేత తన అజ్ఞాన స్థితికి తానే సిగ్గుపడుటచేత లజ్జ కలిగెనని చెప్పిరి.

పృథ్వి యొక్క ధర్మము కఠినమగుటచేత పృథ్వి వలన కాఠిన్యమేర్పడెనని యనిరి. ఈ కాఠిన్యమునకు ఆకాశము యొక్క అవకాశము చేరుట వలన అనేక వస్తువులు ఒక దానికి ఒకటి పోలిక లేనట్లు ఒక గుణముతో మరొక గుణము సరిపోకపోవుట చేత అప్రామణ మేర్పడెనని యనిరి. ఈ కాఠిన్యమునకు వాయు చలనము చేరుటవలన ప్రమాణమే లేక పోయెనను శంక కలిగెను. ఈ కాఠిన్యమునకు అగ్ని తేజం వలన సంశ్లేశత్వమను బంధము కలిగెను. ఈ కాఠిన్యమునకు జల స్నేహము చేరుట వలన పదార్థమునకు పదార్థమునకు, భావమునకు భావమునకు ఏకీకరణ లేక కలిసిపోవుట జరుగుటచేత ధారణత్వ మేర్పడినదని చెప్పిరి.. ఈ శరీరమును మనోమయ పురుష యోగము ద్వారా సిద్ధింపజేసికొనవచ్చును.

స్థూల దేహము మరియు సూక్ష్మదేహము దీనిపైననే ఆధారపడి యుండుట చేత దీనికి కారణ దేహమని పేరు కలిగెను. దీనికి స్థానము హృదయము. ఇది అర్థ అంగుష్ఠ ప్రమాణముండును. ఇది కృష్ణవర్ణము కలిగియుండును. దీని అభిమానికి గాఢమైన అజ్ఞానము కలవాడగుట చేత ప్రాజ్ఞుడని పేరు కలిగెను. దీని అవస్థ సుషుప్తి. ఇది తమోగుణము కలది. దీనికి అవిద్య లేక అజ్ఞానమే స్థానము. ఇది కంటికి కనబడదు. అందువలన దీనిరూపం అదృశ్యరూపం. ఇది ఆనందమయ కోశమగుటచేత ఆనందభోగము. ఓంకార రూపమందు ఇది మకార మాతృక. ఇయ్యది సామవేదమునకు ప్రతీక. ఇది పశ్యంతి వాక్కునకు నిలయము. ఇయ్యది త్రివిధ మండలములలో అగ్నిమండలము లేక తేజో మండలము. అందువలన దీని తత్వము తేజస్తత్వమని నిర్ణయము. దీనికె 1) మరణము; 2) విస్మృతి;3) మూర్ఛ; 4) నిద్ర. ఇవి అగ్ని యొక్క ప్రత్యేక కళలు.

మానవులు స్థూల శరీరముతో వ్యవహారము చేయుదురు. పూర్వజన్మమున చేసిన ప్రారబ్ధ కర్మఫలములు ఫలాపేక్షతో కూడినవై యుండుటచేత అవి సూక్ష్మముగా సూక్ష్మశరీరమునుండి కారణ శరీరమందు ఆగామియందు ప్రవేశించును. ఆగామీ కర్మలు సంచిత రూపము దాల్చి పునర్జన్మకు హేతువగును. ఈ జన్మకు పూర్వ జన్మ వాసనలు హేతువగుటవలన ఆ వాసనలకు అంతఃకరణము అవకాశమిచ్చెను.

ఈ అవకాశమే వాసనా వాసితమై అంతఃకరణమునకు ఆవరణమయ్యెను. ఈ వాసనలు చైతన్యరూప జ్ఞానమును తొలగించుట వలన ఆవరణ రహితమై నిరావరణ మేర్పడును. ఆ నిరావరణ రూపము వలన తనను తాను మరచుటచే విస్మృతి కలుగును. ఈ విస్మృతికి ఒక తీరు లేకపోవుట వలన ప్రమాణము లేనిదగుటచే అప్రమాణమని యనవలసి వచ్చెను. ఈ అప్రమాణ స్థితి వలన అనేక భ్రాంతులు అలముకొనుట వలన తానెవ్వరో తనకు తెలియకపోవుట వలన సత్యజ్ఞానానంద రూపమైన తనకు విఘాతమేర్పడి తన స్వస్వరూపము శిథిలమై శిథిలీకరణ మేర్పడెను. అందువలన ఆశలు అడియాసలయ్యెను. అందువలన శోషణత్వము కలిగెను. ప్రకృతి సంబంధమైన పనులు చేయుట యందు ధీరత్వము పూనెను. ఈ ధీరత్వము భ్రాంతికి హేతువయ్యెను. ఈ భ్రాంతుల వలన అనేక అనుమాన రూపశంకలు కలిగెను. ఈ శంకలు నానాటికి బలపడెను. అనగా రూఢత్వమేర్పడెనని భావము. ఈ రూఢత్వము వలన ఆత్మస్థితికి దూరమైతిననే సువిచారము లేకపోవుటవలన అవిచారుడని నుడివిరి. ఈ అవిచార స్థితి ఎంతయని నిర్ణయించలేకపోవుటవలన గూఢమని యనిరి. ఈ నిగూఢ వ్యవహారములు నిరాటంకముగ జరిగిపోవుట వలన మాయా శబలిత పరమేశ్వరునకు కృతజ్ఞుడై మాయను ఆలింగనము లేక బంధమునకు లోనై సంశ్లేషత్వము చెందెను. అందువలన విషయ వాసనలు మెత్తబడెను. అనగా వాసనా వాసిత మృదుత్వము కలుగుటే గాక వానిని పోషించె పోషకత్వుడయ్యెను. ఆ వాసనలు నానాటికి అభివృద్ధి చెందుట చేత జాగ్రత్తయందు విశదత్వమగుచునే యుండును. ఆ వాసనలు అజ్ఞానముచే తడుపబడుటచేత క్లేదనత్వమని యనిరి. ఈ క్లేదనత్వ వాసనలు ప్రాపంచిక విషయములను విశేషముగా పొందుటచే ధారణత్వమేర్పడెను. అవి అంతఃకరణమునకు చేర్చబడుటచేత పిండీకరణమని యనిరి. ఈ విషయ వాసనలు చిత్ర విచిత్రముగా నుండుట చేత శబలత్వమని యనిరి. ఇవి యన్నియు నానాటికి రూపు దాల్చుటచేత మూర్తత్వమని యనిరి. అందువలన పారమార్థిక తత్వము లేకపోవుట వలన మాయా విలసిత రూపు ఆ తత్వము ముందు తల యొగ్గుటచే లజ్జ వహించినదని అనవలసెను. అయితే మాయా మోహితమగు అంతఃకరణము జడత్వము చెందుట చేత కాఠిన్యత్వము కలదిగా వాక్కొనిరి. అట్టి కాఠిన్యస్థితిని కలిగినవాడగుట చేత అతను కారణ దేహ స్థితిని పొందినవాడు లేక తేజోభువన నివాసుడని పెద్దల నిర్ణయము.

ఈ తేజో భువనము లేక కారణ దేహము మనోమయ పురుషయోగము వలన జయించనగునని అచల ఋషుల నిర్ణయము.

# ఆరోహణ క్రమము

కఠినశిలను మనము మన వ్రేలితో రాపిడి చేయుటవలన ఆ శిల కొన్నాళ్ళకు గుంతపడును. అట్లే ఎంత కఠినచిత్తునకునైన ఆధ్యాత్మిక తత్వాన్ని పాటలచేతగాని, పద్యాలచేతగాని లేక తత్వబోధవలన మార్పు చెందకతప్పదు. తన పొరపాటును తాను తెలుసుకొనును. రత్నాకరుడు నారదోపదేశము వలన వాల్మీకిగా మారినట్లు భోగివేమన యోగి వేమనగ మార్పుచెందినట్లు తన చేష్టలకు తనకే సిగ్గుకలుగును అదే లజ్జ. ఆ లజ్జ కలిగిన తర్వాత ఆధ్యాత్మిక తత్వమును తెలిసికొనును. పాతదానిపైన రోత కలుగును. క్రొత్త రూపమును తెలిసికొనును. అనగా దానినే మూర్తత్వమని యందురు. అధ్యాత్మిక స్థితి యందు తీవ్రకృషి చేస్తు క్రొత్త క్రొత్త విషయములను తెలిసికొనును. సృష్టి వైచిత్రమును గమనించును. దానినే శబలత్వమని యందురు. సృష్టి వైచిత్రమునకు మూలమును గ్రహించుటకు వానిని అంతఃకరణముకు చేర్చుకొనును దానినే పిండీకరణమని యందురు.

తాను సృష్టి యొక్క మూలమును గ్రహించి దానిని అంతఃకరణమునందు దృఢ పరచుకొనుటయే ధారణత్వమనబడును. దానిని పరిపూర్ణ ప్రబోధ అను అమృతము చేత తడుపబడుటను క్లేదనత్వమనుబడును. అలా ప్రబోధ చేత తడుపబడిన కొలది అంతఃకరణము తేటపడును. దానినే విశదత్వమని యందురు. అట్లు తేటపరచుకొనిన దానిని పోషించుకొనిన దానిని పోషకత్వమని యందురు. అట్లు పోషించుతు పోగ గురుమూర్తి కరుణచే హృదయ కాఠిన్యత తొలగిపోయి మృదుత్వమేర్పడును. ఆ తర్వాత ప్రాపంచిక విషయములను విడచి పారమార్థిక విషయములకు కట్టుబడుట లేక దానియందు మనస్సును చొప్పించుట సంశ్లేషత్వ మనబడును. ఇట్టి స్థితి కలుగుటకు గురుమూర్తి కృపయే కారణము అని తెలిసికొని వారికి కృతజ్ఞతలు అర్పించుకొన వలెను. తర్వాత ప్రబోధ యందలి రహస్యములను తెలిసికొని అంతఃకరణమునందు భద్రపరచుకొని యుండుట గూఢమగును. ఇక ప్రాపంచిక విషయముల యందు చింత లేకుండుట అవిచారమగును. అట్టి అవిచార స్థితిని స్థిరపరచుకొనుట రూఢి యగును.

అయినా మూల ప్రకృతి మూర్ఖురాలగుటచేత తన స్వభావము పోనివ్వక నేను తరించగలనో లేనోయను సంశయములకు లోనగుటను శంక యని యందురు. అట్టి శంక వలన భ్రాంతులు కలుగుచుండును. కలిగినా గురుకృపవలన నిరంతర చింతన వలన మనలో ధీరత్వమేర్పడును. అలా ధీరత్వమేర్పడుటచే భ్రాంతిరూప శంకలు శోషింపబడును. ఒక దాని తర్వాత ఆ శంకలు శిథిలీకరణము చెందును.

ఇది వీని కృషిపైన ఆధారపడియుండును. వాని అనుష్ఠానముపై ఆధారపడియుండుట చేత నిర్దిష్టమైనది లేకపోవుట వలన అప్రమాణమందురు. లేక ప్రాపంచికము దాని విషయములు అప్రమాణికమని గ్రహించును. అట్టి విషయవాసనలను ఒక్కొక్కటి వదలివేయుటచేత వానిపైన విస్మృతి కలుగును. ప్రాపంచిక విషయ వాసనలు తొలగి పోవుటవలన నిరావరణమేర్పడెను. కాని ప్రాపంచిక విషయములు ప్రపంచమును మిధ్యాస్వరూపమని నిరూపింపబడిన తర్వాత జగత్తునకు మూలమైన దొకటి కలదనియు అది సత్యము నిత్యము అను భావము తన యంతఃకరణమును ఆవహించుటయే ఆవరణము. అట్టి ఆవరణమునకు అంతఃకరణము అవకాశ మిచ్చుట వలననే దాని రహితము కొరకు కారణ దేహము లేక తేజో భువన నిరసనా నంతరము మహాకారణదేహము లేక వాయుభువన నిరసనకు అవసర మేర్పడెను. ఇయ్యది అనగా కారణ దేహ నిరసననే మనోమయ పురుషయోగమని యందురు.

## మహాకారణ శరీరము - వాయుభువనము

| భూతములు | ఆకాశం | వాయువు | అగ్ని | జలం | పృథ్వి |
|---|---|---|---|---|---|
| ఆకాశం | పూర్ణత్వం | అశోషత్వం | అదాహ్యత్వం | అక్లేద్యత్వం | అచ్ఛేద్యత్వం |
| వాయువు | అఖండత్వం | అభేదత్వం | ఊర్ధ్వపదత్వం | జగజ్జీవత్వం | సమృద్ధత్వం |
| అగ్ని | అసంగత్వం | పరాత్పరత్వం | ప్రకాశత్వం | పరంజ్యోతిత్వం | కారణత్వం |
| జలము | వ్యాపకత్వం | అజరత్వం | చైతన్యత్వం | అమృతత్వం | పావనత్వం |
| పృథ్వి | సర్వబీజకత్వం | నిర్మలత్వం | అనర్ఘత్వం | కారుణ్యత్వం | సర్వధారత్వం |

## మహాకారణ దేహలక్షణము

1. మహాకారణదేహము; 2. మూర్ధ్నిస్థానము; 3. మసురామాత్రప్రమాణం; 4. నీలి వర్ణము; 5. ప్రత్యగాత్మ (ప్రత్యేక ఆత్మాభిమానం); 6. తురీయావస్థ; 7. సగుణము; 8. వివేక జ్ఞానము; 9. దృష్టరూపము (ద్రష్ట); 10. వైభోగిక భోగం; 11. అర్ధమాతృక; 12. అధర్వణవేదము; 13. పరావాక్కు; 14. వాయుమండలము; 15. వాయుతత్వము.

## వాయువు యొక్క ప్రత్యేక కళలు

1. వైరాగ్యము; 2. ముముక్షత్వము; 3. ఆత్మత్వంపద దర్శనము; 4. తురీయావస్థ

# అవరోహణ క్రమము

1. ఆకాశము బయలుగా నుండుట ధర్మము. వాయు భువన స్వరూపమగు మహాకారణ శరీరము తన చైతన్యస్వరూప స్థానమునందు తాను వెలితిలేక నిండియుడుట చేత అయ్యది పూర్ణత్వముగా నున్నదని చెప్పిరి. ఈ పూర్ణత్వమునకు వాయు చలనము చేరినను అది శోషింపబడలేదు. అందువలన దానిని అశోషత్వస్థితి కలిగినది. దానికి అగ్ని తేజము సోకినను దహింపబడలేదు. అందువలన అదాహ్యత్వము సిద్ధించినది. జలస్నేహము వలన తడుపబడలేదు. అందువలన అక్లేదత్వమబ్బినది. పృథ్వియొక్క కాఠిన్యత చేరుటవలన అది దేని చేతను ఛేదింపబడలేనిదగుటచే అచ్ఛేద్యత్వమని చెప్పిరి.

2. వాయు చలనము వలన రూపములన్నియు చెదిరిపోవుటచే అభేదత్వ మేర్పడినది. ఆకాశ పూర్ణత్వము దీనికి చేరుటవలన అఖండత్వమేర్పడినది. దీనికి అగ్ని తేజత్వము వలన ఊర్ధ్వ పదత్వమబ్బినది. దీనికే జలస్నేహము వలన జీవులు జీవించుటకు ప్రాణాధారమగుటచే జగజ్జీవత్వమబ్బినది. దీనికే పృథ్వి కాఠిన్యత వలన జీవులకు సమృద్ధత్వమబ్బినది.

3. అగ్నియొక్క తేజము వలన ప్రకాశత్వ మేర్పడినది. ఈ ప్రాకాశమునకు ఆకాశబయలు కలియుట వలన అసంగత్వమేర్పడినది. వాయువు యొక్క చలనము చేరుటచే స్థూల సూక్ష్మ శరీరములకు పరమైన కారణ శరీరమునకు కూడ పరమగు టచే పరాత్పరత్వము సిద్ధించినది. ఈ తేజమునకు జలస్నేహము చేరుట వలన పరంజ్యోతిత్వమబ్బెను. దీనికే పృథ్వికఠినత్వము వలన సకల వుపాదుల ధారణకు అయ్యదే కారణమగుటచే కారణత్వమబ్బినది.

4. జలస్నేహమువలన మహాకారణదేహమునకు అమృతత్వమబ్బినది. ఆ అమృతత్వమునకు ఆకాశబయలుచేరి వ్యాపకత్వమును, వాయుచలన చేరికచే అజరత్వమును, అగ్నితేజము వలన చైతన్యత్వమును, పృథ్వి యొక్క కాఠిన్యత వలన పావనత్వమును సిద్ధించెను.

5. పృథ్వి యొక్క కాఠిన్యతవలన సర్వధారత్వస్థితియును, దీనికి ఆకాశబయలు కలిసి సర్వబీజకత్వమును, వాయు చలనము వలన నిర్మలత్వమును, అగ్నియొక్క తేజము వలన అనర్ఘ్యత్వమును జలస్నేహము వలన కారుణ్యత్వము సిద్ధించెను. ఈ వాయు భువనమునే మహాకారణ దేహమనియందురు. కారణదేహమునకు కూడ యిది కారణమగుటచే దీనికి మహాకారణదేహమను పేరు కలిగెను. ఇయ్యది స్థూలదేహమునందు మసురామాత్రప్రమాణము అనగా ఇది

పెసరగింజంత యుండునని నిర్ణయము. ఇది నీలివర్ణము కలిగియుండును. దీని అభిమాని ప్రత్యగాత్మ. దీని స్థితి తురీయావస్థ. దీని గుణము సగుణము. ఇయ్యది వివేకజ్ఞానము కలిగి యుండును. దీని వ్యవహారము స్థూలమందే కనపడును. అందువలన దృష్టరూపము అనియనిరి. అనగా కంటికి కనపడును. లేక వానిని గమనించుటచేత ద్రష్టయని యందురు. దీని భోగము వైభవముగా నుండుటచే వైభోగిక భోగమని యనిరి. ఇయ్యది ఓంకారమునందు అతి సూక్ష్మమైన అర్ధమాత్రక స్వరూపము. ఇది నాల్గవ వేదమగు అధర్వణవేద స్వరూపము. లేక ఆ వేదమే దీనికి ఆధారము. దీనికి పరావాక్కు నిర్ణయింపబడినది. ఇయ్యది వాయు మండలాంతర్గతమైనది. అందువలన యీ దేహము వాయుతత్వమయమని నిర్ణయము. వాయువు యొక్క ప్రత్యేక కళలు. 1. వైరాగ్యము అనగా ప్రాపంచిక విషయములందు విరాగము కలిగియుండుట; 2. ముముక్షత్వము అనగా ప్రాపంచిక విషయ వాసనలనుండి విముక్తి పొందుటకై అభిలషించుట; 3. ఆత్మ పద దర్శనము అనగా ఆత్మ స్వరూపమును తెలిసికొనుట; 4. తురీయావస్థ అనగా జాగ్రత స్వప్న సుషుప్తి అవస్థలకు విలక్షణముగా నుండునది తురీయావస్థ.

ఈ మహాకారణ శరీరము యొక్క ప్రభావము అనగా అధిష్ఠాన చైతన్యము యొక్క ప్రభావము స్థూల, సూక్ష్మ కారణముల యందు కూడ నుండుటచేత ఆ చైతన్యము కూడ పూర్ణముగ నున్నదని పూర్ణత్వమని యనిరి. ఈ పూర్ణత్వము నాల్గింటియందున తెంపులేకయుండుటచే అఖండత్వమనిరి. అయినను అది స్థూల, సూక్ష్మ కారణములకు అంటుకొనిలేదు. మజ్జిగయందు గల వెన్న మజ్జిగనంటు కోనట్లుండుట చేత అసంగత్వమేర్పడెను. అయినను దాని చైతన్యము పంచకోశముల యందు కూడ నుండుటచే వ్యాపకత్వము సిద్ధించినది. ఇయ్యది సకల జీవోపాదులకు మూలమగుటచేత సర్వబీజ కత్వమబ్బినది. ఈ బీజకత్వము నందుగల అంకురము శోషింపబడక పోవుటవలన అశోషత్వమబ్బినది. ఈ మహాకారణము సకల జీవపాదులకు చైతన్యమొసగుచుండుటచే అభేదత్వమబ్బినది. సకల ఉపాదులకు కారణమైనది పరము. ఆ పరమునకు కూడ పరమగుటచే దీనిని పరాత్పరత్వము సిద్ధించినది. చైతన్యమునకు జరామరణము లేక పోవుటచే అజరత్వమబ్బినది. అది త్రివిధ మలముల కంటకపోవుటచే నిర్మలత్వమబ్బినది.

ఇట్టి నిర్మల చైతన్యము దేని చేతను దహింపబడకపోవుట చేత అదాహ్యత్వ మేర్పడినది. ఇయ్యది అధోరూప వాసనలకంటక పోవుటచేత ఊర్ధ్వ పదత్వమబ్బినది. ఈ ఊర్ధ్వపదము, జ్ఞాన ప్రకాశ స్వరూపమగుటచే ప్రకాశత్వ మబ్బినది. ఈ ప్రకాశము

చిత్స్వరూపమగుటచే చైతన్యత్వము కలిగినదనిరి. ఈ చైతన్యము విడువదగినది కానిదగుటచే అనర్ఘ్యత్వము సిద్ధించినది. ఇయ్యది ఏ విషయ వాసనల చేత తడుపబడని దగుటచేత అక్లేద్యత్వమబ్బినది. కాని ఆ చైతన్యమే జగత్తున కాధారమగుట చేత జగజ్జీవత్వమబ్బినది. పిండాండగతమైనది విశ్వము. బ్రహ్మాండ గతమైనది జగత్తు. విశ్వము ఇహమైతే జగత్తు దానికి పరమైనది. ఆ పరమును ప్రకాశింప జేయునదగుటచేత పరంజ్యోతిత్వమబ్బినది. దీనికి మరణము లేకపోవుటచే అమృతత్వ మబ్బినది. ఈ అమృతత్వం సకల జీవోపాధుల పోషణకుపకారి యగుటచే కారుణ్యత్వమబ్బినది. ఇయ్యది ఏ గుణముచేతను విడదీయరాని దగుటచేత అచ్ఛేద్యత్వమబ్బినది. ఇయ్యది లోపము లేని దగుటచేత సమృద్ధత్వమనిరి. ఇయ్యదే అన్నిటికి మూలమగుటచే కారణత్వము అబ్బినది. దీనియందు యే విధమైన కలుషితము లేకపోవుట వలన పావనత్వమబ్బినది. ఈ పావన స్వరూప చైతన్యమే సర్వమును ధరించుటచేత సర్వధారత్వమబ్బినది. ఈ మహాకారణదేహసిద్ధి లేక జయము-విజ్ఞానమయ పురుషయోగము వలన సిద్ధించును.

## ఆరోహణ క్రమము

స్థూల, సూక్ష్మ, కారణ శరీరధారణకు మహాకారణ శరీరమే మూలము. అందుకే ఆటాడించువాడే అతడే కర్త. అని యున్నది కావున మహాకారణ శరీరము లేకపోతే స్థూల, సూక్ష్మ, కారణ శరీర ధారణయే జరుగదు. వాని ధారణకు ఇదియే కారణమగుటచే దీనికి సర్వ ధారకత్వము సిద్ధించినది. ఈ మహాకారణ శరీరమునకు పరిపూర్ణ ప్రబోధ వలన పావనత్వము సిద్ధించినది. ఇట్టి పావనస్థితి పొందిన తాను సకలమునకు కారణమని గుర్తెరుగవలెను. పరిపూర్ణ పరబాహ్యమునకు తనకు ఎట్టిసంబంధము లేదని కలలో దోచిన శరీరములు ఏమీ లేనట్లు మూలములేని ఈ యీ గుర్తెరిగే శరీరము యేమీ లేదను ప్రబోధ సమృద్ధిగ జరుగవలెను. ఈ నిర్ణయము ఏ ఇతర ప్రబోధల వలనను చెదరరాదు. అలా చెదరని స్థితిలో నుండినచో అభేద్యత్వం సిద్ధించినదగును. అది సిద్ధించిన పిదప భేదభావమును వదలిసర్వ ప్రాణులను సమభావముతో చూచి ఆదరించినచో కారుణ్యత్వం సిద్ధించును. అది సిద్ధించుకొనిన పిదప అమృత స్వరూప ప్రబోధ వలననేను పుట్టనే లేదు. పుట్టని వానికి చావు ఎక్కడిది అను నిర్ణయమందుండుట అమృతత్వమగును. ఇట్టి స్థితి కలిగినవాడు ఎక్కడ యుంటే అయ్యది సుందర శేషగిరి భద్రగిరి రంగనాయక

పురమన దగియుండును. కాన అతడు ఇహమునకు గాక పరమునకు కూడ జ్ఞాన జ్యోతి స్వరూపుడగుటచేత పరంజ్యోతిత్వమబ్బినది. అయితే పరంజ్యోతి స్వరూపమే జగత్తునకు జీవ స్వరూపమగుటచే జగజ్జీవత్వ మబ్బినది. అది ఏ విషయ వాసనలచేత తడుపబడకపోవుటచే అక్లేద్యత్వ మబ్బినది. అట్టి అక్లేద్యత్వస్థితి వదలతగినది కానిదగుటచే దానికి అనర్ఘ్యత్వమబ్బినది. అయ్యది కేవల చైతన్య స్వరూప మగుట చేత చైతన్యత్వమని నుడివిరి. ఈ చైతన్యము కేవలము జ్ఞాన స్వరూపమగుటచేత ప్రకాశత్వమని చెప్పిరి. ఈ ప్రకాశము ఊర్ధ్వమున కెగయును. అందువలన దానికి ఊర్ధ్వపదత్వమబ్బినది. అయ్యది దేనిచేతను దహింపబడదు. అందుచే దానికి అదాహ్యత్వమని యనిరి. అట్టి చైతన్యస్వరూపమునకు ఏ మలములు అంటలేదు. అందువలన నిర్మలత్వమబ్బినది. ఇట్టి నిర్మలమైనటువంటి దానికి ముదుసలితనము లేకపోవుట చేత దైవత్వము సిద్ధించుటచేత అజరత్వమబ్బినది.

అట్టి స్థితి ఇహమునకు పరమునకు అతీతమై యుండుటచే ఆ స్థితినే పరాత్పరత్వమని యందురు. ఆ పరాత్పరత్వము సిద్ధించుటచేత జడజడ భేదముకాని జీవ జడభేదముకాని జడేశ్వర భేదము కాని జీవ జీవ భేదముకాని జీవేశ్వరభేదము కాని అనగా పంచ విధ భేదములు కాని తనయందు లేకపోవుటవలన అభేదత్వ మబ్బినది. అట్టి స్థితియందుండు చైతన్యత్వమబ్బుట వలన అశోషత్వమబ్బినది. అట్టి స్థితి పిండాండ ఈశ్వరాండ బ్రహ్మాండములకు మూలమై యుండుటచేత సర్వబీజకత్వమబ్బినది. సర్వమునకు మూలమైనది అంతటా వ్యాపించినదగుటచే వ్యాపకత్వమబ్బినది. సూర్యరశ్మి సకల వస్తువులకు సకల జీవోపాధులకు తన వెలుతురుప్రసాదింపబడినను. ఆ రస్మి వేనియందు లీనము కాలేదు. అందువలన ఆ చైతన్యమునకు అసంగత్వమబ్బినది. అట్టి అసంగ స్థితి సర్వ దేశములందు సర్వకాలములందు సర్వ వస్తువులందు చంచలము లేక నుండుటచేత అఖండత్వము సిద్ధించినది. ఈ అఖండత్వముచే పూర్ణత్వము సిద్ధించినది. ఇట్టి పూర్ణత్వము ఉపాధుల ననుసరించినదే కాని కేవలాఖండ స్థితిననుసరించినది కాదు. ఇయ్యది ఆకాశ ఆవరణలోనిదేకాన పరిపూర్ణ పరబాహ్యమునందు ఇది లేనిదేయని నిరసించనైనది.

| కైవల్య శరీరము - ఆకాశ భువనము | | | | | |
|---|---|---|---|---|---|
| పంచ మహా భూతములు | నిర్విషయ అంతఃకరణ | నిర్విషయ సమానాదులు | నిర్విషయ రూపాదులు | నిర్విషయ రసాదులు | నిర్విషయ గంధాదులు |
| నిర్విషయ అంతఃకరణ | మహాకాశం (1) (పరాకాశం) | దహరాకాశం | నిరవయ వాకాశం | సూర్యాకాశం | భూతాకాశం |
| నిర్విషయ సమానాదులు | ఆత్మారామత్వం | సమరసత్వ తత్వం (2) | చిదీశ్వరభావ అఖిల లీనత్వం | సత్యజ్ఞానమనంత పరత్వం | అంతర్బాహ్య స్ఫూర్తి రహితత్వం |
| నిర్విషయ రూపాదులు | స్వయంజ్యోతిత్వం | పరంజ్యోతిత్వం | జ్యోతిర్మయత్వం (3) | ఆపోజ్యోతిత్వం | జగజ్జ్యోతిత్వం |
| నిర్విషయ రసాదులు | పరామృతత్వం | అనామృత చైతన్యత్వం | తత్వామృతత్వం | అమృతత్వం (4) | భోధామృతత్వం |
| నిర్విషయ గంధాదులు | భేదా భేదాతీ తత్వం | అబేధాభేదత్వం | భేదాభేదత్వం | అఖండత్వం | అద్వయత్వం (5) |

## కైవల్య దేహ లక్షణము

1. ఆకాశము; 2. వాయువు; 3. అగ్ని; 4. జలము; 5. పృథ్వి లీల సూచనలు

కైవల్య దేహము నిర్గుణము - అద్వితీయమునందు కననగును. ఇది అనుభవనీయము

ఓం శ్రీ సద్గురుభ్యోన్నమః

# కైవల్య శరీరము - ఆకాశ భువనము

కైవల్య శరీరము అనేది వొకటి వున్నదా? అనేది ఒక ప్రశ్న. నిజానికి 4 శరీరాలు వున్నవా అంటే ఆచల ఋషులయొక్క నిర్ణయానుసారము వున్నది ఒకే శరీరము. అదే గుర్తు ఎరిగే శరీరము అని. ఈ కనపడే శరీరానికి అచల ఋషులు ప్రాముఖ్యత యివ్వలేదు. మరి యీ శరీరము యందు గుర్తు రూపముగా, శరీరాన్ని, ఏది క్రియోన్ముఖం చేయగలుగుతోందో, ఆ శరీరాన్ని "గుర్తు యెరిగే శరీరము" అని నామకరణం చేసి, ఆ శరీరము పేరు ఎరుక అని కూడా అన్నారు. అయితే యీ గుర్తు ఎరిగే శరీరము, వేదాంతంలో కేవలం ప్రత్యగాత్మకు మాత్రమే వున్నది. మిగతా 3 శరీరాలకు లేదని చెప్పబడినది. అందుకే భాగవతకృష్ణ దేశికుల వారు "ఆటాడించేవాడు అతడేర కర్తా" అని చెప్పడం జరిగింది. అంటే దేనిని ఆటాడిస్తూ యున్నాడు. స్థూలమునూ, సూక్ష్మమునూ, కారణమునూ కూడ అతడు ఆటాడించడము వలన "హిరణ్మయకోశము"నకు అధిష్ఠానముగా యుందునటువంటి యేప్రత్యగాత్మ ఐతే వున్నాడో, అతడే, మిగతా మూడు శరీరములను ఆడించేటివాడని నిర్ణయము చేయడము జరిగినది.

ప్రత్యగాత్మ, పరమాత్మ వేరా అంటే, ప్రత్యగాత్మయే పరమాత్మ, ఆ పరమాత్మయే ప్రత్యగాత్మ యని వేదాంతములో నిర్ణయించబడెను. అయితే వేదాంతము లో పరమాత్మయని దేనినైతే అంటున్నారో, దానినే అచల ఋషులు గుర్తు యెరిగే శరీరము అన్నారు. గుర్తు ఎరిగే శరీరాన్ని భాగవతుల కృష్ణయ్యగారు "ఎరుక" అని సంబోధన చేసినారు. ఐతే ఎరుక వేరు, ఆ గుర్తు ఎరిగే శరీరము వేరు అని అనుకొనరాదు. ఈ గుర్తెరిగే మేనును బాగుగ తెలిసుండుము, యిందు బట్టక దేనిన్, ఆగడమౌదానను" అని చెప్పినారు. అంటే యీ గుర్తు ఎరిగే శరీరాన్ని; అనగా కనపడే శరీరాన్ని కాదు, బాగుగ తెలిసి వుండు. దీనియందు దేనినీ నీవు పట్టుకోవద్దు, అంటే శరీరము లోపల ఏమేమి వున్నవి? లోన జ్ఞానము, మనసు, చిత్తం, బుద్ధి, అహంకారము; సమాన, వ్యాన, వుదాన, ప్రాణ, అపానములు; శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలు; ఇవికాక గుండెకాయ, వూపిరితిత్తులు, జీర్ణాశయము, మల మూత్రాశయాలు, ప్రేగులు వగైరా వున్నాయి లోన.

కాబట్టి యిదేదో పవిత్రమైనదనుకొని నీవు దానిని స్పృశించవద్దు. స్పృశిస్తే

నీకు యీ మలము, నీ చేతులకు అంటుకొనును. కాబట్టి దీనిలో యేదీ పవిత్రమైనది కాదు. అంతా అపవిత్రమైనదే కాన దేనినీ నీవు ముట్టుకొనవద్దని భాగవత కృష్ణయ్యగారు హెచ్చరిక చేసినారు. ఐతే మనం తెలిసికోవలసిన దేమన, కైవల్య శరీరమనేది దీనిలో వున్నదా? ఎరుకనే శరీరము, మరుపే దాని అవస్థ అని ఆయన అన్నారు. మరుపు అంటే స్థూల శరీరము, సూక్ష్మశరీరము కారణశరీరము, యీ మూడు కలిస్తే 'మరుపు' అని చెప్పడం జరిగింది. మరి మహాకారణ శరీరము అని ఏదైతే వుందో ఆ మహాకారణ శరీరాన్ని 'ఎరుక' అని చెప్పడం జరిగింది. మరి యీ విధంగా ఎరుక, మరుపు అనేవి సరిపోయినవి. ఇక 'కైవల్య' మనేది యేమిటి? ఈ ఎరుకకు, మరుపుతో సంబంధం ఉంటుంది. ఈ మరపునకు మరల ఎరుకతో సంబంధం వుండును. కాబట్టి, ఎరుక, మరుపు కానిది పరిపూర్ణము, పరిపూర్ణస్థితి కలిగినవాడు ఎరుకనుగాని, మరుపును గాని, దేన్నీ అంటుకోడన్నమాట. కాబట్టి అటువంటి స్థితిపురుషుడు, ఎలా వున్నాడంటే పరిపూర్ణము ఎలా వున్నదో, అలా వున్నాడన్నమాట.

"సత్యమగు బట్టబయలును, అసత్యమగు ఎరుకను నెటిగి సద్గురు కృపచే సత్యము కాదీ ఎరుకయని సత్యముగా నమ్మి వుంటే చాలు, చాలన్నా, వానితోటి సాటెవ్వరన్నా, నిత్యానిత్యములనే నిర్ణయము ఎరుగక, నిత్యుడై యుండేటి నిజబోధ కలిగితే చాలు చాలన్నా, వానితోటి సాటి ఎవరన్నా" అని చెప్పడం జరిగింది. అంటే వానిని ఏమన్నారు? "నిత్యుడు" అన్నారు. 'నిత్యుడు' అంటే పరిపూర్ణుడు అని అర్థమా? పరిపూర్ణము యే లక్షణాలు కలిగివుందో ఆ లక్షణాలు వీనిలో వున్నాయి అని అర్థం. ఆ లక్షణాలు కలిగినవాడు, రామునివలె... రామునిలో గుణాలు మన పిల్లవానిలో వున్నాయి అనుకో. "మావాడు రాముడయ్యా" అంటాం. అంటే, వీడేమి చక్రవర్తి కొడుకా? మనమేమో, పొట్టకూటికొరకు, నిత్యమూ కష్టపడి పనిచేసికొంటూ, పోషించుకొంటున్నాం. అంటే, ఆ పిల్లవాడు ఏదో గుణవంతుడు అనడం వలన, తండ్రి సంతోషంగా, "మావాడు రాముడు" అని చెప్పుకుంటున్నాడు. అన్నంత మాత్రాన వాడు రాముడైనాడా? సీతను పెండ్లి చేసుకొనెనా? అడవులకు వెళ్ళెనా? రావణాసురుని చంపెనా? ఏమీ లేదు. కాని, రాముడు ఎట్టి నడక కలిగినాడో, అట్టి నడవడి అలవాటు చేసికొనినాడు అని దాని అర్థం.

అలాగే యిప్పుడు "వీడు పరిపూర్ణుడు" అంటే పరిపూర్ణుడు అయినాడని అర్థం కాదు. పరిపూర్ణం యెలా వుంది? పరిపూర్ణమునందు ఎరుక వున్నదా?

లేదు. అయితే ఎరుకలేదు అంటే శరీరము లేదు. మరి వీనికి శరీరము వుంది. దానికి శరీరము లేదు. అది దేనినీ ఎరగడము లేదు. వీనికి శరీరము వుండినా, వీడూ కూడా దేనినీ ఎరగడము లేదు. ఐతే దానివలె వీడు వున్నాడు. కాని "చలమే", అది మాత్రము "అచలము". చలము ఐనా, వీని నడక ఎలా వున్నదీ అంటే యేదీ మనసులో నిలుపుకొనడము లేదు. ఎరగడము లేదు అంటే, తెలిసికోకుండా వున్నాడని అర్థం కాదు. తెలిసికుంటున్నాడు. మనని ఎవరైనా తిట్టినపుడు, అది మనస్సులో నిలిచి, అది మన మనస్సును కలుక్కుమనిపిస్తుందా? అనిపించదా? తిట్టినపుడు, మనకు బాధ కలుగుతుందా, లేదా? కలుగుతుంది. అయితే వీడు దేనినీ మనసులో వుంచుకోడు. మనసునకు రానివ్వడు. రానివ్వనపుడు, మనసు కలుక్మని అనడం వుంటుందా లేక బాధపడడం అనేది వుంటుందా? ఏమీ వుండదు. వానిని తిట్టినా, వానిలో మార్పు రాదు, పొగడినా మార్పు రాదు. పదవి యిచ్చినా మార్పు రాదు. ఉన్న పదవిని లాక్కున్నా మార్పు రాదు.

ఐతే వున్న పదవి వూడితే అందరూ ఎంత బాధపడతారు? ఎందుకు వీడు బాధపడడూ అంటే, అదే అక్కడ వున్నటువంటిది. అంతఃకరణపైన వీనికి ఏ గుర్తు నిలవడం లేదు, కాబట్టి వీనికి యే హావభావములు కాని, తాపత్రయాలు కాని, లేక ఆనందానుభూతులు కాని, ఏమీ వానికి లేకపోవడం వలన ఆ ఎరుక స్వరూపమైన గుర్తు యేదైతే వుందో, అంతఃకరణలో నిలవడము లేదు. ఐతే వీని అంతఃకరణ ఎలాంటిది అంటే అది అద్దము లాంటిది. అందరి అంతఃకరణలు, ఎట్టివి అంటే సినిమా కెమేరాలో వున్నటువంటి ఫిల్ము లాంటివి. ఐతే యీ కెమేరా ఏమి చేస్తుంది? అన్ని రూపాలని, తనలో అది ముద్ర వేసుకుంటుంది. ముద్ర వేసుకోవడం వలన, ఆ రూపాలు ముద్రించబడతాయి. మళ్ళీ కావాలంటే - ఇపుడు క్రొత్తగా కెమెరాలు వచ్చినై. మనం ఫొటో తీసుకుంటాం. దాన్ని కడగడం గాని, చేయడంగాని, ఏమీ లేదు. వెంటనే మనకు మన రూపంతో వున్న ఫొటో యిచ్చేస్తుంది. అంటే అప్పటికప్పుడే మన రూపం ముద్రింపబడి, కెమెరా మనకు ఫొటో అందిస్తుంది. బొంబే వెళ్ళి యిండియా గేటు కావాలంటే తీసి యిస్తాడు. ఇపుడు శాస్త్రం బాగా అభివృద్ధి అయింది.

అంటే అలాంటి కెమెరా వంటిది మన అందరి అంతఃకరణ. మరి పరిపూర్ణుని అంతఃకరణ మాత్రం అద్దం వంటిది. నీవు అద్దం ముందు నిలబడినపుడు నీ ముఖం దానియందు కనబడును. నీవు ప్రక్కకు తొలగితే, నీ రూపం దానిలో

వుంటుందా? నీ రూపం వుండదు, ఎవరి రూపమూ వుండదు. అద్దం, అద్దం వలెనే వుంటుంది. నీవు దాని ముందరకు వెళ్ళగా నీ రూపం కనబడును. అంతే, నీవు ప్రక్కకు తొలిగితే, వెంటనే నీవు దానియందు లేవు. అలానే పరిపూర్ణుడు, వానిముందుకు, వ్యవహార అవసరార్థం, మనము వెళతాము. వెళ్ళినపుడు మనతో మాటలాడతాడు. మౌనంగా వుండడు, పలకరిస్తాడు. మనం వెళ్ళిపోయిన పిమ్మట, మన సంగతి యేమీ ఆలోచన చేయడు. అప్పటికప్పుడే మనకు యేమి సమాధానం యివ్వవలెనో యిస్తాడు. మనం వెళ్ళిపోయాక, మన గురించి ఆలోచననే చేయడు. ఏమైనా చేసేదైనా, ఇచ్చేదైనా అప్పుడే. మళ్ళీ రమ్మని చెప్పే లక్షణం అతని దగ్గర వుండదు. మళ్ళీ మనం వెళ్తేనే మన గురించి అతడికి తెలుస్తుంది. నీవు వెళ్ళిపోయిన తర్వాత నీ గురించి యింక తెలియదు. ఇల్లు వదలి బయటకు వచ్చినట్లయితే ఇల్లు, యిల్లాలు గురించి యింక జ్ఞప్తికి వుండదు.

మరి యింట్లో వున్నపుడు ఆలు, పిల్లలతో కలిసి యుండును. బయటికి వెళ్ళినపుడు అయిపోయింది, వాళ్ళ సంగతి యిక జ్ఞాపకం రాదు. ఎవరైతే తనముందు వుంటారో వారిని గురించే ఆలోచన గాని, మరి భార్యా,పిల్లలని గురించి ఏ ఆలోచనా వుండదు. ఏలనన ఆయన అంతఃకరణ కెమెరా కాదు. కెమెరా ఐనట్లయితే కెమెరాలో ఫిల్ము వుండును, ఆ ఫిల్ములో ముద్రణ అయివుంటుంది. ఎప్పుడు కావలిస్తే అపుడు మన వ్యవహారాన్నంతా దానిలో చూచుకోవచ్చు. టేప్ రికార్డర్ యిప్పుడు మాటలన్నీ రికార్డు చేసికొంది, ఎప్పుడు కావలసివస్తే అపుడు వాటిని వినవచ్చు. ఏలనన ఆ రికార్డరు, కెమెరాలు, వీడియోలలో మాటలు, రూపాలు ముద్ర అవుతాయి. కావలసినపుడు వీడియోని వి.సి.ఆర్.లో పెట్టుకొని చూస్తాం. మన టి.వి.లో అలాగే యిచట టి.వి. అనగా మన అంతఃకరణనే.

మన అంతఃకరణలో మనమే మనని చూచుకుంటున్నాం. ఎలా ఉంది మన కథ అని. అలా ఏదైతే వుందో, వీడియోగ్రాఫు వలె, మన నేత్రములు - యీ నేత్రాలకు అధిష్ఠానంగా వుండే మనసు యందు యివన్నీ ప్రింటు అయి వొక టేపుగా మారుచున్నాయి. మారిన తర్వాత మళ్ళీ చిత్తమనే వి.సి.ఆర్.లో దానిని పెట్టడం జరుగును. ఈ వి.సి.ఆర్.కు బుద్ధి ప్రకాశమివ్వగా, మళ్ళీ అంతఃకరణలో మనపనులంతా మనమే చూచుకొంటామన్నమాట. ఆ విధంగా మన అంతఃకరణ వుంటుంది. కాని యిచట వానియందు, పరిపూర్ణ స్థితి కలిగినవానియందు; వీడియో, వి.సి.ఆర్. ఆ పిమ్మట రూపాలు చిత్రింపబడవు, ప్రింటుకావు, మాటలు అంతకన్నా

ప్రింటు కావన్నమాట. కాన అటువంటి లక్షణములు వుండుటచే, మనము అతని నుండి ప్రక్కకు వెళ్ళిన వెంటనే యీ రూపాలు, మాటలు అన్నీ పోతవి, ఏమీ వుండవు. అలాంటి స్థితి వుండడం చేత ఎదురుగా వచ్చిన వాళ్ళ గురించే ఆలోచన గాని ప్రక్కకు తొలిగిన వాళ్ళ గురించి ఆలోచన యుండదు. అలాంటి స్థితి వీని అంతఃకరణ.

ఇపుడు యిలాంటి అంతఃకరణగలవాడు అన్నము తినడా? అన్నం తిన్నవాడు, చెంబు పట్టుకొనివెళ్లును. తర్వాత పెళ్ళి చేసుకొనును, పిల్లలను కనును, పోషించును. ఎలా పోషిస్తాడు అంటే, యిపుడు పోలీసు జవాను వున్నాడు. ఎవరినైనా తాను అరెస్టు చేయాలనే సంకల్పం వుండునా? పైనుంచి ఆర్డరు వస్తుంది. అరెస్టు చేయమంటే చేస్తాడు, వదిలిపెట్టమంటే వదిలిపెడ్తాడు. వాని స్వనిర్ణయము అచట వున్నదా అంటే – ఏమీ లేదు. మళ్ళీ ఏ నిర్ణయమున్నది? అధికారుల నిర్ణయము. మరి మన పరిపూర్ణునకు అధికారులు ఎవరు? గురుమూర్తి. ఈ గురుమూర్తి ఏమి చెప్పినాడు? "నీవు, నాకు నీవి అనుకున్నవన్నీ దానము యిచ్చివేయ"మన్నాడు. "సరే తీసికొనండి" అన్నాడు. అయిన తర్వాత, మళ్ళీ, ఎట్లా వున్నాడు వాడు? చిత్తరువు వలె వుండిపోయినాడు. "అరే! నాయనా! పనిపాటలు మళ్ళీ ఎప్పటి వలెనే చేసికో, నీవు నాకు దేనిని యిచ్చినావో, దానిని నీకు అరువుగా యిచ్చు చున్నాను" అని గురువు అన్నాడు.

మరి, అరువు సొత్తును, 'నాది' అని అనుకొని నడుచుకొంటాడా? కాదు. ఏ పనిచేసినా, ఏ వ్యవహారము చేసినా, అంతా గురునిదే, అనే నిర్ణయములో అతడు పని చేస్తూ పోతాడు.

ఇక్కడ వానికీ, వీనికీ తేడా యేమిటి? నరుడు అహమత్వముతో చేస్తాడు. గురుపుత్రుడు, అహమత్వము లేకుండగా, అంతా గురుపరమాత్మదే అనే భావము చేత, పనులు చేస్తూ పోతాడు. పనులు ఎపుడైతే చేస్తాడో, తనది కాదుగదా, తనది కాదనే లక్షణంతో చేయడం వలన, వాని అంతఃకరణలో యేమైనా గుర్తు నిలుచునా? ఏ విధమైన గుర్తూ నిలవదు. మళ్ళీ గుర్తు నిలుపుకొననటువంటివానిని ఏమనాలి – పురుషులలో వుత్తమమైన పురుషుడు 'పురుషోత్తముడు' అని వానిని అనవలసి వస్తుంది. అలా వున్న శరీరం ఎట్లా అంటే, వాని నడకవలన యీ స్థూల, సూక్ష్మ, కారణ, మహా కారణాలకు అతీతమైనటువంటి నడక వానిలో యేర్పడును. ఆ నడక ఏర్పడడము వలన, ఆ నడకతో కూడిన వొక ఆవరణ ఏర్పడును. ఆ

ఆవరణరూపమే "కైవల్య శరీరము" అని చెప్పడం జరిగింది.

కైవల్య శరీరము అంటే, ఏమిటి? మొదటి 4 శరీరములకు పంచ భూతములే ఆధారముగదా! ఇక్కడ పంచభూతములు కాదు, అంతఃకరణ, అనగా జ్ఞానములో విషయములు లేకపోవడం చేత "నిర్విషయ అంతఃకరణ" అన్నారు. ఇక మనసు స్పర్శతన్మాత్రతో ఏర్పడినది కదా! స్పర్శ తన్మాత్ర అనగా వాయుతత్వము లేక ప్రాణం. అనగా సమాన, వుదాన, ప్రాణ మొదలైనవి వున్నాయి గదా! ఇవి - ఈ 5తో కూడినది. వీనిలో విషయము లేదు కాన దీనిని - యీ మనసుని - "నిర్విషయ సమానాదులు" - అన్నారు. అంటే మనసు, మనసు క్రింద వున్న వాటినన్నిటినీ కూడ.

పిమ్మట, అగ్నితత్వంతో కూడిన బుద్ధిని చూచే చూపు అగ్ని తత్వమే - కాబట్టి దాన్ని యేమన్నారంటే "నిర్విషయ రూపాదులు" అని అన్నారు. కంటితో చూడాలంటే బుద్ధి యొక్క ప్రేరణలేనిదే, కన్ను యేమీ చూడలేదన్నమాట. కాబట్టి దాన్ని "నిర్విషయ రూపాదులు" అన్నారు.

తరువాత, జలతత్వం. దీనితో ఏర్పడిన అంతఃకరణము చిత్తము. ఆ చిత్తమును "నిర్విషయ రసాదులు" అన్నారు. అట్లనే పృధివీతత్వముతో కూడిన అహంకారమునకు "నిర్విషయ గంధాదులు" అని పేరు పెట్టినారు. అంటే యిపదు ఎట్లా అనుకోవాలి? నిర్విషయగంధాదులు అంటే "పృథివి" అనుకోవాలి. "నిర్విషయ రసాదులు" అంటే "జలము" అనుకోవాలి. "నిర్విషయ రూపాదులు" అంటే "అగ్ని" అనుకోవాలి. "నిర్విషయ సమానాదులు" అంటే "వాయువు" అనుకోవలె. "నిర్విషయ అంతఃకరణ" అంటే, "ఆకాశము" అనుకోవాలి.

ఈ బోధ అంతా దేనిపైన జరుగుచున్నదనగా, మనలో వున్న జ్ఞానము, మనసు, బుద్ధి, చిత్తము, అహంకారము - విషయరహితంగా వుండి, ఆ విషయ రహితంగా వుంటే మనలో ఏయే మార్పులు ఎలా చెందుతున్నది? ఏ యింద్రియము, యే రూపము పొందుతున్నదీ అన్నది, దీనివలన, మనము తెలిసికొనగలుగుతాము. ఇదీ అసలు సంగతి. ఇపుడు నిర్విషయ అంతఃకరణయున్నది. ఇది దేనికి సంబంధించినది? ఆకాశమునకు సంబంధించినది. ఆకాశము యందు 2 లక్షణాలు వున్నాయి. బయలుగా యుండడము దాని ధర్మము, అవకాశము ఇవ్వడము దానియొక్క కర్మము. అయితే, వీని అంతఃకరణ ఎలా యుండును? "మహాకాశము" లేక "పరాకాశ" రూపకంగా యుంటుంది. "మహా" లేక "పరాకాశము" అని

దేనికి చెప్పినారు? అంటే ఏ బ్రహ్మతత్వమైతే యున్నదో, ఆ తత్వాన్ని వేదాంతములో 2 రకములుగా చెప్పడం జరిగింది.

ఘటాకాశము, మఠాకాశము, మహాకాశము అన్నారు. పంచాకాశములని ఐదు వున్నాయి కాని, వేదాంతములో మనకు యీ 3 విధముల ఆకాశములని ప్రబోధ చేస్తారు. ఘటము = కుండ; కుండలో యేమీ లేనపుడు ఏముండును? వుత్తది, ఏమీ వుండదు. అయితే ఆకాశానికి – "ఆకాశం శూన్యంబని లోకులు మొరపెట్టినారు" అలాగే శ్రుతి ఏమంది? "ఆకాశం గగనం శూన్యం" అని చెప్పింది. కాన శూన్యస్థితి కలిగినది ఆకాశము అని దీని అర్థము కదా!

ఆకాశము శూన్యస్థితి కలిగి యున్నది. కుండలో శూన్యమే. మళ్ళీ మఠము అంటే యిల్లు. ఇల్లు వుంది కాన కుండదీసికొని వచ్చి పెట్టినాము. ఇల్లు లేకపోతే? కుండలేదు. అంటే మనం వచ్చినాము కాన మనం వున్నాం. మనం లేకపోతే, లేక పూర్వము వుత్తదే కదా అది. మనం నివసించిన తర్వాత ఆ ఇల్లు జనావాసమైనది. మనం నివసించక పూర్వం అది వుత్తదే కదా! అయితే ఇది కుండ, యిది యిల్లు అని పేరు ఎందుకు వచ్చిందంటే, కుండపై పెంకు ఉండడం చేత యిది ఘటమూ అని పేరు వచ్చింది. నాలుగు గోడలు చుట్టూరా వుండడం వలన దీనికి యిల్లు లేక మఠము అన్నారు. ఇప్పుడు కుండను పగుల గొట్టుదాము. ఘటాకాశము అనిపేరు వుండునా? ఘటమే లేనప్పుడు, ఈ ఘటాకాశము ఎచ్చట వుంటుంది? నాలుగు గోడలు పగుల గొట్టినాము. ఇక యిల్లు వుంటుందా? ఇల్లు అనే పేరుండదు. మరి ఏమి ఉంటుంది. ఆకాశము లేని పేరు మాత్రమే వుంటుంది. ఘటము వున్నపుడు ఘటములో ఆకాశము వుంది. ఇల్లు వున్నపుడు యింటిలో ఆకాశము వున్నది. మరి దానిని కూలద్రోసినపుడు ఘటాకాశం అనేపేరు పోయింది, మఠాకాశము అనేపేరు పోయింది. మరి వున్న ఆకాశము వున్నట్లే వున్నది కదా! దాన్నే "మహాకాశము" అని అన్నారు. మహాకాశమే లేక "పరాకాశము" అని పేరు పెట్టేరు.

అంటే ఆ మహాకాశమే ఆత్మ, బయలు, లేక బ్రహ్మమని చెప్పినారు కదా! ఇంకో రీతిగా ఎలా చెప్పినారంటే చైతన్యాన్ని గూర్చి చెప్పినారు. ఎలాగన, దీపప్రకాశం, దివిటీ ప్రకాశము, సూర్య ప్రకాశము అని చెప్పినారు.

దీపమును చీకటిని పారద్రోలుటకు యింటిలో పెట్టుకున్నాము. ఆ తరువాత బయటకు వెళ్ళునపుడు, చీకటిని పారద్రోలుటకు, దివిటీని పట్టుకొని వెళ్తాము. ఇపుడు టార్చిలైట్లని పట్టుకొని వెళ్తాము. పూర్వం దివిటీలను గాని కాగడాలను

కాని వాడేవారు. కాగడాలు బాగా వెలిగి ఎక్కువ కాంతినిచ్చేవి. అప్పుడప్పుడు టి.వీలల్లో ఆటలపోటీలు జరిగేముందు చూపిస్తారు కదా ఈ కాగడాలను. క్రీడాకారులు ఒకరి చేతిలో నుండి యింకొకరు కాగడాను అందుకొని ముందరకు పరుగెత్తుతారు కదా! ఈ దివిటీ దగ్గరకు, మనం యింటిలోని దీపాన్ని తీసికొనిపోతే, మరి దీప ప్రకాశం కనిపిస్తుందా లేక దివిటీ ప్రకాశం కనిపిస్తుందా? దివిటీ ప్రకాశమే కనిపిస్తుంది కదా! అంటే దీపప్రకాశము పోయి దివిటీ ప్రకాశములో ఐక్యమై పోయినది. మళ్ళీ యీ దివిటీని సూర్యుని వద్దకు తీసికొనిపోయే వరకూ, ఆ సూర్యప్రకాశము కనుపడునా లేక దివిటీప్రకాశం కనుపడునా? సూర్య ప్రకాశమే కనుపడును కదా! అంటే దివిటీ ప్రకాశం, సూర్యప్రకాశంలో కలిసిపోయింది. దీని అర్థమేమన, పిండాండం అనేది, ఘటాకాశం, బ్రహ్మాండమనేది మఠాకాశం. ఇవి రెండూ ఎక్కడికి కలిసిపోతున్నాయి, మహాకాశంలో కలిసిపోతున్నాయి. అంటే ఆ బ్రహ్మలో ఐక్యం అయిపోతున్నాయి.

దీప ప్రకాశమనేది జీవ ప్రకాశము. దివిటీ ప్రకాశము యీశ్వర ప్రకాశము. దీపనేది జీవ చైతన్యము, మళ్ళీ దివిటీలనేది యీశ్వర చైతన్యము. సూర్యుడు అనేది శుద్ధ చైతన్యము, అంటే జీవచైతన్యము, యీశ్వరచైతన్యము లో ఐక్యమయితే, యీ యీశ్వర చైతన్యము వెళ్ళి శుద్ధ చైతన్యములో ఐక్యమవుతుంది అని దీని అర్థము. అన్నపుడు ఏ చైతన్యం మిగిలి ఉంటుంది. ఒకే చైతన్యం. ఘటంపోతుంది, మఠం పోతుంది, మహాకాశం మిగిలినట్లుగా, ఆఖరికి ఒకే చైతన్యం శుద్ధ చైతన్యమే మిగిలి ఉండును.

వీని యొక్క వ్యవహారం యెట్లుండును? ఇవన్నీ మహాకాశ స్వరూపమైనవి. ఇవన్నీ మనలో ఏర్పడుతున్నాయి. మహాకాశములో ఏ లక్షణాలు వున్నాయి అంటే ఏ లక్షణాలూ వుండవు. శుద్ధ చైతన్యములో ఎలా ఉంటుందో, అలా ఉంటుంది. కాబట్టి, వీనియొక్క వ్యవహారము, ఆవరణ ఎలా వుంటవి అంటే, దేనిచేత ఆవరింపబడి యుండలేదు. కుండచేతగాని, గృహము (మఠం) చేతగాని ఆవరింప బడకుండగ, కేవలము తాను, తానుగా వుండేటటువంటి మహాకాశస్వరూపకముగా వుంటున్నాడు.

మరివానియొక్క చైతన్యం ఎలా వుండుననగా పురుషోత్తమ స్వరూపుడు. అనగా కేవలం శుద్ధచైతన్యస్వరూపుడు అని అర్థము. కాన అంతఃకరణ ఎలా వుంటుందంటే, మహాకాశము యెట్లావుంటుందో అలా వుంటుంది. నిర్విషయ అంతఃకరణ.

నిర్విషయ అంతఃకరణ ఎట్లా వుంటుంది? తనయందు తానే వుంటుంది. దీన్ని పరాకాశము లేక మహాకాశము అని అనవలసి వస్తుంది. ఇక్కడ ఏ విధమైన గుర్తులు వుండవు. తాను దేనికీ ఆధారము కాదూ అన్నమాట. తరువాత దీనికి నిర్విషయసమానాదులు వచ్చి చేరడమువలన, యిది దహరాకాశముగా మారింది.

దహరాకాశము అనగా మనస్సునకే "దహర" అనిపేరు. అంటే యీ మనసు, ఆకాశము ఎట్లా నిర్మలంగా వుంటుందో, అలాగే యీ మనసుకూడా వుంటుంది. అందువలన దీనిని దహరాకాశము అన్నారు. ఈ ఆకాశమునకు అగ్ని తత్వమగు, నిర్విషయరూపాదులు చేరడం వలన, ఏమగుననగా "నిరవయాకాశము" – నిర్+అవయవ ఆకాశము. దీంట్లో అవయవాలు యేవీ వుండవు. అవయవాలు లేకుంటే శరీరము కూడా వుండదు. దీనికి అర్థమేమనగా, మనము చెప్పుకునే నవవిధ ద్రవ్యములలో సూర్యాకాశము అని చెప్పుకున్నాం, యింకొక ఆకాశమున్నది – దానిపేరే నిరవయాకాశము, అనగా అది బుద్ధికి, దిక్కులకు సంబంధించినది. దిక్కులకు, రూపము మొదలైనవి లేవన్నమాట. కాని మనం, మన యొక్క నిర్ణయానుసారము, ఆ దిక్కులను, నిర్ణయించుకుంటాము. అక్కడ దిక్కు వుందో, లేదో తెలియదు కాని, ఏమంటున్నాం "నపూర్వే" – తూర్పునకు శనివారం వెళ్ళవద్దు, నగురౌ దక్షిణే తథా – దక్షిణానికు గురువారం వెళ్ళవద్దు. తర్వాత 'నభృగౌ, రవౌ పశ్చిమేచ' అనగా శుక్రవారం కాని, ఆదివారం కాని పడమరకు వెళ్ళవద్దు అన్నారు. మళ్ళీ ఉత్తరానికి నచోత్తరం బుధ, మంగళం – అంటే బుధ, మంగళవారంలలో ఉత్తరమునకు వెళ్ళవద్దు అన్నాడు. వెళ్ళితే నీకు పోయిన పనికాదు, నీవు అనారోగ్యంగా వెళ్ళితే ఆరోగ్యం కాదు, ఆ అనారోగ్యం యింకా చెడిపోవచ్చు లేకపోతే నలుగురు మోసుకొని పోయే రథయాత్రకు వెళ్ళినా వెళ్ళవచ్చు అని చెప్తారన్నమాట.

మరి ఎట్లానయ్యా! అంటే, నీవు పోవాలనుకున్నావా ఎలాగైనా? సరే పో తూర్పు పోవాలనా, అంగారపూర్వే గమనంచ లాభం – తూర్పునకు మంగళవారం పో, నీకు లాభం కలుగును. సోమే, శనే, దక్షిణా అర్థలాభం – సోమ, శనివారాలలో దక్షిణానకు పో, నీకు వ్యాపారంలో డబ్బు బాగానే సంపాదిస్తావు, 'బుధౌ, గురౌ, పశ్చిమ' – బుధవారం, గురువారం పశ్చిమానకు వెళ్తే నీకు లాభం కలుగుతుంది. ఈ నిర్ణయాలు దిక్కులను బట్టి చెప్తారు. అసలు దిక్కులకు ఏమైనా రూపముందా, ఎంతవఱకు దానికి హద్దు?

ఈ హద్దులన్నీ ఎవరికి? నేను వున్నాను అనుకొనేవారికి, యీ దిక్కులు, హద్దులు అన్నీను. నేనే లేను అనుకున్నవానికి హద్దులే లేవు, దిక్కులూ లేవు. కాన ఈ ఆకాశం నిరవయమైంది, కాన దీన్ని నిరవయవ ఆకాశం అని చెప్పడం జరిగింది.

తరువాత రసాదులు. జలతత్వమున్నచోట, సూర్యతత్వము వుండును. ఆ సూర్యుని నుండే మనకు ప్రాణవాయువు, వెలుతురు లభిస్తున్నాయి. వృక్షాలలో ప్రాణవాయువు బాగా వుంటుంది. మళ్ళీ వృక్షాల పెంపొందడానికి, ఆ సూర్యరశ్మే కారణం. సూర్యుని వైపుకే చెట్టు పెరుగును. సూర్యుడు లేని నీడలో పెరగమంటే పెరగదు. చెట్టు, మళ్ళీ సూర్యుడు వున్నవైపు తాను వంగి, కప్పు గిప్పు అడ్డుగా వుంటే వంగి అవతల వైపుకు ప్రాకి పెరుగును. దానికి తెలివి లేదనుకుంటున్నాం. తెలివిలేదు కాని, సూర్యరశ్మిని ఎలా తెలిసికుంటుందో, యేమో! తెలిసికొని, అలా పోతుంది. మరి దీన్ని 'జడము' అన్నారు. జడము అందామా అంటే మట్లాడదు కాని, తన పనిని తాను చేకుంటుందా, లేదా? లేదా అంటే, తెలివి దాని యందు వున్నది కాని దాగి ఉన్నది. మనకు తెలియదు కాన దాన్ని 'ఉపహిత చేతనము' అని పెద్దలు అన్నారు. ఈ సూర్యునికి మూలమైనది జలము. ప్రాణ స్వరూపము సర్వజీవులకూ సూర్యుడు. కాన నిర్విషయ రసాదులవలన సూర్యాకాశము ఏర్పడినదని చెప్పినారు.

అంతఃకరణమునకు నిర్విషయరసాదులు కలియుట వలన సూర్యాకాశము ఏర్పడినదని చెప్పడం జరిగినది.

అలాగే నిర్విషయ అంతఃకరణముకే, నిర్విషయ గంధాదులు చేరడం వలన అది భూతాకాశముగా యేర్పడినదని చెప్పినారు. భూతాకాశం అనగా మనము యిపుడు యే ఆవరణలో ఐతే వున్నామో దానినే భూతాకాశము అన్నారు.

ఇపుడు నిర్విషయసమానాదుల గూర్చి తెలిసికుంటాము. అంటే వాయు తత్వమునకు వస్తున్నాము. వాయుతత్వం వలన వ్యానము యేర్పడినదని చెప్పుకున్నాం. అంటే వాడు పరిపూర్ణ బోధ వింటూ, వింటూ, ఆ పరిపూర్ణము వలె నేను వుండాలి అని ప్రయత్నము చేయడము వల్ల ఆ ప్రయత్నములో, యీ జ్ఞానము మహాకాశముగా, మనస్సు దహరాకాశముగా, బుద్ధియేమో నిరవయాకాశముగా, చిత్తమే సూర్యాకాశముగా, అహంకారమేమో భూతాకాశముగా మార్పు చెందినది.

నిర్విషయ సమానాదులు అంటే సమాన, వ్యాన, ఉదాన, ప్రాణ, అపానములు, షడూర్ములు అనగా మనసునకు సంబంధించినవి. సుఖము, దుః

ఖము, ప్రాణానికి సంబంధించినవి. ఆకలి, దప్పిక. శరీరానికి సంబంధించినవి జననము, మరణము (లేక హాని చెందడం, వృద్ధి చెందడం). ఇలా 3×2 = 6 (షట్) వూర్ములు మనలో వున్నవి. అంటే 6 లక్షణాలు మనయందు వున్నవి.

ఆకలి, దప్పులు ప్రాణమునకు సంబంధించినవి. ప్రాణము 5 రకాలుగా నున్నది. ఆ 5 రూపాలు - సమానము, వ్యానము, వుదానం, ప్రాణం, అపానం - యీ 5 రూపాలు దాల్చినది వాయుతత్వం. ఇక్కడ ప్రాణపంచకమును నిర్విషయ సమానాదులు అన్నారు. అంటే సమానము మొదలుకొని మిగిలినవి. అయితే వీటిలో విషయాలు దాగుకొని వుంటాయి. ప్రాణపంచకములో ఇక్కడ దీనియందు, విషయములు లేకపోవుటచే, నిర్విషయ సమానాదులు అని చెప్పడం జరిగింది. అయితే యిది తన స్వస్థానములో తాను తానుగా, తాను వుండినపుడు వీనికి "సమరసతత్వం" అబ్బింది.

ఇది నిర్విషయ అంతఃకరణతో చేరడం వలన దీనికి "ఆత్మారామత్వం" అబ్బింది. అలాగే యిది (సమరసతత్వం), నిర్విషయ రూపాదులతో చేరినపుడు "చిదీశ్వరభావ అఖిల లీనత్వం" దీనికి యేర్పడినది (అబ్బింది). ఇది నిర్విషయ రసాదులతో కూడగా "సత్యం, జ్ఞానం, అనంత పరత్వం" దీనికి అబ్బింది. ఇది నిర్విషయ గంధాదులతో చేరినపుడు "అంతర్ బాహ్య స్ఫూర్తి రహితత్వం" అబ్బింది. ఇది ఏమిటి అనే చర్చ తరువాత చేద్దాం. ఇపుడు వూరికే, ఏమనుకోవాలి అంటే "సమానం" అంటే ఆత్మారామత్వమనీ, "వ్యానం" అంటే "సమరసత్వ తత్వ"మనీ, "వుదాన" మంటే "చిదీశ్వర భావ అఖిల లీనత్వమనీ", "ప్రాణము" అంటే "సత్యం, జ్ఞానం, అనంత పరత్వ"మనీ, "అపాన" మంటే "అంతర్ బాహ్య స్ఫూర్తి రహితత్వం" అనీ తెలిసికోవాలి మనం.

ఇప్పుడు మనం "అగ్ని" తత్వం లేక రూపతన్మాత్రలోకి ప్రవేశిస్తున్నాం. రూపం యిచ్చేది కాబట్టి, తన దగ్గిర తాను వుండి తాను వెలుగుతోంది. దీనికి "జ్యోతిర్మయతత్వం" అన్నారు. అంటే ప్రకాశిస్తున్నది అని అర్థము. ఇది నిర్విషయరూపాదుల వలన ఏర్పడినట్టిది. అయితే, దీనికి నిర్విషయ అంతఃకరణ ఎప్పుడైతే చేరునో అపుడు అది "స్వయంజ్యోతిత్వంగా మారుతుంది. దీనికి నిర్విషయ సమానాదులు వచ్చిచేరునపుడు అది "పరంజ్యోతత్వం" దీనికి అబ్బుతుంది. ఈ జ్యోతిర్మయతత్వమునకు, నిర్విషయ రసాదులు చేరినపుడు, ఇది "అపోజ్యోతిత్వము" గా మారిపోతుంది. దీనికే నిర్విషయ రసాదులు చేరినపుడు, దీనికి "జగజ్యోతిత్వం"

ఏర్పడుతుంది. అంటే స్వయం జ్యోతిత్వం అంటే శ్రోత్రింద్రియము అనుకోవాలి. పరంజ్యోతిత్వం అంటే త్వక్ అనుకోవాలి. జ్యోతిర్మయత్వం అంటే చక్షువు అనుకోవాలి. ఆపోజ్యోతిత్వం అంటే జిహ్వ అనీ, జగత్ జ్యోతిత్వం అంటే ఘ్రాణము అని అనుకోవాలి. అంటే యీ ఘ్రాణము మొదలైనవి, యీ విధంగా మార్పు చెందినవని తెలిసికోవాలి.

ఇపుడు నిర్విషయ రసాదులు. రసతన్మాత్రవలన యేమి ఏర్పడినది? శబ్దేంద్రియము, స్పర్శ, రూప, రస, గంధేంద్రియములు ఏర్పడినవిగదా? దాంట్లో అవి లేవు. నీరసమై పోయినది. రసం లేక పోవడం చేత దానిని "నిర్విషయ రసాదులు" అన్నారు. ఈ నిర్విషయ రసాదులున్నాయి కదా! ఇవి తనస్వస్థానములో తాముండుటవలన, రసస్థానములో తాను వుండుటవలన వీనికి "అమృతత్వం" అబ్బును.

ఈ అమృతత్వమునకు, నిర్విషయ అంతఃకరణచేరడం వలన "పరామృతత్వం" దీనికి అబ్బును.

అంటే యీ అమృతత్వానికి, నిర్విషయసమానాదులు చేరడం వలన అనామృత చైతన్యత్వం అబ్బును. అలాగే యీ అమృతత్వానికి నిర్విషయ రూపాదులు చేరడం వలన తత్వామృతత్వం అబ్బును. అట్లే యీ అమృతత్వానికి నిర్విషయ గంధాదులు చేరడం వలన బోధామృతం అబ్బుతుంది.

ఇపుడు పరామృతత్వం అనగా శబ్దేంద్రియము, అనామృత చైతన్యత్వం అనగా స్పర్శయింద్రియము, తత్వామృతత్వం అనగా రూపేంద్రియము. అమృతత్వం అనగా రసేంద్రియము. బోధామృతత్వం అనగా గంధేద్రియము, అని అనుకోవాలి.

అట్లానే యిపుడు నిర్విషయ గంధాదులు. అవి తమ స్వస్థానంలో వుండడమువలన ఆ ద్వయత్వం దీనికి అబ్బును. దీనికి నిర్విషయ అంతఃకరణ చేరడంవలన భేదాభేదాతీత్వము అబ్బును. దీనికి నిర్విషయ సమానాదులు చేరడం వలన అభేదాభేదత్వము అబ్బును. దీనికే నిర్విషయ రూపాదులు చేరడం వలన భేదాభేదత్వము అబ్బును. పిమ్మట దీనికే నిర్విషయరసాదులు చేరడం వలన అఖండత్వం అబ్బును. అంటే భేదాభేదాతీతత్వం వాక్కునకు పేరిక్కడ. మనవాక్కే భేదాభేదాతీతత్వంగా మారిపోవును. మనపాణి అభేదాభేదత్వంగా మార్పు చెందును. మనపాదము భేదాభేదత్వంగా మార్పు చెందును. మన గుహ్యాము అఖండత్వంగా రూపొందును.

తరువాత, మన గుదము అద్వయత్వంగా మార్పు చెందునని తెలిసికోవలె. అవే యింద్రియాలు కాని, అవి పై విధముగా మార్పు చెందుతాయి అని మనం అర్థం చేసుకోవాలి. ఈ కైవల్య దేహం అనేది ఎలా ఏర్పడుతుంది అనగా... ఎరుకైన భూతపంచకము ఎరుకకు చరణములు, కటియు, హృదయము, గళమున్, శిరమున్ నయ్యెను క్రమమున ధరణి మొదలుజేసి యిట్లు తనయా గుర్తెరుగు" అని చెప్పడం జరిగింది. భాగవత కృష్ణ గురువర్యులు కందార్థదర్పులలో ఈ కైవల్య దేహానికి పృథ్వి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము - పృథ్వి యేమో పాదము, జలము కటి ప్రదేశము, అగ్నియేమో హృదయము, వాయువేమో కంఠము, ఆకాశమేమో శిరస్సు - ఈ ఐదు తత్వాలతో యేర్పడినది కైవల్య దేహము. ఈ కైవల్య దేహ "లీల సూచనలు" అంటే లీల సూచనలు మనం స్థూల రూపకంగా తెలిసికొనేది కాదు.

పరిపూర్ణము యందు కనపడి, కనపడకపోయే లక్షణముల మనకు అప్పుడప్పుడు తోస్తుంది కదా! దాన్నే ఏమన్నారంటే "దేవమార్గము లోన ఎన్నో వింతలు కనపడి, కనపడకపోతాయని నొక కందార్థమునందున్నది. "రాకడ పోకడ లేకను, ఏక స్థితి కల్గినట్టి, యీ బయలందున్, రాకడ, పోకడ కలిగి, అనేకముగా దోచు, లేని ఎరుక సుశీలా, ప్రతిమలో, లేని పెరుమాళ్ళ లీల, లేకతోచినా ఎరుకా, లేనేలేదనుచు నీ కీకీలు గురునిచే ఎరిగితే చాలు వుళ్ళక్కి, ఎరుకా... సుశీలా" అని చెప్పడం జరిగింది.

ఇంకొక దాంట్లో "ఎంతానీ, దెలుపుడు, యూ దేవ మార్గాన..." కైవల్య దేహాన్నే గుణములు లేనటువంటిది, విషయములు లేనటువంటిది కావడం వలన దీనిని కైవల్య దేహము, అద్వితీయమునందు యిది కనపడుతుంది, యిది అనుభవనీయము అన్నారు. అద్వితీయము అనగా 2వది లేనటువంటిది. 2వది అనగా "ఎరుక" లేనటువంటిది అని, ఎరుక లేనిది "పరిపూర్ణము". పరిపూర్ణయందు లీల సూచనలుగా దీనిని తెలిసికోవాలి అన్నారు. లీల అంటే కనపడేటి వంటి వుపాధి కాదు.

కృష్ణలీలలు అన్నారు. కృష్ణుడు చూపించిన దంతా నొక తమాషా. తమాషా వస్తువుగా, తమాషా కలిగిన నొక వుపాధిగా మనము తెలిసికోవాలి. దానియందు కనీ కనపడక ఆ లక్షణాలు కలిగిన నొక వుపాధి వుంది అని అనుకోవడమే కాని నిజానికి ఆ ఉపాధి లేని వుపాధి కావడంచేత లేని వుపాధి దానియందు వున్నట్లు మనం వూరికే వూహించుకోవాలి. కాని నిజానికి అది లేదు. లీల సూచన అంటే

అది లేదని తెలిసికోవడమే "లీల సూచన". అందుకనే ఏమన్నారంటే భాగవత కృష్ణ దేశికులు... "సంతోషా సంతోషములంతలో గనవచ్చి పిదప। నరుగునెచటికో। వింతైయున్నది చూచితె । యింతియెసుమియెరుక పుట్టు । విక తెలుస్సుకోరా । సంశయమేలా యిది నమ్ముకోరా। యెంతాని దెల్పుదు । యీ దేవ మార్గమందంతాట। బహు వన్నెలగుపడి, యగుపడవిక దెల్పుకోరా । సంశయమేలా యిది నమ్ముకోరా..." అన్నారు.

మన నిత్య జీవితములో సంతోషాన్ని అనుభవిస్తాము, దుఃఖాన్ని కూడా అనుభవిస్తాము. మనకు సంతానం కలిగినపుడు సంతోషిస్తాము. ఆ పిల్లవాడు బుద్ధిమంతుడైతే మరీ సంతోషిస్తాం. ఒకవేళ లఫంగి అయినట్లయితే, ఎక్కడ లేని కొట్లాటలు వాడు యింటి ముందుకు తీసికొని వస్తున్నట్లయితే, ఏమి సంతోషం? ఎక్కడనుంచి పుట్టాడు వీడు, పాడైపోనూ అని అంటామా? అనమా? అంటే వీడు పుట్టినపుడు సంతోషిస్తిమి, తరువాత వాని చేష్టలు సరిగాలేకపోతే దుఃఖిస్తామా, దుఃఖించమా? దుఃఖిస్తామన్నమాట – కాబట్టి దీనికి యింతకాలము సంతోషము, యింతకాలము దుఃఖము అని చెప్పడానికి వీలులేదు. అప్పుడే సంతోషము వస్తుంది, అపుడే దుఃఖమూ వుంది.

ఒకాయన మా దగ్గరికి వచ్చి నవ్వుకుంటూ పోయినాడు. కొంతదూరం పోయిన తర్వాత కాలికి పెద్దరాయి తగిలి దబ్బున క్రిందపడి చనిపోయినాడు. ఇపుడు సంతోషమా, దుఃఖమా? వానిని ఆశ్రయించిన వారికి దుఃఖము వచ్చేసింది కదా! కాబట్టి యింత టైము సుఖము వుండును, యింత టైము దుఃఖము వుండును అని మనము నిర్ణయము చేయలేము. ఇవన్నీ అపుడే వస్తవి, అపుడే వెళ్ళిపోతవి.

"పిదప అరుగు ఎచటికో, వింతైయున్నది చూచితే". వీటిని కండ్లతో చూస్తే లేక మానసికంగా దీనిని గురించి తెలిసికొంటే మనకొక వింతనా, కాదా? ఎంత అంటే, ఒక ఆశ్చర్యకరమైన సంగతి. అయితే "యింతియె సుమి ఎరుక యొక్క పుట్టువు, ఇక తెల్పుకోరా" అన్నారు. దీనికి సంశయము వద్దు, నా మాట కచ్చితము, నిజము అన్నారు, అనుమానం లేక. "ఎంతాని దెల్పుదు... నమ్ముకోరా అన్నారు. ఈ దేవ మార్గమందు, బహు వన్నెలు అగుపడి, అగుపడకుండ పోతవి అన్నారు.

దేవమార్గమని దేనిని అన్నారు? పరిపూర్ణ మార్గమునందు మనం చరిస్తూ యుంటే – పరిపూర్ణమునకు వొక మార్గము లేదు. దానియందు మనజీవితము,

ఎట్లాయున్నది? కైవల్య శరీర ధారణత్వముతో మనము, నడుచుకొను చున్నాము. అలా నడుచుకుంటే వింతలూ, విశేషాలు, బహు వన్నెలూ అగుపడతాయి, అగుపడ కుండగపోతాయి.

ఏవీ అంతఃకరణము యందు నిలబడడము లేదు. ఎందుకు? నిర్విషయ అంతఃకరణ కావడం వలన, ఏవీ నీయందు నిలబడడం లేదు కావున అంతట బహువన్నెలు అగుపడతవి, అగుపడకుండపోతవి. కాబట్టి అగుపడిన దానిపైన శాశ్వతబుద్ధి, అగుపడని దానియందు అశాశ్వత బుద్ధి, పెట్టుకోవలెనా? లేదు. సత్యాసత్యములనే నిర్ణయాలు దేనియందూ నిలుపుకొనరాదు.

వస్తువు యొక్క నిజతత్వముపైన మనము నిలుపుకొనాలి. బెల్లము తింటూ ఉంటే తియ్యగా వుంది, లేకపోతే భక్ష్యాలు (బొబ్బట్లు) – ఇవి తింటుంటే ఆనందము కలిగింది. ఇంకొంచెం తింటాం. ఈ వస్తువు యిలా వుంది, దీంట్లో తీపిగుణం వున్నది, తింటూంటే ఆనందం కలుగుతుంది. అని రాసుకున్నాం. ఆ తరువాత జీర్ణమై పోతుంది. జీర్ణమయ్యేటప్పుడు పొట్ట ఉబ్బును. నాలుక తడి ఆరును. దాహం ఎక్కువకాగా, నీళ్ళు అధికంగా త్రాగుతాము. త్రాగితే దాహం తీరినట్లు అనిపించినా, కొంచెం సేపట్లో మళ్ళీ దాహం. నీరు త్రాగుతాం. పొట్ట బరువు అని అనిపిస్తుంది. ఆయాసం కలుగుతుంది. ఆయాసం వస్తే యిప్పుడు ఆనందమా? దుఃఖమా? దుఃఖమే కదా! దానియందే ఆనందం, దానియందే దుఃఖము. కేవలం ఆనందమే మాత్రం దేనియందూ లేదు. అలానే అది కేవలం దుఃఖ స్వరూపమూ కాదు. అలానే యే వస్తువైనా యిది కేవలం ఆనందస్వరూపమనిగాని, కేవలం దుఃఖస్వరూపం అని అనడానికి యేమైనా వున్నదా? కాబట్టి "నిర్ణయోనాస్తి సర్వదా". ఎప్పటికీ, ఏ వస్తువును గూర్చి నిర్ణయం చేసికోరాదు.

వస్తువు యొక్క స్వరూపము తెలిసికొని, దాని లక్షణాన్ని, యిది యిట్లాంటిది గదా యని, ఆద్యంతములు దాన్ని పరిశీలన చేసి అది సత్యమా, అసత్యమా అనే మాట కాకుండగా స్వరూపాన్ని తెలుసుకొని, యిది తిన్నపుడేమో తియ్యగా వుంది ఆనందాన్ని కలిగిస్తుంది, తర్వాత జీర్ణమగునపుడు దుఃఖాన్ని కలిగిస్తుంది. కాబట్టి యిది సుఖమయము అనరాదు, దుఃఖమయము అనరాదు. ఎంత అవసరమో, అంతవరకూ వాడుకొనవలె, తరువాత విడువవలె. దానిపైన వ్యామోహం వదిలిపెట్టవలె. అంతేకాని దానిపైననే వ్యామోహముగాని, ప్రేమగాని మొదలైనవి పెంచుకొనరాదు.

తల్లిపైన పిల్లగాని, పిల్లపైన తల్లిగాని వ్యామోహం పెంచుకోరాదు. పెంచుకొంటే దుఃఖపడవలసి వస్తుంది. ఎంత వుండాలనో, అంతే ఉండాలి. ఎవరిపైన గాని, భార్యపైన భర్తకుగాని, భర్తపైన భార్యకుగాని, వొక ధర్మ పద్ధతిగా నడుచుకోవాలి. ఇక్కడ ధర్మాన్ని ముందరపెట్టి నడుచుకోవాలి గాని, సత్యమని గాని, అసత్యమని గాని, శాశ్వతమనిగాని, లేక సంతోషకరము, దుఃఖకరము అని గాని భావాలను వదిలిపెట్టుకోవాలి. కాబట్టి లీల సూచనగా పరిపూర్ణము యందు, ఎవరికి తెలుస్తుందీ అంటే, దానియొక్క అనుభూతి పొందిన వారికి తెలస్తుంది కాని యితరులకు యిది తెలియదు. ఇది అద్వితీయము నందు, దీని లీల సూచన ప్రాయముగా చూడనగును. మరి చేసేటువంటి పని ఎలా వున్నదంటే, వీడు జగత్తులో, మనం చేసే పనులన్నీ కూడా – పిల్లలు ఆటలాడుతారు గదా, తాటాకులతో గాని దేనితో గాని, గుజ్జనగూళ్ళు పెట్టుకుంటారు. ఇల్లు అంటారు. సంసారంలో వున్న ట్లు చిన్న చిన్న రాళ్ళు తెచ్చి దాంట్లో పెట్టి, అమ్మా, నాన్న, ఆలు, మగలు అని ఆటలు ఆడుతారు. మరలా ఎవరైనా వచ్చి కాళ్ళతో గుజ్జనగూళ్ళను తన్నితే వాళ్ళతో కొట్లాడుతాం కూడా.

ఆడినంతసేపు యిలాగే. ఇంటికెళ్ళునపుడు యిలా వుంచి రేపు వచ్చి ఆడుకుందాం మళ్ళీ అంటారా? లేదు దాన్ని నెట్టివేసి వెళ్ళిపోతారు. అంటే ఆటాడుకొన్నంతవరకే ఆ యిల్లు, సంసారం వగైరా. ఆట ముగిసింది. ఇల్లుపోయింది, దానితోపాటు అన్నీ ఏమనుకున్నామో, అవల్లా పోయినాయి, ఉన్నవా? లేవు. అలా వాడుచేసే సంసారం కూడా అంతే. పిల్లలు వాళ్ళు తయారు చేసిన గుజ్జనగూళ్ళ యిల్లు, సంసారం పైన మమకారం పెంచుకొనిపోతారా? ఏమీ లేదు కదా! అలాగే మనమూ అవసరం వచ్చినపుడు, దీన్ని, యీ లోకాన్ని వదిలిపెట్టి వెళ్ళవలసి వచ్చినా, దేని భ్రాంతి మనం వుంచుకోకుండగా, ఆ పిల్లలు ఏ విధంగా, దాన్ని కాలితో నెట్టి, తరువాత తాము వెళ్లవలసిన చోటుకి ఎలా వెళ్ళిపోయినారో, అలాగ యీ పరిపూర్ణ భావజ్ఞుడైనటువంటి వాడు, కైవల్య శరీరధారణం కలిగియున్నవాడు, ఎవడైతే వున్నాడో వాడు ఆ లక్షణంతో మెలుగుతాడు అని మనము లీల సూచనగా తెలిసికొనవలెనని దీని తాత్పర్యము.

***

కైవల్యరీరము అనేది ప్రత్యేకముగా లేదు. కాని యీ శరీరముయందు వున్నట్టి యింద్రియాలు, ఏమైపోతున్నవంటే, ఆ లక్షణములు యిదివరలోపైన

చెప్పుకున్నాము. జ్ఞానం మహాకాశం లేక పరాకాశంగా అయినదని చెప్పుకున్నాం. తర్వాత కరేంద్రియాలలో వాక్కు భేదాభేదాతీతత్వంగా మారిపోయినదని చెప్పు కున్నాము. అంటే యిదివరకు చేసే పనులు, స్థూల శరీరంతో చేయడం జరిగింది. అజ్ఞానరూపమైన ప్రవృత్తితో యిదివరకు పనులు చేసికొనడం జరిగేది. ఎవడైతే విజ్ఞానం సంపాదించుకొన్నాడో, వాడు ఐహిక విషయాలయందు భోగాన్ని అనుభవించకుండగ, అంటే అనుభవించినా అధికశాతం వాడు ఆధ్యాత్మికమైన విషయాలకే యెక్కువ ప్రాముఖ్యతయిచ్చి, ఆ తర్వాత సృష్టికి మూలమైన వస్తువు యేదో, దానిని తెలిసికొనడానికి, మహాకారణ శరీర పద్ధతుల ద్వారా ఆ స్థితికి చేరుకోవడానికి ప్రయత్నం చేసినాడు.

ఇట్లు చేసిన తర్వాత యిప్పుడు పరిపూర్ణ లక్షణం – "విద్యాంతం బ్రహ్మ విద్యాంతం వార్తికాంత మగోచరం, పూర్ణబోధ ప్రవక్ష్యామిశ్రుణు శిష్యమహోత్తమం", అన్నట్లుగా అతడు 64 విద్యలతో కూడిన వేదములను, పిమ్మట 32 విద్యలతో కూడుకున్న బ్రహ్మ విద్యను, ఆ తర్వాత దానికి అతీతమైన వార్తికమనేదానికి చేరుకున్నాడు. వార్తికానికి చేరుకున్నవాడు, యీ మహా కారణ శరీరస్థితికి చేరుకున్నాడన్నమాట. అదే వాయుభువనం. ఇచటకు చేరుకున్న తర్వాత వాడు దీనికంటే అతీతమైనది పరిపూర్ణభావమని తెలిసి, వార్తికాతం అగోచరం అంటే అక్కడకు చేరిన తర్వాత తనకు అర్థము కాలేదు, లేక తాను దీనిద్వార జనన, మరణాలు పొందుతాను అనేటి, యే భావమైతే వుండెనో ఆ భావము అభావమై పోయెను. దీనివలన నాకు ప్రయోజనము లేదని తెలిసికొనినాడు. తెలిసిన తర్వాత పరిపూర్ణ గురువును చేరి బోధను వినుటకు "బోధజేయుము పుణ్యపురుషా మా బోంట్లకు సాధించదగు ముఖ్య సాధన" అని అయ్యా! ఏ సాధన ఐనా ఉంటే చెప్పండి అని, నేను ఎన్నో సాధనలు చేసినాను, చేసినాగాని నాకు సత్ ఫలితము కలుగలేదు కాబట్టి మీరు పరిపూర్ణ భావజ్ఞులట, అందువలన అన్నిటిని మించిన ప్రబోధ మీ వద్ద వున్నదని విన్నాను. ఆ బోధ నాకు బోధించి, నేను చేసినవానికంటే గొప్పదైన సాధన యేమైనా వుంటే, దాన్ని గూడ చేయడానికి నేను సిద్ధముగా యున్నాను అని గురుమూర్తి దగ్గరకు వెళ్లి కోరితే, అప్పుడు అతడు ఏమంటాడంటే మంచిది నాయనా, ఏ సాధనయూ చేయవలసిన అవసరం లేదు, అది వొక వీసానికి కూడ పనికిరాదు. నేను సాధులచే విన్నటువంటిది, దానిని నీకు బోధ చేస్తాను విను అని చెప్పడం జరిగింది కదా!

సరే అని మీరు ఏ రీతి వినుమంటే, ఆ రీతి వినియెద మీరు ఆనతివ్వండి, తోరమౌ యీ బోధ". మీరు ఆజ్ఞాపించండి. మీరు ఎట్లా వినమంటే అట్లా యీ బోధను వింటాను. ఇది ఎడతెగలేనటువంటి, పరిపూర్ణమైనటువంటి ప్రబోధకాన, నేను చక్కగా వింటాను అని వాడు ప్రమాణపూర్వకంగా ఒప్పుకుంటాడు. ఒప్పుకున్న తర్వాత గురువు "నేను చెప్పే మాటలపైన, నాపైన, నాయనా, నీకు నమ్మకం వుండవలె ఒకటి. తరువాత నీవు చంచలమైన మనస్సును మాత్రం నీలో వుంచుకోకుండగ వినాలి. ఇది రెండవ నియమం.

మీరేం చేస్తిరి? బోధ సమయంలో వంటలు వగైరా పనులకు వెళ్లినారు. అంటే వంటలే ముఖ్యం కాని, బోధ ముఖ్యం కాదు, అన్నమాటే కదా మరి? చంచలమైన మనస్సును అరికట్టాలి. చక్కగా వినాలి. నా మాటపైన నమ్మిక కలిగి వినాలి. (1) నమ్మిక వుండాలి; (2) నీచంచల బుద్ధిమాని యుండాలి అని గురువు గారు చెప్పినారు. "మొదలచలము ఎరిగించెద, విదితముగా లేని యెరుక వివరింతు, పయిన్, తుదకెరుకను విడిపించెద, మదిలో నామాట నమ్మి మరివింటివేని, చంచల బుద్ధి మానుంటేవేని" అలా అని నీవు చేసినట్లయితే "పదుగురు నిను జూచి, భళి, శబాసు, యీ త్రోవకు యెదురు లేనట్లు యిదిగో నేను చేస్తాను" అన్నాడు గురువు. అన్నప్పుడు ఆయన చెప్పినట్లు మనము నడుచుకోవాలె. బోధయందు ఆసక్తి కలిగి వుండవలె.

అలా కలిగి, వాడు వింటూ, వింటూ పోయి, పరిపూర్ణ బోధ స్థితి కలిగినవాడు అయినాడు. అయితే వానికి అదే శరీరం వుంది. శరీరంలో మార్పు యేమీ రాలేదు. మరి యెక్కడ మార్పు వచ్చినదీ అంటే, వాని అంతఃకరణలో మార్పు వచ్చింది. ఇలా మార్పు రావడము వలన జ్ఞానము మారిపోయింది, మనసు, బుద్ధి, చిత్తము, అహంకారము అన్నీ కూడ మారిపోయినాయి. అవి మారిపోయినపుడు మిగతా అన్నీ మారిపోతాయి.

ఏలనన, యే పని చేయాలన్నా కూడా, అంతఃకరణను ఆధారంగా చేసికొనే చేయాలి. తెలివిలేకుండగా, ఏమైనా పనులు చేయగలుగుతామా! ఆ తెలివిని ఆధారంగానే కదా, యే పని చేసినా, చదువుకోవాలన్నా, పరీక్ష రాయాలన్నా తెలివి అధారంగానే కదా! తెలివి లేకుండగ యేమైనా చేస్తామా? చెయ్యము. అలాగే వ్యాపారం చేయాలంటే, యిచ్చిపుచ్చుకొనేదాంట్లో యెలా వుండాలంటే, వానికి ఎంతయియ్యాలి, యెంత పుచ్చుకోవాలి అని తెలిసి యుండాలి కదా!

మావద్ద వొక గ్రుడ్డివాడు వుండె. వానికి కండ్లే కనపడవు. వానికి ఒకరిద్దరు స్నేహితులు, ఎక్కువ లేరు. సరే, వానికి ఎవరైనా విభూతి, పండ్లు అగరువత్తులు, కర్పూరము, యిలాంటివి, సున్నము, పండ్లు మొదలైనవి అమ్మినపుడు (వాడు అమ్మేవాడు) వానికి వందరూపాయల నోటిస్తే, చేత్తో యిలా యిలా తడిమి మిగిలిన డబ్బు రూ.59-60 పైసలు అని లెక్కవేసి చక్కగా తిరిగి ఇచ్చేవాడు చిల్లరతో సహా. ఏ నోటు ఇచ్చినా జాగ్రత్తగా గుర్తు చేసేవాడు. రూ.50/-ల నోటు ఇచ్చి వంద రూపాయల నోటు ఇచ్చాను గదా అంటే ఎవరిని టోపీ వేయాలనుకుంటున్నావు, అని తిరిగి ప్రశ్న వేసేవాడు. సరియైన డబ్బు రాబట్టుకునేవాడు. చిల్లర వగైరా సరిగ్గా, ఎక్కువ, తక్కువ కాకుండగా కూడ వాపసు ఇచ్చేవాడు. అంతా చేతిస్పర్శ వలననే. కండ్లు లేవు. ఇంకొకటి, సినిమాకు కూడా వేళ్ళేవాడు. ఆ కాలంలో (ఇప్పుడాయన జీవించి లేడు పాపం). ఎవరి భుజంపైనైనా చేయి వేసుకొని వెళ్ళేవాడు. సినిమా మొదలైన తర్వాత ఎన్.టి.రామారావు మాట్లాడుతున్నాడుగదా! నాగేశ్వరరావు మాట్లాడుతున్నాడు కదా అనేవాడు.

పాటవిని యిది ఫలానా వారి పాట కదా అనేవాడు. కళ్ళు లేకపోయినా వాడు అన్ని పనులూ చేస్తుండేవాడు. అయితే దేని ఆధారంగా చేస్తున్నాడు అంటే, వ్యావహారికమైన పనులు చేస్తున్నాడు గాని, వానికి ఆధ్యాత్మికచింతన యేమైనా వున్నదా అంటే, లేదు. వ్యవహారిక జ్ఞానం మాత్రం బాగుగా ఉంది. తరువాత, చాలా యేండ్లకు, ముసలితనములో పెండ్లి చేసికొనినాడు. ఆమెను పెళ్ళి చేసుకున్న కొన్నాళ్ళ పిమ్మట చనిపోవడం జరిగింది. ఆస్తి ఆమెకు అప్పజెప్పేది వుంది, అప్పజెప్పినాడు, బాట పట్టినాడు, పాపం. ఇదంతా ఒక భ్రాంతి. అన్నదమ్ములంతా కలిసి యుండిరి. వాళ్లల్లో భేదము వచ్చేసింది. తను వేరైనాడు, ఆస్తి వేరు చేసికొన్నాడు. పిమ్మట యీమెను పెండ్లాడి, ఆస్తిఅప్పజెప్పి చనిపోయినాడు. ఇదంతా కారణదేహముతో చేసినపని.

కారణదేహమేమిటి? అనగా అజ్ఞానంతో కూడుకొనినది. మళ్ళీ అజ్ఞానావరణంలో యీ పనులన్నీ చేసినాడు, కాని వ్యవహారికంగా మంచి నేర్పరే. కన్నులు లేకపోయినా, గ్రామఫోను చెడిపోతే దానిని విప్పి, రిపేరు చేసేటివాడు. అది రిపేరు చేసినతర్వాత మళ్ళీ కూర్చోపెట్టి, రికార్డు పెట్టుకొని, గ్రామఫోను పాటలను వినేటివాడు. అంత నేర్పరితనం వున్నా మరివాడు జ్ఞానికాదు. అజ్ఞానియే. ప్రాపంచిక విషయాలపైన వానికి ఆసక్తి వుంది కాని పారమార్థికముపైన ఆసక్తిలేదు. అందువలన

వానిని అజ్ఞాని అని అనాలి, అజ్ఞానానికి మూలం కారణ శరీరం. కాబట్టి, స్థూల, సూక్ష్మ, కారణ శరీరాలు అజ్ఞానానికి మూలము. మళ్ళీ మహాకారణ శరీరం. జ్ఞానమునకు మూలము. కాన ఎప్పుడైతే, ఆధ్యాత్మిక జ్ఞానం మనం కలగజేసికొని, ఆధ్యాత్మిక తత్వాన్ని వింటూ, వింటూ పోతే అప్పుడు మనం అజ్ఞాన సంబంధమైన కారణదేహము నుండి, విడిపడి, మహాకారణదేహమునందు అభిమానము కలిగి ఆ ప్రకారము మెలుగుతూ, దాని స్థితి పొందడానికి ప్రయత్నం చేస్తాము.

ఇది చేసిన తర్వాత మనకు వార్తీకస్థితి కలిగినది. అంటే మనము వాయు భువనము లోనికి వెళ్లినాము. అనగా మహాకారణ స్థితిని మనము పొందినాము.

పిమ్మట, పరిపూర్ణబోధను వినడము చేత, మనలో వున్న యింద్రియాల స్థితిలో మార్పు వచ్చింది. ఇంతకుముందు చేసేది, అంతా శాశ్వతమని భావనతో చేసేది. ఇప్పుడు చేసేది అంతా అశాశ్వతమనే భావనయే, కాని, దీంట్లో శాశ్వతమనే భావనలేదు. నేను అశాశ్వతమైనప్పుడు, నేను చేసే పనులు శాశ్వతమా అనే భావము కలిగింది. ఇదే అన్నిటికీ అసలు మూలం. నేను అశాశ్వతమైనపుడు, నేను చేసే పనులు శాశ్వతమా అను భావన దృఢమయేటప్పటికి, ఆ స్థితి యందు వీడు పనులు చేస్తూ పోతాడు కాబట్టి ఏదీవాడు మానడు, అందరూ చేసినట్లనే చేస్తాడు. అందు కొరకే, పరిపూర్ణస్థితి కలిగినటువంటివాడు చేసినట్లు, నేను కూడా చేస్తున్నాను. నాకూ వానికీ ఏమి తేడా అని కొందరు అంటూ వుంటారు. అన్నంత మాత్రాన వాడూ, వీడూ వొకటే అవుతారా?

లోకులు వీడినీ, వాడినీ కూడా చూస్తారు. ప్రపంచీకుని పొగడుతారు. పరిపూర్ణ భావజ్ఞుని తెగడుతారు. అయితే వీనికేమైనా లోటు వస్తుంద? వీని స్థితి వీనిదే. ఏమైనా వాళ్లు తిట్టినా, తిట్టిన తర్వాత, వీనికేమీ కాదు కాని మళ్ళీ అనవసరంగా తిట్టినారు కదా! వీడేమైనా వాళ్ళ గొడవకు పోయెనా, ఏమీ లేదు.

మనం పట్టువస్త్రాలు తెచ్చుకున్నాము, పెళ్లిళ్ళలో కట్టుకుందామని. ఎప్పుడూ కట్టుకోం గదా! పెళ్ళిళ్ళ సమయాలలో కట్టుకుందాం గదా అని వాటిని పెట్టెలో పెట్టి మూతవేసి పెడతాం. అయితే చిమ్మెట అనే పురుగు, ఎలా చేరుతుందో, ఆ పెట్టెలోనికి చేరి "బలే అందంగా వున్నావని మురిసిపోతుంది, యీ చీర, దీనిపని నేను చూస్తాను" అని దాంట్లో చేరి అన్నీ రంధ్రాలు చేస్తుంది. దీనివలన చిమ్మెట పురుగుకు ఏమైనా లాభించిందా అంటే లేదు. అలానే దుష్టుడైన వాడు ఇలాంటి పనులు చేస్తాడు. చిమ్మెటకు ఏమీ కాలేదు. పట్టువస్త్రాలు గల వాళ్ళు ఆ పెట్టెలో

కలరావుండలు వేస్తే చిమ్మెట దగ్గరకుపోదు. ఒకవేళ ముందే చేరినా, ఈ వాసనకు అది చనిపోవడం జరుగుతుంది కూడా. అది చేసిన పనికి శిక్ష అనుభవించెనా లేదా మరి?

కావుననే యేమంటారంటే, పరిపూర్ణ బోధ కలిగినట్టివారిని, "పరమహంసాశ్రమధరుని, పరిపూర్ణపు బోధవాని, పనులు సమమె వార్నెరుగక, నుతి, నిందలు గరపిన, తత్ఫలము ప్రజలకగు నిజము సుమీ" అన్నారు కృష్ణదేశికులు. పరమ హంసాశ్రమధరుడు అంటే వేదాంతములో మహాకారణ శరీర స్థితిని చెందినవారు అంటారు. మహాకారణ శరీర స్థితిని తెలిసికొని ఆ స్థితిలో వున్నవాడు, వేషము, అన్నీ మార్చుకొని కాషాయ వస్త్రాలు వగైరా ధరిస్తాడు. మరి యితడు యతి, లేక ముని లేక సన్యాసి అనే భావము వచ్చేస్తుంది. వాళ్ళనేమో పొగడడం, గౌరవించడం, ఇంటికి పిలుచుకొని రూ.1116/-, లేక రూ.10,116/- ఒక్కొక్కరికి అనగా ఒకస్వామివారు తనని యింటికి పిలిపించుకొంటే లక్ష రూపాయల వరకూ పాదకట్నం పుచ్చుకొనుట కూడా వుందని అంటారు. ఏదో వుంది మొత్తానికి విలువైన పాద కట్నాలు వుంటవి. మరి పరిపూర్ణ బోధజ్ఞుడు వస్తే ఏమిస్తారు? వారి దగ్గరకు వచ్చినా, పాదాలు పట్టినా ఒకరు రూ.5 లేక రూ. 10/-లు ఇస్తారు. పరిపూర్ణ గురువులకు మహా అయితే యింటికి పిలిస్తే వందరూపాయలు పెడ్తారు.

వారు ఎంత పెట్టినా, పెట్టకపోయినా, మాకు యివ్వలేదు, యిచ్చారు అనే భావం పరిపూర్ణ గురువునకు వుండదు. ఇక్కడ వాళ్ళనేమో పొగడడము, వీళ్లను తెగడడము చేస్తారా, చేయరా?

వార్నెరిగి వీర్నెరుగక అంటే వారులను ఎరుగుతారు, వీరిని ఎరుగక, నుతి (పొగుడుతారు), నిందచేస్తారు - ఏలనన వీరు గృహస్థులే కద. నుతి, నిందలు చేసిన ప్రజలకు ఫలము అనుభవించక తప్పదు అని కందార్థములలో చెప్పినారు.

వీని స్థితి వీనికే అర్థమగును కాని, యితరులకు అర్థము కాదు. వీడు పురుషులలో వొక పురుషుడే. కాని 'వుత్తమ పురుషుడు' అని పొగడబడినాడు. ఈ పురుషోత్తముడు, క్షర, అక్షర పురుషుల స్పర్శలకు అందకుండగ వుంటాడు.

క్షరపురుషస్థితి అంటే మరుపులో వున్న స్థితి అనగా కారణ దేహ అంతర్గతమైన స్థితి. స్థూల, సూక్ష్మ, కారణ దేహము - యిదంతా క్షరపురుష స్థితి. మహాకారణ శరీరమేమో అక్షర పురుషస్థితి. ఐతే వీనియొక్క స్థితి ఎలా వుంటుందనగా పై యిరువురి స్థితికీ అంటకుండగయున్నాడు. క్షరపురుషుడనబడువాడు అజ్ఞాని.

అక్షరపురుషుడు జ్ఞాని. అందుకొఅకే... "గురునకు మంగళమనరమ్మా, మద్గురు మూర్తిని కనుగొనరమ్మా" అనిచెప్తూ ఆ పాటలో... జ్ఞాని యనుట కనరాదమ్మా, అజ్ఞానియనుట కదిలేదమ్మా, జ్ఞానాజ్ఞానము లోన వొక్కటియు తానుగాక, శూన్యానికి మీరిన గురువునకు మంగళ మనరమ్మా..." అన్నారు. కాబట్టి వీడు జ్ఞానము, అజ్ఞాన స్వరూపము లైనట్టి కారణ, మహాకారణ శరీరస్థితులకు అతీతమైన నడక కలిగినటువంటి వాడు కావడము చేత వానిని పురుషోత్తముడనీ, వాడు ధరించిన శరీరము – అదే శరీరము మనకు కనపడినా అంతర్గతంగా ఆ శరీరంలో ఎంతో మార్పు వచ్చింది. అందువల్ల వాని నడకలో మార్పు వచ్చినదనీ మనం తెలిసికోవాలి – అటువంటి కైవల్య శరీరమును పొందినవాడు ఎలా వుంటాడూ, అనే విషయాన్ని మనమిపుడు తెలిసికోవాలి. ప్రయత్నం చేస్తాము.

వాని అంతఃకరణ యేస్థితిలో వుందంటే మహాకాశస్థితిలో వుంది. ఆకాశము గగనం శూన్యమని ఆకాశానికి పేరు. శూన్యము అంటే ఏమీ లేనటువంటిది. ఇంకొకటి – ఆకాశము బయలుగా వుండడము దాని ధర్మము అన్నారు కూడా. అంటే వొక ప్రదేశము మిట్ట, పల్లాలు లేకుండా వొకే రకంగా వుండేది, తరువాత అచట చెట్లు, చేమలు, పుట్టలు, గుట్టలు మొదలైనవి లేకుండా ఖాళీస్థలము వొకటి వుంది. ఒకే మోస్తరుగా ప్రదేశము అంతా వుంది, అట్టి స్థలానికి బయలు అంటాం. ఎందుకు, బయలు అంటే అక్కడేమీ యిళ్ళు కనపడడం లేదు, గడ్డికనపడడం లేదు, చెట్లూ, చేమలూ, గుట్టలూ, నదులూ, మనుష్య సంచారమూ, ఏ సంచారమూ లేదు. పశువులు, మృగాలూ ఏమీ కూడా లేవు.

కాబట్టి ఏమీ లేనట్టి ప్రదేశమునకు 'బయలు' అనిపేరు. కాన వీని అంతః కరణములో కూడా ఏమీ లేదు, అంటే – అసలు వుండేవి విషయాదులు, – అచట విషయాదులు యిప్పుడు ఏమీ లేవన్న మాట. ఆ అంతఃకరణ మహాకాశస్వరూప మైనది అనగా ఏమీ లేదు. ఖాళీగా వుంది, ఏ విషయమూ దానిలోనికి ప్రవేశించలేదు కదా! సూర్యాకాశమునందు, సూర్యప్రకాశము వలన మనము ఎల్లపనులూ చేసుకుంటున్నాము గదా! కావున యిచట వ్యవహారమున్నది కదా! విషయాలున్నవా? లేదా? ఉన్నాయి. మరలా దహరాకాశమనగా ఎక్కడికైనా వెళ్లాలంటే దిక్కులను ఆధారం చేసికొని, దాని లక్షణాలతో పోతాము. ఇల్లు కట్టు కొనవలెనంటే, తూర్పుకు ఇల్లు కట్టుకుంటే బాగుంటాడు, ఉత్తరానికి ముఖం పెట్టి యిల్లు కట్టుకుంటే బాగుంటుంది... యిలాంటి వేవో చెప్తారు. కొందరు అట్లనే కట్టుకుంటారు కాని

వారు ఏమో మళ్ళీ ఆరోగ్యంగా వుండరు. ఏపని చేసినా లాభం పొందాలంటే పొందరు. అంటే ఏమయ్యా కారణం అని అడిగితే వానిపేరుకూ, ఆ దిక్కుకూ సరిపోలేదని చెప్తారు. ఏది నమ్మాలి?

ఈ దిక్కులకు ముఖంగా వున్న గృహయజమానులు బాగా వైభవంగా వుంటారు అని ఒకచోట చెప్తారు. మరి నేను యిట్లనే యిల్లు కట్టుకున్నాను మళ్ళీ బాధలు పడుతున్నాను. ఏమీ? అంటే - ఇంట్లో ఏ పనిచేసినా జయములేదు, రోగాలున్నాయి, వ్యాపారాలలో లాభం రావడం లేదు అంటే నీపేరుకు యిది సరిపోలేదోయి అంటారట! గోవిందా! అంటే ఇప్పుడేమగును? దంఢగే కదా!

అంతఃకరణకు ఆవరించుకొన్నపుడు ఏమి చెస్తాడు... అది పడగొట్టమంటే అది పడగొట్టుతాం. ఇవి యిట్లా కట్టియ్యి అంటే కట్టిస్తాం. ఇచట వాకిలి వుండరాదు, తలుపు వుండరాదు అంటే తీసేస్తాం. మళ్ళీ ఎచ్చట పెట్టమంటే అచట పెట్టేస్తాం. ఇలా ఏమేమో చేస్తాం కదా!

కాని నిర్విషయ అంతఃకరణ కలిగినటువంటివాడు, "నేనేలేను", నేను చేసిన పనులుగాని, నేను వుండేటటువంటిదిగాని, శాశ్వతమా ఏమి, కాదుకదా!" రోడ్డుమీద పండుకొనేవాళ్ళు ఎంతోమంది వున్నారు. నేనేమో కనీసం యింట్లో పడుకుంటున్నాను, రోడ్డుమీద కాక - వానికంటే మేలే కదా! అని వీడు, రోడ్డు మీద వున్నవానిని చూచి, ఎక్కువ వ్యామోహం లోనికి వెళ్ళక ఎక్కడికక్కడనే, ఏదో వొకదానితో తృప్తిపడతాడు. - ఈస్థితి ఏమి చేస్తుందంటే వాని అంతఃకరణ, భ్రాంతులతో కలుషితము కాకుండగ, ఆ గురుమూర్తి చెప్పినప్రకారము వాడు విచారణ చేసికొంటాడు - వాని అంతఃకరణ నిర్విషయముగా వుంది. అంచేత వాని అంతః కరణ ఎట్టిదనగా మహాకాశము ఎలాంటిదో అలాంటిది. ఆకాశములో చలనము మొదలగునవి లేవు. 'చలియించనిది ఆకాశము, చలనంబే వాయువనుచు చాటింపదగున్, యీ చలనమె విశ్వము, నేను అని అన". చలనరహితమైనది బయలు అని తెలిసికొని, దీనిపైన భ్రాంతి వదులుకోమని చెప్పినారు. కాన ఆకాశం చలించదు. వాయువే చలించును. ఈ చలనాదులు అంటే భ్రాంతులు లేవు. భ్రాంతులు, విషయాదులూ - రెండూ లేనటువంటి స్థితిలో వాడు వుండును. అదియే మహాకాశస్థితి. ఆస్థితిలో ఏ విధమైన సంకల్పములూ లేక వాడు వున్నాడు. వాడు చేసే పని "ఆత్మారామత్వం". బయట వుండు ధన, కనక, అందమగు వస్తువులపైన గాని, వాహనాదుల పైనగాని, యితర బాహ్య ఆకర్షణలకు మనవలె లోను కాడు.

తుకారాంను వేశ్య పిలువగా, భక్తురాలువలె నటించి, రమ్మనగా వెళతాడు. కాని ఆమె వలలో పడలేదు. అలానే ఈ స్థితిలోని పరిపూర్ణభావజ్ఞుడు విషయాదులకు లోనుకాడు, తాను.

## కైవల్య శరీర విచారణ

విషయవాసనలను తాను అంటించుకొనకుండగా తనయందు, తన ఆత్మయందే, తాను రమిస్తాడు కాన "ఆత్మారామత్వ" స్థితిని పొందును "రామం రమేతి రామః" అన్నారు. రామ = రమింపచేయువాడు రాముడని అర్థం. మనని తన్మయత్వంలో ముంచువాడు రాముడని అర్థం. తన్మయత్మస్థితిని కైవల్యశరీరధారి తను ఆత్మయందే పొందునని దీని భావము. కావుననే "ఆత్మారామత్వం" అన్నారు. అది సిద్ధించిన పిమ్మట యితడు దేని ఆధారము లేకనే ప్రకాశించును. తనకు తానే స్వయం ప్రకాశస్వరూపుడగును. వీడు చేయుపనులవలన యిహమునకుగాని పరమునకుగాని ఎట్టి కీడూ వాటిల్లదు. వాడు అమృత స్వరూపుడై వుండును. కావున మనిషి అనికాని, పశువు అని కాని, వానిచేష్టలవలన ఎవరినైనా నిర్ణయిస్తాం. గాడిదను యజమాని బట్టలమూటతో రేవుకు తోలుకెళ్లి, బట్టలు దింపి, మేతకై వదులును. బట్టలుతికి ఆరినపిదప దాన్ని అదిలిస్తాడు. ఇంటికిమూటతో వెళ్లిన తర్వాత దానికి కూడు సరిగా పెట్టడు. ఉదయమూ పెట్టడు. ఇలా దానిని వాడుకుంటాడు గాని కూడుపెట్టడు సరిగా. దాన్ని అదిలించడం మాత్రం చేస్తాడు ఇదంతా అదిపనికిరానిది అనే అభిప్రాయముతో చేసే వ్యవహారం. దానిపని తనకు కావాలి. అది మాత్రం పనికి రాదనే భేదభావం వున్నదికదా ఆ చాకలికి, పనికిరానివాడు, పనికి వచ్చువాడు అని ఇలా భేదాలు మనలో వుండడం వలన కొందరియందు భేదము చూపిస్తాము. కొందరియందు అభిమానము చూపిస్తాము. తనకు సరిపోని వారలపైన భేదము చూపెదము. సరిపోయే వాళ్లపైన భేదము చూపము. "కూరిమిగల దినములలో, నేరము లెన్నడును కలుగనేరవు, మరియా కూరిమి విరసంబైనను నేరములే తోచుచుండు, నిక్కము సుమతీ! "అన్నారు. ప్రేమగా వున్నన్నినాళ్లు వాళ్లు ఎన్నిపనులు చేసినా, ఏ పనులు చేసినా యేమీ అనము. ఉదాహరణకు మనపిల్లవాడే వున్నాడు.

మనపిల్లవాడు తన్నినా, అల్లరిచేసినా ఏమీ అనము చిన్నతనంలో. వాడే పెద్దవాడై అదేకాలితో తన్నినచో, ఎంతదుర్మార్గుడోకదా!యీకొడుకు అని ఏడుస్తాము.

అపుడు తన్నినపుడు సంతసించినాము. ఇపుడు దుర్మార్గుడని మాటలాడుతాము. అంటే అపుడు భేదము ఏమీ తోచలేదు, ఇపుడు భేదము తోచింది. అపుడు ఎంత ఎక్కువ చేసినా బాధ అనిపించలేదు, ఇపుడు ఏకొంచెం చేసినా బాధకలుగును. ఏల, యిపుడు బేధభావము వచ్చివేయుటవలన. అంటే ఒక మారు భేదము మరొకమారు అభేదము. ఈ రెండింటివలన సుఖదుఃఖములు కలుగుచున్నాయి. కానిసుఖదుఃఖాలకు దూరంగా వుండాలంటే "భేదాభేద అతీతత్వం" కైవల్యశరీరధారికి భేదభేద అతీతత్వము అబ్బును. ఇది అబ్బిన తర్వాత ఎట్లా వుంటాడు అంటే యితనికి మనసు, సంకల్పం, అంతఃకరణ లేవా అంటే మనసు వుంది కాని అది దహరాకాశము గా వుంది. ఈ మనసు అందరిలోనూ భేదాభేదాలను బైటికి తీసికొనివచ్చును. కాని కైవశ్యశరీరధారి భేదాభేద అతీతస్థితిలో వుండడం చేత ఎవరిని చూసినా ఏకభావంతోనే చూచును కాని భేదభావంతో చూడడు. అంటే వీనికి "సమరసతత్వం" అబ్బును. అంటే మానవులంతా వొకటే అనే భావం కలుగును. పశుపక్ష్యాదులంతా కూడా ఒకటే అనే భావం కూడా కలుగును. మనం సింహాచలంలో వున్న స్వామిదేవుని మ్రొక్కివస్తాం. అతడు సింహం & వరాహం (పంది) రెండు రూపములలో వుంటాడు. ఉంటే ఆ రెండు రూపాలకూ మ్రొక్కు చున్నాముగదా! దాని అభిప్రాయమేమంటే, యిది వున్నతమైనది, ఇది నీచమయినదీ, అనే భావనలేకుండా యుండుట అలా వుచ్చ, నీచస్థితులు లేకుండావుండే సమదృష్టి మనకు అలవడుతుంది. దానికే "సమరసత్వతత్వం" అన్నారు.

తర్వాత వాడు యిహమునకే కాక, పరమునకు కూడా ప్రకాశము యివ్వగలుగునట్లు అవగలుగుతాడు. అంటే "పరంజ్యోతిత్వం" వానికి అలవడినదని అర్థము. అపుడతడు మృతప్రాయుడుకాదు, పోనీ అమృతప్రాయుడా అంటే, వాడూ, వీడూ, అనరానటువంటివాడు, అట్టి చైతన్యం వీనియందుండునుగాన దానిని "అనామృతచైతన్యత్వం" అని అన్నారు. ఇలా చైతన్యత్వం కలిగిన వానియందు అభేదాభేదత్వం ఏర్పడును. భేదములేకుండగవుండుట అభేదత్వము. ఇహమందు కాని, పరమందుకాని, దేనియందునూ భేదత్వము లేనిస్థితివానికి కలుగును. కానదానిని అభేదా భేదత్వస్థితి అన్నారు.

పిమ్మట, వానిబుద్ధి నిరవయవఆకాశ రీతినుండును. దిక్కులకు యేమైనా శరీరం, కాళ్ళు, చేతులు వగైరా మనకు వున్నట్లు వున్నాయా? గోడలకు వుంటే శరీరం వుండవచ్చు, కాని దిక్కులకు యివేమిలేవు. అంతఃకరణ, బుద్ధి మార్పుచెంది

నిరవయవ ఆకాశ స్థితి పొందింది. బుద్ధి యిక "చిదీశ్వరభావ అఖిలలీనత్వం" చెందింది. చిత్= చైతన్య, చిత్, యీశ్వరుడు-ఈ రెండూ అనగా జీవునియందూ, యీశ్వరునియందు ఆచైతన్యమే వున్నది కాన, జీవుడు, యీశ్వరునికంటే అన్యుడుకాదు, అదే చైతన్యము, అఖిలమునందూ అనగా అంతటావున్నది అనే భావమునకు వీడు లోనగును. కానదీనిని "చిదీశ్వర భావ అఖిల లీనత్వము అనిచెప్పుట జరిగెను.

తర్వాత వీడు, తన ప్రకాశం వలన యితరులను కడతేర్చుగలడు కూడ. గురుగీత, గురుపుత్రుని తల్లి, తండ్రి, గోత్రము అన్నీ తరించునని చెప్పుచున్నది కదా! "ధన్యోమాతాపితా.......యత్రస్యగురుభక్తిమాన్", వానివలన, వానితల్లి, తండ్రి ధన్యులగుదురు. వానివంశము, గోత్రమంతా వాడువుండునంత నేలకూడ పవిత్రమగును అనగా "పరిపూర్ణ గురుపుత్రుని" వలన యివన్నీ ధన్యమగును.

కావుననే కృష్ణదేశికేంద్రులు ఏమన్నారంటే "గురుచరణ జలమే గోదావరి యని, గురుమూర్తియే రామభద్రుండని... ... ... అనే కందార్థములో గురుపాదములు కడిగిన తీర్థము గోదావరీ తీర్థముతో సమానమన్నారు. గురుమూర్తియే రామభద్రుడు. రామభద్రుని సమీపంలో - లభించే గోదావరీ జలాన్ని పవిత్రంగా యింటికి తెచ్చుకొంటాం, పారబోయకుండగా తలపైన జల్లుకుంటాం. అలానే గురుపాద తీర్థాన్ని గ్రోలవలె, తలపైన జల్లుకోవాలి. అతడుపదేశించిన మంత్రము లేక వాక్యము తరింప చేయు "తారక" మని భావించాలి. దానివల్ల నేను తరిస్తాను నాజన్మకడతేరును అనే లక్ష్యము కలిగివుండాలి. అలానే "తిరిగిరాని మరుగు" జనన మరణ ప్రవాహమునకు తిరిగిరాని రహస్యం తెలిసికొన్న నరుడు అనగా శిష్యుడు (గురువు మాత్రమే కాదిక్కడ) ఎక్కడపాదం పెడితే, వాడు ఉన్నచోటుయే భద్రాచలము, సుందరశేషగిరి- తిరుపతితో సమానం. గురుమూర్తి దర్శనమైతే సరేసరి. కాక పోయినా శిష్యుని దర్శనమైతే , వేంకటేశ్వరుని దర్శనమాయెనని ఆనందంపొంద వలెను. కావుననే పూర్వం కూడా తిరుపతికి, భద్రాచలం పోయినవారి పాదాలకు మ్రొక్కుతూండేవారు. ఆరోజులల్లో రైలు, వగైరాలు లేవు. తీర్థయాత్రల ప్రయాణం చాలా కష్టమయ్యేది. ఆపవిత్రత, అతను తీర్థయాత్రచేసి సిద్ధించుకొనెను గాన అతనికి మ్రొక్కిన మాకు కూడా ఆ పవిత్రత, ఫలము లభించునని అట్లు మ్రొక్కెడివారు. ఇపుడు అదే భావం, గురుపుత్రుడు వున్నచోట ప్రకటింపబడుతోంది. అతడు వున్న చోటు సుంధర తిరుపతి భద్రాచలం, శ్రీరంగపట్టణం అన్నారు. శ్రీరంగంలో

రంగానాయక స్వామి పడుకున్నట్లు వుంటుంది. విగ్రహం రామానుజాచార్యులవారు, ఆగుడిగోపురమెక్కి, తిరుమంత్రమును బిగ్గరగా అందరికీ చెప్పినారట." ఏమియిట్లా అరిస్తే నీవు తలపగిలి చస్తావు అని పెద్దలు అంటే "ఓయబ్బా! పోయేది నేనొక్కడినేగదా! ఇందరు, వైకుంఠానికి, మోక్షానికి చేరుకుంటే నాకు యింక కావలసినది ఏమున్నది." అంటారు రామానుజులు, రంగనాయకస్వామి కథ చాలా పెద్దది.

రామానుజలవారు స్నానానికి వెళ్లునపుడు బ్రాహ్మణ శిష్యులు ఆసరాగా వస్తే వారినిపట్టుకుని, కావేరీనదిలో స్నానంచేసేవారు. పిమ్మట ధనుర్దాసు అనే శూద్రుడగు మల్లయోధుని, పట్టుకొని ఆసరాగా తిరిగి వచ్చేవారు. స్నానానికి వెళ్లేటప్పుడు బ్రాహ్మణులను పట్టుకు వెళ్లడం, తిరుగుప్రయాణంలో సూద్రుని పట్టుకొని వచ్చుట. ఇదిచూచి, బ్రాహ్మణశిష్యులు కోపించి, మాగురువు భ్రష్టులైనదేకాక, మమ్ములను కూడ భ్రష్టులను చేస్తున్నారు అని ప్రచారం చేసినారు. గురువుకు మతిపోయినట్లుంది. స్నానం తర్వాత, శూద్రుని పట్టుకొని వచ్చుటయా! ఇతడు మహాత్ముడు అనుకొన్నాం, ఇలా భ్రష్టత్వం చెందుటయా అని కలకలం బయలుదేరింది. అపుడు గురువు ఒక పరీక్ష పెడతారు. వారికి తెలియకుండగా, రాత్రి వారు ఆరేసుకున్న గోచీలను చించి పెట్టినారు దానివలన ఆగోచీలు కట్టుకొన వీలుండదు. ఇలాగ తన ఆంతరంగిక శిష్యుల ద్వారా ఆబ్రాహ్మణశిష్యుల గోచీలను చింపించినారు రహస్యంగా రాత్రివేళ, ఆరేసిన గోచీలను శిష్యులు మరునాడు చూచుకొని నొకళ్ళనొకళ్ళు కొట్టుకుంటారు. వీరు సన్యాసులు, సద్బ్రాహ్మణ వంశమువారు, యిట్లా కోపతాపములకు లోనైనారు.

ఇంకొకపని ఏమిచేయించినారంటే, గురువుగారు ధనుర్దాసును తన వద్దే రాత్రి నిద్రపొమ్మని ఆదేశించారు. ఆనాటిరాత్రి, గురువుగారి ఆంతరంగిక శిష్యులు ధనుర్దాసు యింటికి వెళ్ళి అతని భార్యనగలని దోచుకుంటారు. ఆమె ఒకవైపుకు ఒత్తిగిలిపండుకుంటే రెండవవైపునగలన్నీ దోచుకొన్నారు. ఆయ్యో! భగవద్ భక్తులు సొమ్ము అవసరమై దోచుకోవచ్చినారు, మరిరెండవవైపు వస్తువులు (నగలు) దోచుకొను అవకాశం కలిగించాలి కదా అని భావించి, కండ్లు మూసుకొనే ఆమె రెండవవైపు తిరిగెనట. అయ్యో! ఈమెకు మెలుకువ వచ్చినది గుర్తుపట్టునేమో అని భయముతో ఆశిష్యులు అంతవఱకు దొంగిలించిన సొమ్ములతో పారిపోయినారు.

ఉదయము అవగనే ధనుర్దాసు యింటికి వచ్చెను. భార్యముఖము చూచి ఒకవైపునగలు కనపడకపోవుటచే కారణమడిగెను. ఆమె రాత్రి దొంగలు పడుట,

వారు నొకవైపునగలు వొలిచుకొనిన పిమ్మట, వారికి సులభముగా రెండవైపు నగలు లభించుటకై తాను తిరుగగా వారు పారిపోయినారనియు అందువలన కేవలం నొక వైపుననే నగలు మిగినవనియు ఆమె చెప్పెను. దానికతడు కోపముతో “ముండా” నీకు శరీరంపై అభిమానంవుండి రెండవవైపు తిరిగినావు, దీనివలన భగవత్ భక్తులకు అపచారము చేసినావు. నీవు మేల్కొనినావని వారు మిగతసొమ్ములు తీసికొనక వెడలిపోయారు. నీవు భగవత్ భక్తులకు అర్పించక ఆసొమ్ములపై మోహంతో ప్రక్కకు తిరిగినావు.భక్తులకు అపచారము చేసిన నీవు నాకు వలదు అంటూ ఆశ్రమమునకు వెడలిపోయినాడు. ఆమె లబోదిబోమంటూ నామొగుడు వదిలివేసినాడు అని స్వామివారి కాళ్లపైబడి కథవివరించి తన కాపురము నిలబెట్టుమని ప్రార్థించింది.

ఈ కథ అంతాస్వామివారిముందర కూర్చున్న బ్రాహ్మణభక్తులు కూడ విన్నారు. వారితో రామానుజులువారు. “శిష్యులారా ! మల్లయోధుడైన ధనుర్దాసు తన విద్యద్వారా బాగుగాగడించి భార్యకు నగలు చేయించాడు. సగం దోచుకొన్నా మిగిలిన సగం సొమ్ములూ అర్పించలేదని ఆమెనితడు వదిలివేసినాడు. మీరేమో చిన్నగోచీగుడ్డను ప్రక్కవాళ్లు పాడిచేసిరా అనే నెపంతో వారితో పోట్లాడుతున్నారు. ఇంతకీ ఎవరు పవిత్రులు మీరా, వాడా? వారికి తాము పవిత్రులు కామనీ, ఆసూద్రుడే పవిత్రుడనీ భావం స్ఫురించింది ఇదంతా శ్రీరంగంలో స్వామివుండే ఆశ్రమంలో జరిగింది. శ్రీ రంగము భద్రాచలము, తిరుపతి, పూరీజగన్నాథం వగైరా వైష్ణవులకు పవిత్ర తీర్థస్థానములు సరే,ఈ పద్యంలో కృష్ణదేశికేంద్రులు.... నరుడున్నచోటే, ఈ స్థితి కలిగినవాడు ఉన్నచోటే పవిత్రస్థానం. కానవాడు, పరంజ్యోతి స్వరూపుడై వుంటాడు. అందరికీ ప్రకాశమిచ్చువాడు, పూజనీయుడు కాన “జ్యోతిర్మయత్వం” పొందినాడు. ఇట్టిస్థితినాతడు ఎలాపొందెననగా, తాను గురువుద్వారా తత్త్వమును అనగా బోధా మృతమును గ్రోలి యిట్టి “తత్వామృతస్థితి” పొందెనని చెప్పినారు.

పిమ్మట “భేదా భేదత్వం” అనే స్థితినిపొందును. అనగా వీనియందు భేదము అభేదము అను 2 స్థితులూ వున్నాయి. అంటే ఎరుక పరిపూర్ణముగాదు, ఎరుక ఎరుకనే, పరిపూర్ణము పరిపూర్ణమే. అది ఒకటే అనే నిర్ణయంలో వుండడము వలన ఇది అది గాదు, అది ఇదిగాదు అంటే ఎరుక పరిపూర్ణముకాదు. పరిపూర్ణము ఎరుక కాదు - రెండూ వుంటే రెండూవేరువేరు అనుకోవచ్చు. కాని నిజానికి “వున్నది ఒకటే” అనే నిర్ణయానికి చేరుకోవడం వలన “భేదాభేదత్వం అనేది యితనికి ఏర్పడినది అని చెప్పినారు.

సూర్యుడు తనకుతాను ప్రకాశించినట్లు - చంద్రుడు, తారలు సకల, జీవులు, ప్రతివుపాదీ సూర్యుని వల్లనే - సూర్యుని ప్రకాశము వలననే - ప్రకాశింపబడుతాయి, పరిపూర్ణభావజ్ఞుడు తన ప్రవర్తన వలన యితర మానవులకు ఆదర్శప్రాయుడు కావడముచేత వీనియొక్క అంతఃకరణ "సూర్యాకాశ" స్థితి పొందినదని చెప్పుట జరిగినది.

అయితే సూర్యునివలె స్వయం ప్రకాశమానమగు ఏ చైతన్యం, ఏ బ్రహ్మతత్వమైతే వున్నదో, ఆ బ్రహ్మతత్వమునకు - అనగా సత్యం, జ్ఞానం, అనంతంబ్రహ్మ అనబడే బ్రహ్మతత్వమునకు వీడు వేరుకాకపోవుటవలన ఆస్థితిని ఏమన్నారనగా " సత్యజ్ఞాన మనంత పరత్వం" ఆ అనంతం అనే దానిపైన వీనికి లక్ష్యము లేక అభిమానము లేదు. వీనికి సత్య, జ్ఞాన, అనంత స్థితికి వేరైన లేక దానికి పరమైన, అతీతమైన తత్వం వీడు కలిగియున్నాడు. లేక ఆ స్వరూపుడే వీడైనాడు అని అర్థం. దీనిక్రింద ఆపోజ్యోతిత్వం అనివ్రాయుటవలన కూడా ఇలా అనుకోవాలి. 'ఆపోజ్యోతి'అనగా మన కంటి నీరు వున్నది కదా ! దీనియందు వొకప్రకాశము పడుతుంది. ఆ ప్రకాశం మనకు కనపడినట్లయితే, ఆకంటి నీటియందు కనుపడుప్రకాశము, అద్దంయందు ప్రతిఫలనము చెందునట్లే, యీకంటియందు కూడా ఆప్రకాశము ప్రతిఫలించి, యిది ఆపోజ్యోతిత్వం పొందుతుంది. ఇది ఎట్లా ప్రకాశిస్తుందంటే, యిహమునందు జీవుడనీ, పరమునందు ఈశ్వరుడనీ పిలువబడుచున్నాడు. ఎలా పిలువబడుచున్నాడంటే (1) మాయ (2)మాయాధిష్టానచైతన్యము (3) మాయాధిష్టానచేతన ప్రతిబింబము - ఈ 3 కలిసి ఈశ్వరుడని పిలువబడుతున్నాడు.

ఇక జీవుడనగా (1) అంతఃకరణ (2) అంతఃకరణ అధిష్టాన చైతన్యం (3) అంతఃకరణ అధిష్టాన చైతన్యప్రతిబింబము, ఈ మూడు కలిస్తే జీవుడు అన్నారు. ఇక్కడ ఉన్నది జీవోపాధే కాని లోన మార్పులు కైవల్య శరీరమునకు సంబంధించిన మార్పులు కలిగినాయి. కలుగుటవలన యీసత్య, జ్ఞాన, అనంత బ్రహ్మస్వరూపమైన తాను తనయందు ప్రతిఫలించే ఏ ప్రకాశమైతేవుందో దానిని ఆపోజ్యోతి అంటారే. ఆ ఆపోజ్యోతి తత్వము కూడా తానే అయివున్నాడు. అతనికి మృతతత్వం లేకపోవుటచే (అనంతస్వరూపుడుగా, అతడు "అమృతత్వం" కలిగినవాడు. ఇది కేవలం వొక ప్రదేశమందే కాకపోవుటవలన అంతటా వున్నది. కావడం వలన దీనికి "అఖండత్వం" సిద్ధించినదని చెప్పవలసినవచ్చినది.

పిమ్మట, ఇదంతా ఎక్కడ జరుగుతోంది? భూమియందే, భూమినివదలి ఎవరైనావున్నారా? అతడు కృష్ణుడు, రాముడు కావచ్చు మహర్షి, నరుడు, నారాయణుడు కావచ్చు. వీరంతా యీ భూమిపైన సంచరించిన వారలేకదా!దీనిని వదిలిన వారు కాదు కదా అయోధ్యను, ద్వారకను పాలించినా వారు భూమియందే యున్నారు. అట్లే వీడుకూడ యీ భూమియందే వుంటాడు. ఈ భూతాకాశము నందే సంచరించును. అయితే దాని యొక్క స్ఫూర్తి లోనా, బయటా వుందని చెప్పుదామంటే అట్లు లేకపోవుట వలన "అంతర్ బాహ్య స్ఫూర్తి రహితత్వం" అన్నారు. స్ఫూర్తి అనగా స్ఫృహణ లేక సంకల్పములో-సంకల్పంలేక బహిర్గత సంకల్పము లేక అనగా నిస్సంకల్పస్థితి కలిగిన వాడని అర్థం.

తరువాత జగత్తుకే ఆదర్శప్రాయుడు అగుటవలన, వీనికి "జగత్‌జ్యోతిత్వము" వీనికి అలవడినదని చెప్పినారు. వీడు నిరంతరం బోధామృతం గ్రోలుచుండుట వలన వీనికీ "బోధామృతత్వం" సిద్ధించినదన్నారు. వీడు ఇహమును వదిలిలేదు, పరమును అంటుకొనీలేదు. రెంటికీ అనుకూలస్థితిలో వున్నాడు కాన వీనికి "అద్వయత్వం" సిద్ధించినదని చెప్పినారు.

అయితే, వీడు అద్వయత్వస్థితిలోనే వుండవలెనా? అని మళ్లీ ప్రశ్న వేస్తే, అతడు బోధామృతాన్ని గ్రోలుతూపోతే, యీజగత్తుకే ప్రకాశ స్వరూపుడైయున్నాడు. ఆప్రకాశస్థితిని చేరుకున్నవాడు, వానియందులోనా, బయట స్ఫురణ లేదు అనగా సంకల్పరహితుడు. అతడు ఎక్కడనోలేదు ఇక్కడనే భూతాకాశమందే యున్నాడు. అయితే, అతనిలో ఖండభావమే లేదు, "అఖండభావమే వుంది. దానివలన వానియందు మృతరూపమగు భావము లేమీ వుండకపోవుటచే అతడు "అమృతత్వం" పొందును. దీనివలన అందరికీ ఆదర్శప్రాయుడగుటవలన "అపోజ్యోతిత్వం" కలిగి యుంటున్నాడు. దీనివలన క్రమంగా జీవునికంటె అతీతమైన బ్రహ్మతత్వమును పొందుచున్నాడు గావున "సత్య జ్ఞాన, అనంత పరత్వము" దీనివలన కలుగుచూయున్నది. అది కలిగిన తర్వాత సూర్యుడు సకల జీవోపాధులకు స్ఫూర్తిగా ఎలా వున్నాడో, ఇతడు కూడా ఇతరులకు స్ఫూర్తినొసగుచుండును. సూర్యాకాశం వలె వుండును. ఆవెలుగులో రాజు, రాజు పనిని, దొంగ తన దొంగపనిని, రైతు వ్యవసాయమును మొదలగు పనులు జరుపుకొనునట్లు ప్రకాశం యిచ్చిన సూర్యుడు వీళ్లసహాయం పొందునా? పొందదు, కాన వీనిని ఆదర్శముగా తీసికొని అందరూ, సకలజీవోపాధులలోనూ మానవుడు తరించటాని ప్రయత్నం చేస్తాడు. అట్టి స్ఫూర్తి

అందరికీ యిచ్చుటవలన యితడు "సూర్యాకాశస్థితిని" పొందినాడని గ్రహించాలి. ఆస్థితికి చేరిన వానికి భేదము, అభేదము అనే లక్షణాలు-ప్రపంచం -భ్రాంతి, అసత్ స్వరూపము, పరిపూర్ణము సత్యము భ్రాంతి లేదు. గాన "భేదాభేదత్వం" కలుగును. ఇది తప్ప ఏమీలేదు. పరిపూర్ణమేవున్నది, బేధస్వరూపమైన ఎరుకలేనేలేదు". అనే లక్షణానికి వస్తాడు. పరిపూర్ణ తత్వమునితడు ఆకళింపు చేసికొనుటవలన, యీస్థితివీనికి కలుగును గాన "తత్వామృతత్వం"ను ఇతడు పొంది, దానివలన యింకా వుత్తీర్ణత పొంది, తన వునికిలో తాను వుండుటవలన, వానికి "జ్యోతిర్మయత్వం" సిద్ధించినది. ప్రతిప్రాణీతన అస్థిత్వాన్ని నిలుపుకొనుటకు ఎట్లు ప్రయత్నం చేయునో, అట్లే యీతడు తనవున్నతస్థితిలో నుండుటకై ప్రయత్నము చేయును. కానవీనికి జ్యోతిర్మయత్వం అబ్బును.

పిమ్మట వీనికి "చిదీశ్వర భావ అఖిలలీనత్వం" కలుగును. చిత్ స్వరూపమైన, యీశ్వరభావము లేనిది - దేనిలోలేదు? పరిపూర్ణములోలేదు. లీనత్వం అంటే కలిసినదనికాదు లేనిస్థితికి (యీశ్వరభావం లేని స్థితికి) వాడు చేరుకొనుట వలన, అవయవాలు లేనిస్థితికి అనగా తరువాత నిరవయ ఆకాశ స్థితికి అతడు చేరుకొనెను. అలా సంకల్పాలు, అవయవాలు లేకపోవుటవలన భేదము లేక అభేదత్వంలేదు అనగా భేదాభేదత్వం అబ్బినది. అనగా పరిపూర్ణతత్వమునకు చేరువగును.

అన్+ అమృతం = అనామృతం అగును. ఆపరిపూర్ణస్థితి ద్వంద్వములు లేనిదిగాన అదిమృతముకాదు, అమృతముకాదు కాన, అమృతముకాని చైతన్యం-(అమృతత్వం అనగా అధిష్టానచైతన్య పరబ్రహ్మస్థితి)- ఇతడు చేరిన స్థితి, అట్టి అమృతత్వం కాని అతీతస్థితి, ఆత్మకానిస్థితి, ఆత్మాతీతకేవలాత్మ స్థితియందు యీతడు వుండును. జడత్వం వుండదు. చైతన్యవంతుడై వుండును గాని, మృతలక్షణం గాని, లేకుండగ వుండునని చెప్పుట జరిగినది.

ఇక "పరంజ్యోతిత్వం" అనుస్థితికి ఆతడు చేరును. పరంజ్యోతి అనగానేమి? ఇహమునకు సంబంధించిన దానిని జ్యోతిర్మయము లేక ఆపోజ్యోతి అన్నారు. కాని పరమునకు సంబంధించిన జ్యోతి అనగా "జ్ఞానము" అని యిచట అర్థము. ఈ జ్ఞానం యిహ, పరములకు సంబంధించని పరిపూర్ణజ్ఞానము ఈ పరిపూర్ణ జ్ఞానము పొందుటవలన, ఇతడు పరంజ్యోతిత్వం పొందెనని చెప్పుకోవలె.

పిమ్మట నీవూ, నేను అనే భేదాలు ఎరుకయందే వున్నాయి గాని పరిపూర్ణము ఏమీ భేదాలు లేవు. ఉన్నదొక్క పరిపూర్ణమే ఎరుకలేనిదే. చూచినదంతా పరిపూర్ణము.

జీవుడు, యీశ్వరుడు, కుక్క, నక్క అనే భేదములు లేవనే నిర్ణయంలో వుండుట వలన వీనికి సమరసతత్వం సిద్ధించినదని ఎరుగవలె. ఈ స్థితికలిగిన వాని అంతఃకరణదహరాకాశం.

ఈ స్థితిలో వున్న వాడు భేదము, అభేదము వుండని అతీతస్థితికి చేరకుంటాడు. ఇది పరామృతస్థితికి కొంపోవును. జీవేశ్వర జగత్తులకు, అతీతమగు ఏ అఖండ చైతన్యము వున్నదో దానికి అతీతమగు పరిపూర్ణ పరబాహ్యాస్థితి వీడు పొందుట వలన యిది పరామృతస్థితి అన్నారు. ఈ స్థితికి చేరుకున్నవారు పరబ్రహ్మ స్వరూపుడు, స్వయం జ్యోతిత్వం కలవారు అందామా అనుకుంటే అది ఏమి కాదు తనకు తాను వుద్ధరింపబడి ఆస్థితి కలిగినవాడు అగుటవలన "స్వయంజ్యోతిత్వం" అబ్బినదని మనమనుకొనవలెను.

పిమ్మట ఎవరియందూ, దేనియందూ ఆతడు ఆనందానుభూతిని పొందుట లేదు గాన, తనయందే తాను విరాజిల్లుచుండడం చేత "ఆత్మరామత్వం" వీనికి అబ్బినదని తెలిసికోవాలి - అలా అబ్బిన తర్వాత యితడు మహాకాశం (పరాకాశం యేస్థితిలో యున్నదో - ఏమీలేనిస్థితిలో కేవలం బయలు వున్నస్థితిలో - వీడు వున్నాడుకాన దానినే" కైవల్య శరీరస్థితి అన్నారు. దీనియందు వాసము చేయగల వాడు కేవలం పురుషోత్తముడైన వాడే దీనియందు నివసించునుగాన, యీ లక్షణాలు కలిగివున్నాడని తెలిసికొని, మనయొక్క నిజజీవితాన్ని కూడా, అలా ఒకమెట్టు తర్వాత ఒకమెట్టు పైకి ఎక్కుతూ ఆమహాకాశస్థితిని అలవరచుకొని, పరిపూర్ణమునకు, మనకూ వేరుగాని యుక్తితో మన నడవడిని కలుగ జేసికోవాలి. అట్టిస్థితిని గురువరమాత్మ మనకందరకూ కలుగ జేయాలనీ ఆశిస్తూ యీ విచారణ ముగించడమైనది.

జై సద్గురు ప్రభుమహరాజీకీజై

ఓం శ్రీ సద్గురుభ్యోనమః

**కైవల్య శరీరస్థితి - ఆకాశ భువనము - సాంఖ్యవిచారణప్రకారం.**

నిర్విషయ అంతఃకరణ అనగా మహాకాశము దహరాకాశము, నిరవయవ ఆకాశం, సూర్యాకాశము, భూతాకాశం అని చెప్పబడినది. అట్లే నిర్విషయసమానాదులు మొ॥ చెప్పబడినవి. (పట్టిక చూ॥) ఇది 25 తత్వములు ఏవి అని ఆలోచన చేస్తే ప్రత్యేకముగా కైవల్యశరీరము అనేది లేదు మన స్థూలశరీరమందు,

యింద్రియాల రూపకముగా నున్నది. సూక్ష్మ శరీరము, కారణ శరీరమహా కారణశరీరం - యీ నాలుగు శరీరములయందు 25 తత్వముల చొప్పున వున్నాయి. అలానే కైవల్య శరీరంలోనూ 25 తత్వములు లక్షణములు చెప్పబడినవి. కాని ప్రతిశరీరంలోనూ 25 లక్షణములు, యీ 5 శరీరములందూ వున్నాయి. ఈ విచారణంతా మనంచెప్పుకున్నపుడు, యీ యింద్రియములు వున్నట్లే వుంటవికాని వాటియొక్క గతులు మారుతుంటాయి అని చెప్పుకున్నాం. సూక్ష్మశరీరం, కారణశరీరంగా ఎలా మారుతుందని, విచారిస్తే కారణశరీరం, గుణ స్వరూపము, సూక్ష్మశరీరం యింద్రియస్వరూపం మహాకారణ శరీరం లక్షణస్వభావం అని తేలింది. లక్షణాపేక్షః లక్ష్యం అన్నారు. ఒక లక్ష్యాని మనం సిద్ధింప చేసికొనుటకు ప్రయత్నము చేస్తే, ఆలక్షణములు మనకు సిద్ధిస్తాయి. ఒకశరీరంలోవున్న యింద్రియాలు వున్నట్లేవున్నా లక్ష్యములో మార్పు వస్తుంది. లక్ష్య స్వరూపము పొందుటకు మనలోవున్న అంతఃకరణము - ఆకాశపంచకము అంతఃకరణ అనగా అంతరేంద్రియములలో పరిపూర్ణబోధ స్థితివలన విషయవాసననలు లేకుండా పోతాయి. జ్ఞానము మహాకాశము, మనసు దహరాకాశముగానూ, బుద్ధిని నిరవయనాకాశమని, చిత్తమును సూర్యాకాశమనీ, అహంకారాన్నీ భూతాకాశమని చెప్పుకున్నాం.

ఇవి ఎలాసిద్ధిస్తాయి. ఈస్థితికి మనం ఎలా మారగలుగుతాము? దీన్ని సాంఖ్య విచారణ ద్వారా తెలిసికొందాం. చిలకపలుకులుగా సాంఖ్యము నేర్చుకొనడం సరిపోదు. ఇంద్రియములు ఎందుకు యిలానడుస్తాయి, వాటిధర్మమేమి అనే విచారణ చేయాలి. మనోబుద్ధి, చిత్త, అహంకారములను గూర్చి మనము విచారణచేయాలి. ఈ అంతరేంద్రియములలో, అంతఃకరణ అనే జ్ఞానానికి మార్పుకలిగి అది మనో, బుద్ధి, చిత్త, అహంకారాలు గా మార్పుచెందినది. ఇలా మార్పు చెందినదానిని ఎట్లు మలచుకోవాలి. ఈ స్థితికి మనం ఎట్లు చేరుకోవాలి అనే పద్ధతిని విచారణ చేసికోవాలి.

జ్ఞానం అనగా అంతఃకరణ వివిధ భూతముల పంచీకరణవలన మనో, బుద్ధి, చిత్త, అహంకారము లాయెను, తన్మాత్రలవలన అంటే స్థూల శరీరము పంచ భూతములవలన అయినదనీ, సూక్ష్మశరీరము పంచతన్మాత్రలవలన అయినదనీ తెలిసికున్నాము. 5 తన్మాత్రలవలన ఏర్పడిన యింద్రియాల ధర్మాలు ఎలావుండాలి? అంతరేంద్రియముల మూలకము ఆకాశము, ప్రాణాదులకు మూలం వాయువు, జ్ఞానేంద్రియములకు మూలము అగ్ని, విషయేంద్రియాలకు మూలము జలము,

కర్మేంద్రియాలకు పృధ్వీమూలం. ఆకాశమునకు ధర్మము, బయలుగా వుండడము, కర్మము అవకాశమిచ్చుటగదా! వాయువు ధర్మము చలించుట, కర్మము చేర్చుట అగ్నియొక్క ధర్మము వెలుగుట, దానికర్మము కాల్చుట, జలము యొక్క ధర్మము స్నేహించుట లేక పదును చేయుట, దాని కర్మము ముద్దగాచేయుట, భూమియొక్క ధర్మము కఠినముగాయుండుట, దానికర్మము ధరించుట ఇదంతా సాంఖ్యములో చెప్పబడింది,. ఈ ధర్మ, కర్మములు ఎందుకు చెప్పినారనగా మనం తెలిసికొని ఆచరణలో మార్పు చేసికొనుటకు, రామాయణము విని రాముడుయిట్టి వాడు నడక వగైరాయిలావుంది అని తెలిసికొన్నాక, మనము కూడా అట్టి నడవడిని అలవరచు కోవాలి, మనకి పురాణాలప్రవచనద్వారా, నాటక, సినిమాప్రదర్శన ద్వారా పెద్దలు బోధిస్తున్నారు. ఆవుద్దేశ్యం తెలిసికొని, మనంకూడా అట్లునడిచినట్లయిన, రామునివలె పూజనీయులమగుదుమను భావన, మనకు కలగాలి. మనము కూడా అలా నడుచుకొవలెనని వారు ప్రత్యేకంగా చెప్పకపోయినా, మానవుల మగుమనం, మన నడవడిని గూర్చి విచారణ చేసి కోవలెగదా! కాన పరిపూర్ణ తత్వసుధలో:
"నీనడక మంచిగున్నదేమొ తరచిచూచుకో". తరువాత అటుల చూచుకొమ్ము లోని మనసును మాట్లాడు మాటను .. అన్నారు మాట్లాడేమాట, నడక రెండూ మంచిగావుండాలంటే, మొదలు మనస్సు సరిగావున్నప్పుడు మాట, చేత మంచిగ వుంటాయి. మనం అట్లా తరచి చూస్తున్నామా? చేరక పూర్వం వున్నట్లే, ఆ తర్వాత కూడా వుంటున్నారు. తరచిచూచుకొనుటే విచారణ అని అర్థం, విచారణ లేనినాడు మనని ఆవహించేది విచారము, అది మనసు ఊర్ధ్వగతిని పోనీయక, అధోగతికి నెట్టివేస్తుంది. కానపతనము కావద్దని పెద్దలు, పంచభూతముల ధర్మకర్మలు తెలిసికొన్నాక యేయింద్రియము అధర్మ కర్మల ప్రకారం నడుస్తున్నదా అని చూచుకోమన్నారు.

ఆకాశపంచకము అంతరేంద్రియములన్నారు. ఆకాశ ధర్మమగు బయలు పద్ధతిగాన,మన అంతరేంద్రియములు అట్లు బయలుపద్ధతిగా నడుస్తున్నవా అని చూచుకోవాలి. నీఅంతఃకరణలో నీవునీయింటివిషయాలేకాక, గ్రామ విషయాలు, జిల్లా రాష్ట్ర, దేశ, విదేశ విషయాలతో, నీఅంతఃకరణను నింపివేసి వుంచుతున్నావు. పండగసమయాలలో యిల్లు బూజు దులిపి, వెల్లవేసి, దేముని బొమ్మలు విగ్రహాలు, పూజాపాత్రలు కడుగుతున్నాము. పిమ్మట శుచియై పూజకు ఉపక్రమిస్తున్నావు. ఇంట్లోని వ్యర్థపదార్థాలను మునిసిపల్ కుండీలోనో, చెత్త కుప్ప పైననో పడవేస్తాం.

కాని మనం ప్రాపంచిక వ్యవహారములన్నిటినీ మన మనస్సులో నింపుతున్నాం. అంటే మునిసపాలిటీ చెత్తకుండీ, మన అంతఃకరణకు సాటిరాదు. చెత్తకుండీలో, కేవలం మనయింటి వ్యర్థములనే వేస్తున్నాము. కాని మన మనసులో మనయింటి, ప్రక్కయింటి, దేశవిదేశాల చెత్తతో నింపుతున్నాం. ఈ విధంగా వీధి చెత్తకుండీని మించిన చెత్త, మనస్సులో చేరుస్తున్నాం. అలా అయిన మనసు పెద్ద చెత్తకుండీ అయిపోతున్నది. ఈ చెత్తను బయటకు వేయలన్న జ్ఞానం లేదు. అలా బయటవేసినచో, మన మనసు బయలుగా వుండునుగదా! ఈ చింతన లేదు. ఏమీ లేని శూన్యస్థితియే బయలు గదా!

ఏమైనావుంటే అది బయలు ప్రదేశం కాదు. రాళ్ళు, రప్పలు, చెత్తా, చెదారం, లేనిదేబయలు, అలానే మన అంతఃకరణ కూడా ఎలాంటి విషయవాసనాలకు లోనుకాకుండగ, పరిశుభ్రంగ (లేక) బయలుగా వుంచుకోవలె. ఇలా వుంచు కుంటున్నామా లేదా అనే ప్రశ్న మనలో బయలుదేరినపుడు " యీ ఇతరచెత్త నాలోకి వచ్చింది, దీనిని బయటకు నెట్టివేయాలి" అనే భావం వచ్చి మన అంతః కరణను నిర్మలంగా వుంచుకొంటాం. లేకపోతే ఆ విచారణ లేకపోతే మన అంతః కరణ యింకా చెత్తా, చెదారాలతో నిండిపోతుంది. విచారానికి అది తావిస్తుంది. విచారణకలగజేసుకుంటే, విచారము తొలగిపోతుంది. అలానీయొక్క జ్ఞానము అని తెలియబడే అంతఃకరణ, నిర్మలంగా వుండవలె. దాంట్లో ఏమీ వుండరాదు. అట్లు ఏమీ వుండనట్లుయితే అదిమహాకాశముగా రూపొందినదని అనుకోవాలి.

మహాకాశస్థితి అంటే బయలు ఏవిధంగా నిర్మలంగా వుంటుందో, అలానే మనము మన అంతఃకరణను నిర్మలంగా వుంచుకోగలిగితే, మనలోని జ్ఞానమనే అంతఃకరణ మహాకాశమగును.

వాయువు ధర్మము చలించుట, చేర్చుట దానికర్మము, మనసు చలిస్తూనే వుంటుంది. చలించినపుడు మనం ప్రాపంచిక విషయవాసనలవైపుకు మనం వురుకులు, పరుగులూ పెట్తాము. అదికావాలి ఇదికావాలి, అదిలేదు, యిదిలేదు దానిని సాధించకోవాలి మొ॥ సంకల్పాలు వస్తాయి. సంకల్పాలు నెరవేరితే సంతసము, నెరవేరకపోతే దుఃఖము. ఈ సంకల్ప, వికల్పములు మనోవైచిత్రాలు నీసంకల్పం పరమాత్మ నిర్ణయమునకు అనుకూలముగా వుండవలెగాని, వ్యతిరేకము గా నుండరాదు. పరమాత్మ అందరినీ సమముగా సృష్టించి, పోషించి, లయము (చావు) చేసి కొంటున్నాడు. మరైతే కొందరు ధనికులుగా, కొందరు బీదలుగా,

వుంటున్నారే అనే శంక రావచ్చు. పూర్వజన్మలో ఎవరు ఎట్టికర్మ చేసుకుంటే ఆకర్మరూపఫలమును, వారలనుభవింపక తప్పదు. దాంట్లో తేడా వుండవచ్చు. సరే, మన ప్రవర్తన అందరివలె వుండరాదు. గురు బిడ్డవు నీవు కాన నీప్రవర్తన పరమాత్మ నిర్ణయానికే అనుకూలమగు సంకల్పములు చేయవలెను. నీవే పరమాత్మవుకావున నీ సంకల్పములు నిన్ను పతన దశకు కొనిపోవునవి కాక ఉన్నత స్థితిని కలుగచేయునట్లుగా వుండాలి. మహాకాశమే పరమాత్మ స్వరూపం, అని చెప్పినారు. ఘట, మఠ, మహాకాశము అని 3 రకాలు. ఘటాకాశమనగా పిండాండము, పిండాండగతమైనద జీవుడు. మఠాకాశము అనగా బ్రహ్మాండము, బ్రహ్మాండగతమైన యీశ్వరుడు. జీవేశ్వర భేదము లేకపోతే ఏమగును. పెంకులు పగిలిన తర్వాత కుండ గోడ పడిపోయిన తరువాత మఠము అనే యిల్లు లేదు, యింటిలో ఆకాశమూ లేవు. వున్నది వొకేమహాకాశం. ఇవి అడ్డము రావడం వలన వాటికి అయాపేర్లు వచ్చినాయి. అడ్డుతెర తొలగినాక వున్నది వొకటేఅని గోచరిస్తుంది.

విషయ వాసనలు నీనుండి, ఎప్పుడైతే తొలగిపోతాయో, అపుడు మహాకాశ స్వరూపుడే నీవు. నీయొక్క మనసు (దహరం = మనసు) ఆకాశస్థితిలోనే యుండును. అనగా ఎట్టివిషయవాసనలూ వుండవు. విషయవాసనలు లేని మనసే దహరాకాశము. నీతలపులు విషయవాసనామయమయి వుండరాదు. నీచలనము, సత్ సంకల్పములు కలిగిన, మనసుతో వుండాలి ఇప్పుడు ఉన్న మనసు వున్నది కాని అది దహరాకాశ స్థితిలో యున్నది.

ఇక బుద్ధి వున్నది. బుద్ధి నిశ్చయము చేయులక్షణముగలది. చిత్తము చింతన చేసిన తర్వాత బుద్ధి,నిశ్చయము చేయును గదా! వరుసలోమనసు, బుద్ధి, చిత్తం, అహంకారం అని చెప్పుకుంటాం. కాని కార్యమునకు వచ్చునపుడు మొదట మనసు సంకల్పించగా, దాన్ని అమలుపరచాలంటే దిగితే లాభంకాదుగాదా. నష్టమై దివాలా కూడా తీయవలసినవస్తుంది. కొట్టులాభం కొరకుగదాపెట్టుకుంటాం. కాన రంగంలోకి దిగకముందు ఎంతపెట్టుబడి కావాలి? ఎలా ఖాతాదారులను ఆకర్షింపచేసికోవాలి, ఇలాంటి విషయాలు ఆలోచించాలి. అధికలాభం కోరితే, ఖాతాదారులురారు. తక్కువ ధరలపెట్టి, ఎక్కువ సరుకు అమ్మే వర్తకుడు, సరుకు ఒక్కింటికి తక్కువ లాభముతో ఎక్కువ సరుకు అమ్మబడి మొత్తానికి ఎక్కువ లాభం పొందును. ఎక్కువ ధరపెట్టిన తక్కువ తక్కువగా సరుకు అమ్మబడి మొత్తం లాభం తగ్గి నష్టానికి దారితీయవచ్చు. అదే సరుకుకు, ఎక్కువ ధర ఒకచోట, తక్కువ ధరకు యింకొక షాపులోనూ

అమ్ముతూంటే ప్రజలు తక్కువ ధరగల షాపులోనే కొనడం వలన వాని అమ్మకాలు ఎక్కువై చివరకు మొత్తం మీద ఎక్కువ లాభం (ధర తక్కువైనా) పొందగలదుకదా! ఇట్లు జనాకర్షణ వలన లాభం ఎక్కువయ్యెనుగదా! ఇవన్నీ చిత్తం ద్వారా చింతనచేసిన బుద్ధిచే నిర్ణయం చేయబడును. ఇక పరిపూర్ణ భావజ్ఞునిలో బుద్ధి వుండినా కూడా, విషవాసనలకు అవకాశమివ్వలేదు. బయలువలె తన లక్షణముండవలెనని బుద్ధి నిశ్చయించుకొనగా, అది నిరవయ ఆకాశ పద్ధతిగా మారిపోయినది. పిమ్మట ఏమైందనగా యిట్లనే లాభం వస్తుంటే, వాడు యింకా వ్యాపారం అభివృద్ధి చేయాలనుకుంటాడు. చిత్తము చింతన చేస్తూంది. ఇదివఱకు, కుటుంబపోషణ కొఱకు చింతచేసేది, బోధ తెలిసికొనకముందు. నారుపోసినవాడు. నీరు పోయకుండునా అను చింతన చేయువాడు చింతపొందడు. చర్లపల్లి (గద్వాల వద్ద)లో ఒక రైతు పొలానికి నీళ్లూ అవీపెట్టి, కాపలా పెట్టక యింటికి పోయేవాడు. ఇతరుల పొలాల్లో కాపలా వగైరా పెట్టుకునే వారు. అతనిని ఎవరైనా ఏమి అలావదిలేసినావు అని అడుగుతే అన్నీ ఆయనే, (మాగురువు వున్నారులే) చూచుకుంటారులే అని నిర్లక్ష్యంగా వున్నట్లు చెప్పేవాడు. గురువుపైన నమ్మకం లేనివాళ్లు కాపలా పడుతుంటారు. తీరపంటవచ్చాక, కాపలా వున్న వారి పొలాలకన్నా, వీనిపొలంలో పంట అధికంగా లభించింది. గురువు పోయి కాపలా వున్నాడా? లేదే వాని విశ్వాసమే కాపలావుంది. అదే ఆత్మ స్వరూపమై ఎదుటి జీవులలో చొచ్చుకొని, దొంగలు యిటు రాకుండా పంటపండునట్లు చేసింది. కాన వాడు చేసే పని కల్మషము, కల్తీలేని చిత్తముతో వుంటుంది. కాన ప్రకాశవంతముగా నుండును. అనగా "సూర్యాకాశం" వలె ప్రకాశిస్తూయుండును వాని చిత్తం.

తాము అనుకొన్నపనులు, బుద్ధి నిశ్చయమైన తరువాత, యిలా పోతే లాభదాయకం, అలాపోతే నష్టదాయకముఅని తెలిసికొన్నతర్వాత పనులు చేయడం వలన తన సంకల్పమును (ప్రకాశమగుబుద్ధి ద్వారా) అమలు చేయడం ద్వారా జరిపించును. అహంకారం ద్వారా యిది జరుగును. అహంకారం అంటే సామాన్యంగా పొగరుబోతుతనము అని అనుకుంటాం. పొగరుబోతు తనము వొకగుణము, ఇచట చిత్తమువలె. అహంకారం యింద్రియము మాత్రమే. అహం= నేను, తాను అనుకున్నదానికి రూపుయిచ్చే యింద్రియముకాన, ఆకారం, యిచ్చేది. అలా పనికి పూనుకొనేయింద్రియము అహంకారం, అంతఃకరణము, బయలుగా వుండే పనినే చేయునుగాని, విషయాదులలో నిండేపనిని చేయదు కాన దానిని

భూతాకాశము అన్నారు. "భూతాకాశము యచ్చట బయలుగానేయున్నది. ఆకాశం గగనం శూన్యం అన్నారు.గదా! దానిలో (ఆకాశంలో) ఏమిలేదు, అంటే విషయాదులు యేమీ లేవు. అందువలన వాని అహంకారం, ఆకాశంవలెనే ఏ విషయాదులు లేకుండ వున్నది. అట్టి అహంకారమును "భూతాకాశము" అన్నారు. ఈ విధంగా జ్ఞానం మహాకాశ స్థితిలో, మనసు దహరాకాశస్థితిలో, బుద్ధి నిరవయాకాశస్థితిలో, చిత్తము సూర్యాకాశ స్థితిలో అహంకారము, భూతాకాశస్థితిలో యున్నది. కైవల్య శరీరమందు అని సారాంశం. అంటే యిలానీవు చేసుకుంటే కైవల్య శరీరస్థితి నీకు అబ్బుతుంది.వీటిని అనగా అంతఃకరణ చతుష్టయం యేవిధంగా మలచుకొంటే ఆ స్థితికి చేరుతాము అని తెలిసింది. అంటే విషయ రూపమైనదికాక అంతఃకరణను నిర్మలంగా వుంచడానికి మనం ప్రయత్నం చేస్తే ఆనిర్మలస్వరూపమైన దానినే బయలు అని అంటారు. దానినే ఆకాశమంటారు కాన యిచట అన్నిటికీ చివర ఆకాశమనే పేరు వచ్చేసింది. ఇది ప్రయత్న పూర్వకంగా చేస్తేనే అబ్బే లక్షణపద్ధతి. ప్రయత్నం లేక లభించదు.

అలానే నిర్విషయసమానాదులు. ప్రాణ, అపాన, వ్యాన, వుదాన, సమాన అని పిలువబడే పంచప్రాణాలు. వీటిలో మొదటిది వ్యానం. ఇది తనస్వస్థితిలో వున్నపుడు అనగా స్పర్శతన్మాత్ర తనస్వస్థానంలో వున్నపుడు దానిని వ్యానము అన్నారు. ముఖ్యప్రాణము లేక ప్రాణము సకల జీనోపాధులయందూ, జలచరాలయందూ, భూచరాలయందూ, వృక్షజాలములయందూ అనగా పిపీలికాది బ్రహ్మపర్యంతం యీప్రాణం నిండియున్నది. చలించుట ప్రాణ ధర్మం, చేర్చుటకర్మము, అంటే అచటి వానన యిచటకు, యిచటి వాసన అచటకు చేర్చుట దానిపని (కర్మము). దానికి సువాసన దుర్వాసన అనే లక్షణం లేదు. వాసనలు, వాయువును, ఆశ్రయిస్తాయి గాని, వాయువువాటి వద్దకు వెళ్లదు. మామూలుగా అన్నిగ్రామాల యందలి ప్రాణులకు అది సమానంగా ఉశ్వాస, నిశ్వాసములనిచ్చి తోడ్పడుతూంది. ఒకగ్రామంవారికి తక్కువ, వేరేగ్రామం వారికి ఎక్కువ అనిలేదు, దానికి.

ఇట్టిభేదాలు లేని ఆముఖ్యప్రాణస్వరూపమగు వ్యానమునకు అందరూ ఒకటే. ఒకే భావముతో అందరికీ సమభావనతో వాసనలు అందజేయడమువలన దానికి "సమరసత్వం" అబ్బింది వ్యానం. "సమరసతత్వం" గా మారిపోయింది. దీనికి ఆకాశానికీ, అందరూ సమానమే, భేదములేదు. ఆత్మయేతత్వంగా వుంటుందో అట్లే సమతత్వంతో వుంటుంది. సమానవాయువు " ఆత్మారామస్థితికి చేరుకుంటుంది.

తరువాత సమరసతత్వం నకు రూపము అనేది (అగ్నితత్వం) వచ్చిచేరితే అన్ని వుపాధులకు రూపములు కల్పితమగును. పిండరూప,. అండరూప, స్వేదరూప, జరాయుజరూపంగా వుండనీ - ఎలావుండనీ, దానికొక ఆకృతికావాలి కదా! అయితే దీనియందు యేలక్షణమున్నదన, అసలగుసమరసతత్వమునకు, అగ్ని తత్వముచేరడం వలన "చిదీశ్వర భావ అఖిలలీనత్వం"గా వుదానవాయువు మార్పుచెందును.

సమానవాయువు మనము తినిన ఆహారమును జీర్ణముచేయును. వ్యానం శరీరమంతటావుండి స్పర్శలను ఎరిగించును. ఉదానం, మన చేతవైఖరీ పలుకును పలికిస్తుంది. వైఖరీ పలుకులు - వాక్కు అగ్ని తత్వం కాన యిచ్చట కూడా వుదాన వాయువు అగ్నితత్వమును చేరడం వలన వాకరూపాన్ని కల్పిస్తుంది. ఊహలు - చిత్రకారుడు బొమ్మ గీయాలను కున్నపుడు ప్రథమంగా మనసులో బొమ్మను వూహించు కుంటాడు. తర్వాత కట్టు బొట్టు, ముఖం, కనుబొమ్మలు, చేతులూ, కాళ్ళు, అలంకరణ ఎలావుండాలి అని వూహించి, రంగు కుంచెతో తాను వూహించిన చిత్రానికి రూప కల్పన చేస్తాడు. అలానే మనప్రబోధవిషయంలో గురువుచేత శిష్యుడు వింటున్నాడు. దానిని గట్టి పరుచుకొనుటకు ఒకరికొకరు మననం చేసికుంటున్నారు. అలా చెప్పడం వలన చిత్తును, యీశ్వరభావంతో నింపుకొని తర్వాత అన్నిటియందు తానేవున్నట్లు తెలియజేస్తుంది. దీనినే "చిదీశ్వర భావ అఖిల లీనత్వం" అంటారు.

ఇచట అమూల్యమగు సమభావత్వం వుండడంవలన, దానిచే యేర్పడిన ఆకారనిర్ణయవ్యవహారం "ఆత్మారామ"స్వరూపకంగా వుండును. జలతత్వం చేరగా అది యీశ్వర సంబంధ చిత్తుగా మారును. అంతటికీ ఆధారస్వరూపమే నేను అను భావానికి అది లీనమగును. దాన్నే "చిదీశ్వరభావఅఖిలలీనత్వం" అన్నారు. మనం శ్వాస 12 అంగుళాలు తీసికొని 24 అంగుళాలు వదిలినాం. మాట్లాడినమాట ఆవాయువులోనే కలిసినదిగా! సంకల్పముతో మీరడిగితిరి ఎట్టి సంకుచిత్వం లేక బోధ జరుగుచున్నది. ఇది, అఖండభావనతో, వస్తువులమూలమును గ్రహించి, తత్వము తెలుపుట జరుగుచున్నది.

కాన చెప్పేవాడు ఈశ్వరుడు, వినేవాడు జీవుడు, చెప్పడం చిత్ అనే అంతః కరణ ద్వారా, యీప్రబోధజరుగుతుంది. కాన యీశ్వరభావయుక్తమై చైతన్యం కలవాడై, అఖిలంనకు అనగా అందరకూ సమానమగు బోధచెప్పడం జరుగు తూండడమువలన, వుదానమూలకంగా జరుగుచున్నదిది. ఉదానం యొక్క లక్షణంచేవాక్యానకు, పదమునకు రూపమిచ్చును. బెల్లము అనుపదం వాడగానే

ఇట్లు జ్యోతిర్మయత్వముగా నున్నదానికి నిర్విషయ సమానాదులు చేరినాయి. అందువలన అది యిహపరాలకు ప్రకాశమిచ్చే లక్షణము కలిగి అది "పరంజ్యోతిత్వం" స్థితిపొందినది. ఆకాశమునుండి కదా శబ్దము వచ్చును. అది నిర్విషయ అంతః కరణ వలన వాయుచలనం వలన, దహరాకాశముగా మారెనని పైన చెప్పుకున్నాం. నిర్విషయ సమానాదులు అంటే వాయుతత్వము గదా! ఈ వాయుతత్వం వచ్చి దీనికి చేరినపుడు "పరంజ్యోతిత్వం" దీనికి అబ్బినది.

అదే జ్యోతిర్మయత్వంనకు జలము అనగా స్నేహతత్వము కలియగా (వొత్తి వెలగాలి అంటే నూనె స్నేహము అది చేయాలి) ఏర్పడిన స్థితి పరిశీలిద్దాం. స్పర్శలు త్వక్‌ను వచ్చి తాకిన అది గ్రహించును. అలాగే జిహ్వాపై పడితేనే, రుచిని గ్రహించును. వాసన నాసికేంద్రియమును తాకితేనే గంధమును గ్రహించును. ఇట్లు శ్రోత్రం, త్వక్, జిహ్వా ఘ్రాణము - యీ 4 ఆ విషయాలను శబ్ద, స్పర్శ, రస, గంధములను గ్రహించును. కాని చక్షువు మాత్రము దూరమున నున్న దృశ్యమును కూడ గ్రహించును. గ్రహించి అంతఃకరణములో నిలుపుకొనును. కాని మిగిలినవి వస్తువులు తమ దగ్గరకు వస్తేనే గ్రహిస్తాయి. వస్తువులు దూరాన వున్నా చక్షురింద్రియము తన చూపును పంపి, అచట ఎవరున్నారు, తనకు కావలసినవాళ్ళాకానివారా? ఒకవేళ కాని వాళ్లు, కొత్త వాళ్లు అయినా, వాళ్ళు అందంగా కనిపిస్తే వాళ్ళు ఎంత అందంగా వున్నారు అనుకుంటాం. వస్తువులనైనా, వ్యక్తులనైనా అట్లు చూచి ఆ రూపాన్ని అంతఃకరణ అనే కెమెరాలో బంధిస్తాము. ఉన్న చోటునుంచే, దూరానవున్నప్పటికీ, ఆ వస్తు రూపాన్ని లాక్కుని, మన అంతః కరణలో నిల్పుకునే ప్రత్యేకత ఆ చక్షురింద్రియానికి వుంది. ఆకాశ నిర్ణయమైన నిర్విషయమిపుడు చక్షురింద్రియమునందు, యీ స్థితిలో వున్నది, వుండడంచేత, అది అందరినీ వెలిగించే జ్యోతిస్వరూపమైనది. దానికి రసతన్మాత్రచేరుటవలన, నూనె వేస్తే ప్రమిద వెలిగినట్లు, ఆపోజ్యోతిత్వం దీనికి అబ్బును. అనగా జిహ్వా ఆపోజ్యోతితత్వంగా మారిపోతుంది. ఇది రసేంద్రియము గాన, రసగ్రహణ, విషయవాసనామయము కాకుండగ, వుండినపుడు విషయవాసనలు అంటుకొనవు గాన అది ఆపోజ్యోతిస్వరూపముగా రూపొందును.

విషయవాసన లేని గంధము, యీ జ్యోతిర్మయత్వం నకు చేరినట్లు అయినచో అది జగత్‌జ్యోతిగా మారును. ఈ ఘ్రాణము జగత్‌కు వెలుగునిచ్చును.

పిమ్మట నిర్విషయరసాదులు. రస స్వరూపము - జలము - వీని లక్షణము

తడపుట, ముద్ద చేయుట. బోధామృతం - పరిపూర్ణ బోధామృతం చేత యిది తడుపును మన అంతఃకరణను. అట్టి అంతకరణ విషయాలచే తడుపబడినచో అది మృతస్వరూపము దాల్చును. విషయరహిత బోధ వినుటవలన అది అమృతస్వరూపమగును. ఇట్లది 'అమృతత్వ'స్థితి పొందును.

ఈ అమృతత్వమునకు, నిర్విషయ అంతఃకరణచేరినచో అది పరామృ తత్వముగా మార్పు చెందును. ఇది నిర్విషయ సమానాదులతో చేరి అనామృత చైతన్యత్వం కలుగును. అంటే అమృతము లేని చైతన్యస్థితి. అమృత్వం లేకపోతే మరణమునకు లోనగును కదా! మనమంతా మర్త్యలోకవాసులం. సురులంతా అమృతలోకవాసులు. ఎప్పటికీ 20 యేండ్ల యౌవనంతోనే దేవతలు ప్రకాశిస్తారు. మనం వయసును బట్టి మారుతాం. బాల్యమునుండి కౌమారము దాని నుండి యౌవనము, దానినుండి మధ్యవయసు, దానినుండి వృద్ధాప్యం మనకు, జననము తర్వాత వరుసగా కలుగుతాయి. వృద్ధాప్యము తరువాత మరణం. మరి వీడు కైవల్యశరీరిగదా! ఇక్కడనే శాశ్వతంగా వుంటాడు అని చెప్పగలమా? ఎవ్వరూ శాశ్వతం కాదు. రాముడు, కృష్ణుడూ వగైరా దేముళ్ళనేవారు శాశ్వతంగా లేరే? ఎవరూ పర్మనెంటుకాదు. కాస రాకడా, పోకడా తప్పదు కాబట్టి యిక్కడ చైతన్యం వుంటుంది. తననూ, తనను ఆశ్రయించినవాళ్ళను పోషించవలెగాన, అదియొక విధ్యుక్తధర్మముగా తలచి చేయాలి. వానియందు ఆసక్తి పెంచుకొనక అనాసక్తుడుగా వ్యవహరించాలి. ఇదే అనామృతచైతన్యము.

చైతన్యము ఆసక్తి కలిగించేది. దాన్ని పోషించేది అమృతము. ఇక్కడ చైతన్యం వుండీ కూడా లేనిదే. అది నిర్విషయస్వరూపంగాన, విషయాలు లేక పోవడం చేత యిది దేనినీ పోషించేది కాదు. తాను, తానుగా వుండే లక్షణంతో వ్యవహరించుటచే, అట్టి చైతన్యం గలవానికి అనామృత చైతన్యము అబ్బెనని తెలిసికోవాలి.

ఎప్పుడైతే యీ అనామృతత్వమునకు అగ్ని స్వరూపమగు, నిర్విషయ రూపాదులు చేరునో, అగ్ని (జ్ఞానరూపంగాన) తత్వంలో బోధబాగా జరుగును, తత్వవిచారణబాగాచేసి, అందరూ మననం చేసికొని, "తత్వామృతం" స్థితిపొందుదురు. తాను తెలిసికొనినది తన సోదర శిష్యులకు, గురువైతే శిష్యులకు, బోధామృతమును అందజేయగలిగివుండవలె. ఇట్లు అందచేసినపుడు, ఆ గంధతన్మాత్ర 'బోధామృత తత్వం'గా మార్పు చెందును.

గంధతన్మాత్ర, సువాసన, దుర్వాసన అనే నిర్ణయం చేస్తుంది. అలా ద్వంద్వ లక్షణం యీ గంధ తన్మాత్రయందు కలదు. కాని ఉన్నది పరిపూర్ణము మాత్రమే. అను భావన కలిగిన అదే అద్వయత్వం. ఉన్నది పరిపూర్ణము, లేనిది లేనెరుక అనే యీ రెండు వాక్యాల విషయాలపైనే బోధ ప్రారంభం అగును. అయిన తర్వాత వీనికి, నిర్విషయ అంతఃకరణ చేరుటవలన బేధము, అభేదము అనే విషయము లేకుండా అతీతత్వం వీనికి అబ్బును. ఆకాశలక్షణమగు అంతఃకరణ, నిర్విషయ అంతఃకరణగా అగుటవలన 'బేధ, అబేధ అతీతత్వం' యిపుడు అబ్బును. వీని వాక్, వుపదేశము అన్నీ కూడా యిహమునకు, పరమునకు అతీతమైన బోధలో వీడు వుండిపోతాడు. ఆ వాక్ "భేదాభేదాతీత్వం" అని చెప్పడం జరిగింది. తరువాత యీ అద్వయత్వానికి (పృధ్వీతత్వమునకు) నిర్విషయ సమానాదులు చేరుటచే అభేదా భేదత్వం అబ్బును. ఎరుకను గురించి మాట్లాడినా, పరిపూర్ణమును గురించి మాటలాడినా భేదము లేదు. భేదభావము లేక వున్నది వున్నట్లు తెలియజేయును. కావున యీ స్థితిలో వానికి భేదము లేదు, అభేదము లేదు. రెండూ అభేదములే కాని, రెండింటి విషయములో భేదము లేకుండ చెప్పడము వలన, ఒకదానియందు భేదము వుంచి చెప్పడం అనే లక్షణం లేకపోవుటవలన యీ స్థితి లభించింది.

తరువాత స్థితి భేద, అభేదత్వం. ఎప్పుడైతే నిర్విషయరూపాదులు వచ్చి, యీ ద్వయత్వమును చేరునో యీ స్థితి అబ్బును. అంటే ఎరుకను ఏమి చేయాలీ అనగా, లేనెరుకను విడవాలి. పరిపూర్ణమును స్వీకరించాలి కావున ఎరుక యందు భేదము, పరిపూర్ణముపట్ల అభేదత్వము కలిగి వుంటాడు. ఎరుకను నిరసించాలి అంటే భేదత్వము వ్యక్తము చేయాలిగదా!

దీక్షితులవారి వద్దకు తురుకవాడొకడు వెళ్లెనట. వారికి పంది అంటే అసహ్యము. ఆ పేరు నోటితో పలుకక దాన్ని 'గలీజ్ జాన్వర్' అంటారు. తురకతో దీక్షితులవారు నీకు పంది అంటే యిష్టమా అని అడిగారు. "లేదు స్వామీ అది గలీజ్ జాన్వర్, దానిపెరెత్తవద్దు" అని అతడనెను. దీక్షితులవారు వానితో "ఎరుక గలీజ్ జాన్వర్, దాన్ని నీ దగ్గరకు రానిస్తావా?" అన్నారు. అతడు ఎలా రానిస్తాను అంటాడు. అపుడాయన "ఎరుక అనేదే గలీజ్ జాన్వర్ అనగానే", "దానినేనెపుడు రానీయుసు" అని ఆ తురక అన్నాడు. "అంతే యీ బోధ ఫో" అన్నారు దీక్షితులవారు. ఎరుకను నిరసన చేయుటకు ఆయనీ వుపాయం అవలంబించారు. ఇలా వానికి భేదభావము కలిగించారు.

ఎరుకను అలా భేదభావంతో విసర్జించినట్లు, పరిపూర్ణమును విసర్జిస్తే ఎట్లా? పరిపూర్ణ భావమును సిద్ధింపచేసికోవడానికి, ఎరుకను విసర్జించడము అంటే భేదాభేదము అబ్బిందని అర్థం.

ఈ అధ్వయత్వమునకు, నిర్విషయ రసాదులు చేరుటవలన - రసాదులు అంటే గుహ్యము - అంటే విషయములు లేకపోవుటవలన 'గుహ్యాత్ గుహ్యోతమం" అని గురుగీతలో చెప్పినట్లు నేను చెప్పినది రహస్యములలో కెల్ల రహస్యమైనది అన్నారు. Superlative degree వంటిది. భేదము positive అయితే, ఈ విద్య, విద్యల్లోకెల్లా రాజవిద్యయే కాక వాటిల్లోకెల్లా గుహ్యము (రహస్యమైనది) అన్నారు గీతలో. ఇది అంతఃకరణము పైన ఆధారపడినదిగాన; అది మారిపోవుట వలన, దానికి వచ్చి చేరునటువంటి రసము నిర్విషయమై, అఖండ స్వరూపముగా మారును. అనగా యోని, విశ్వయోనిగా రూపొందును. భగవంతుడనగా భగము కలిగినవాడు. భగవతి అనగా భగము కలిగినది. విశ్వయోని అనగా సర్వజగత్‌కు అది మాతృస్థానముగా మారుటవలన దానియందు తర తమ భేదములు, వారు గొప్ప, అది గొప్ప, వారు చిన్న అది చిన్న అనే భావములే వుండవు. అన్నిటికీ జన్మస్థానము అగుటవలన విశ్వయోనికి 'అఖండత్వం' సిద్ధించినది.

కావున, మన వాక్ భేదాభేదాతీత్వంగా మారినది. ప్రాణం అభేదాభేదత్వంగా మారినది. మన పాదం భేదాభేదత్వంగా మారిపోయినది. గుహ్యం అఖండత్వంగా మారగా, గుదము 'అధ్వయత్వం' మార్పు చెందినది.

మన 25 యింద్రియాలు యీ తత్వాలను మన విచారణద్వారా, మనం సంపాదించుకోవలె. విచారణ ద్వారా ఆ లక్షణాలను రూపొందించుకొంటే సామాన్య/ సూక్ష్మ శరీరం కైవల్య శరీరముగా రూపు చెందును. దాంట్లో వాసము చేయువాడగు నీవే, వుత్తమ పురుషుడవు. ఈ లక్షణములు అందరకూ వుండవు గాన నీవు పురుషోత్తమునిగా మార్పు చెందుతావు. అట్టి పురుషోత్తమునకే యీ కైవల్య శరీరము నివాసయోగ్యమయినది. అలా పరిపూర్ణ స్థితినొందినవాడు కైవల్య శరీర నివాసి, వాడు శక్తి ద్వయములకుగాని, క్షరాక్షరములకు గాని అంటనివాడు. కేవలం విచారణ ద్వారానే యిట్టి స్థితిని పొందుటకు అవకాశము వుంది. అందుకొఱకే సాంఖ్యము తెలిసికొని, ఆయాభూత ధర్మము ప్రకారము నేను నడుచుకొనుచున్నానా అని విమర్శ చేసికొనాలి.

అద్దె యింటిని శుభ్రంగా వుంచుకొనకపోతే అది పాడయి, యజమాని

ఆగ్రహం నకు గురి అవవలసి వచ్చునట్లు, ఈ శరీరమనే అద్దె కొంపను నిర్లక్ష్యము చేస్తే మనకే ఇబ్బంది కాన దీన్ని పవిత్రంగా, ఆరోగ్యంగా, నిర్మలంగా వుంచుకోవాలి. 25 తత్వములతో కూడిన యీ శరీరాన్ని చక్కగా వుంచుటకై విచారణచేసి, వున్నత స్థితికి కొనిపోవాలి. అపుడే కైవల్యశరీరము పొంది, పురుషోత్తములై, పరిపూర్ణమునకు, మనకూ వేరుగాని స్థితిలో మన జీవితాన్ని గడుపుతాము. అపుడు, "లేని" మనము, "లేకపోవడం" ఖాయం. వుంటేనే జనన మరణాలు. లేనివానికి జనన మరణాలే లేవు. అట్టి స్థితిని, విచారణవలన అశరీర (లేక) కైవల్యస్థితి ద్వారా పొందగలందులకు గురుమూర్తి మనలను అనుగ్రహించాలని ప్రార్థిస్తూ, ముగిస్తున్నాను.

– జై శ్రీసద్గురుప్రభుమహారాజ్‌కీ జై!

## రాకపోకలేని రాజమార్గము

శ్లో॥ ధ్యానమూలం గురోర్మూర్తిం – పూజామూలం గురోఃపదం
మంత్రమూలం గురోర్వాక్యం – ముక్తిమూలం గురోఃకృపా॥

అనగా గురుమూర్తి రూపమునే ధ్యానించవలెను. అతని పాదములనే పూజించ వలెను. గురువు నోటినుండి ఏమాటవస్తే అదే మంత్రము. వారి కృపయుంటేనే ముక్తి లేకపోతే లేదు. అని 'గురుగీత' నొక్కి వక్కాణించుచున్నది. ఈ గురుగీత దత్త సాంప్రదాయకులకు మూలగ్రంథము. గురుశిష్య న్యాయము దత్త సాంప్రదాయకుల వలననే ప్రచారము లోనికి వచ్చినది. ఆ సాంప్రదాయకులందరు, సిద్ధ పురుషులు. ఈ గ్రంథమును ప్రతిపాదించిన వారు పరమేశ్వరుడు. దీని నాతడు పార్వతికి లోక కల్యాణార్థము బోధించెను.

అటులనే శ్రీమదచలర్షి రామదుగు శివరామ దీక్షితాచల గురుపీఠ సాంప్రదాయ కులకు ఈ గురుగీత నిత్య పారాయణ గ్రంథము. లోకమునందు గల శివభక్తులు కేశవభక్తులు శివకేశవులను ఆరాధించుటయందు ఆసక్తి చూపుదురు. కాని వారు బోధించిన బోధను ఆచరించరు. ఈ పద్ధతి ఎట్లుండునన పెండ్లి చేసికొంటాము కాని మేము కలసి కాపురము చేయమన్నట్లుగా నుండును. కాని ఆచలులు గురుగీతయందు చెప్పిన రీతిగా వారి అనుగ్రహమును బడయుటకు "ఓం అస్యశ్రీ గురుగీతా మాలామంత్ర్య భగవాన్ సదాశివ ఋషిః విరాట్ చందః శ్రీ గురు పరమాత్మాదేవతా హం బీజం సఃశక్తిః సోహం కీలకం శ్రీ గురు కృపా ప్రసాద సిద్ధ్యర్థే జపే వినియోగః" అను సంకల్పముతో గురుకృప కలుగుటకు ఓంకారముతో కూడిన గురుమాలామంత్రమును జపము చేయుదురు.

గురుగీతయందు సృష్టికి మూలమైన అధిష్ఠాన చైతన్య పరబ్రహ్మ తత్వమునకు గురు తత్వమునకు భేదము లేదు. అదియే ఇది. ఇదియే అది. "బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవతి" అను శృత్యానుసారము శిష్యుడు బ్రాహ్మీస్థితి పొందును. "ఎరుకబ్రహ్మ మనియె నిలశంకరార్యులు – తెలివి బ్రహ్మమనుచు తెలిపె వ్యాసు – ఎరుక తెలివిలగతులు ఎరుగడు వేమన – విశ్వదాభిరామ వినురవేమ!" అని వేమన గారి భావానుసారము తాను మరుపునుండి ఎరుకస్థితికి చేరుకొనును. అప్పుడతనికి పరిపూర్ణ పరబాహ్యా మును దర్శించు భాగ్యమబ్బును. అట్టి భాగ్యమును కలుగజేయునదే ద్వాదశి మంత్రము. దానిని గురించి గురుముఖతః బోధవిని, దానిని కనవలెను. కనిన తాను లేకపోతేనే రాకడ పోకడ లేకపోవునని బోధించునదే షోడశి, అందువలన బోధను వినవలెను పరిపూర్ణ పరబాహ్యామును కనవలెను. చివరకు తాను లేక పోవలెను దీనినే విను – కను – చను అని అందురు. అందువలన ద్వాదశి, షోడశి మంత్రములకు ఓంకారము లేదు. గురుముఖతః వెలువడుట చేత మంత్రము లని అని అన్నారు. తానే లేకపోయినపుడు మంత్రములను మననము ఎవరు చెయ్యాలి? చేసేవారు లేరు కాబట్టి చివరకు విడరా మంత్రములు రెండు అని శ్రీకృష్ణ దేశికుల వారుద్బోధించిరి.

సరే! ఇది ఇట్లుండని ఒకే సాంప్రదాయమందు భిన్న భిన్న పోకడలు గోచర మగుట శోచనీయము.

శ్రీ శివరామదీక్షితులవారు 1. ద్వాదశి; 2. షోడశి అని రెండు మంత్రములు మాత్రమే చెప్పిరి. పండితారాధ్య పండిత శివానంద స్వాములవారు కూడ తమ అచలబోధ శిఖామణియందుకూడ రెండే మంత్రములు చెప్పిరి. వారి పరంపరలో చేరిన రాయచూరు బాలారాం పంతులుగారు తమ ద్విపదార్థ దర్పులలో కలలో దోచిన శరీరములు యెలాగో అలాగే మూలం లేని గుర్తెరిగే శరీరం యేమీ లేదు అనునదే షోడశిమంత్రమని వ్రాసిరి. పరశురామ నరసింహ దాస స్వాములవారు భద్రాద్రి రామశతకమునందు 103వ పద్యమందు

1. ఈ యుత్తబట్టబయలేమి లేదనువాడు రాగిగాడతడు విరాగి గాడు (ద్వాదశి)
2. యెరిగే శరీరంబు యేమిలేదనువాడు జ్ఞాని గాడతడు యజ్ఞానిగాడు(షోడశి)

   104వ పద్యములో

1. ఈ ఉత్తబట్టబయలేమి లేకను స్వతాపరిపూర్ణమై యుండు ప్రకృతిలేదు (ద్వాదశి)
2. కలలోను గనుగొన్న గజమేమిలేనట్లు యెరిగే శరీరము యేమి లేదు (షోడశి)

   అట్లే భాగవత కృష్ణదేశికులవారు ఆ మంత్రయుగము దెల్పెద నేమముతో

దలుపుముత్తదీ బట్టబయల్ యేమీలేదని పలికిన యీ మంత్రమె ద్వాదశాక్ష రింకోటి వినుమీ యెప్పుడు నోట యివి మరువకనుమీ! యీ మూలములేని గుర్తెరిగే శరీరము యేమీలేదని యంటే యిదే షోడశాక్షరి" అని రెండే రెండు మంత్రములు నుటంకించిరి.

దీక్షితులవారు కలలో దోచిన శరీరము యెలాగో అలాగే మూలము లేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు. అని దృష్ట ద్రాష్టాంతముతో వినజెప్పిరి. అయితే, కొందరు పెద్దలు దృష్టాంతమును పంచదశిగాను ద్రాష్టాంతమును షోడశిగాను చెప్పుచున్నారు. కొందరు ఖండము ఎరుకగాను అఖండము పరిపూర్ణముగాను చెప్పు చున్నారు. మరికొందరు నా నిజరూపము ద్వాదశి నారూపము షోడశి నా వ్యవహారం పంచదశి అని చెబుతున్నారు. ఉపమానము ఉపమమేయము రెండు కలిస్తేనే సంపూర్ణ వాక్యమగునని ఆ పెద్దలు అర్థము చేసికొనలేదేమో? అసమాపక క్రియతో వాక్యము సంపూర్ణము కాదు. "కలలో దోచిన శరీరము ఎలాగో అలాగే" అను మాటవలన వాక్యము పూర్తికాదు. అర్థము కూడ కాదు ఏలాగు? అని ప్రశ్నిస్తే అలాగే! అను జవాబు సంపూర్ణభావం ఇవ్వలేదు కదా! అపుడు ఉపమేయమగు మూలంలేని యీ గుర్తెరిగే శరీరం ఏమీ లేదు" అనుమాట చేర్చితేనే ఆ భావం సరిపోవును.

ఈ మధ్య మా సోదరుడు పోలోజు వీరాచారిగారిచే వ్రాయబడినదని ప్రచురింప బడిన సాంఖ్య విచార పాఠ్యగ్రంథమందు 1. నాల్గు ద్వాదశులు; 2. నాల్గు షోడశులు అని వ్రాస్తు 3. నాల్గు పంచదశి అని కూడ వ్రాయబడినది. నాల్గు ద్వాదశులు అని వ్రాస్తు ఐదు ద్వాదశులు అల్లే అయిదు షోడశులు వ్రాసి పంచదశి మాత్రము నాల్గు వ్రాయుట జరిగినది. అతడు వ్రాసిన కందపద్యములలో మూడు మంత్రములు వ్రాయగా గురుమాలా మంత్రముతో కలిసి మూడు మంత్రాలని తలంచితిని కారణమేమన "అన్ని మంత్రములు ఉత్తది చేసే అచలమంత్రమోరీ" అని ఒక తత్వములో నుండుటచే అలా భావించితిని అదికాదని పంచదశి అని ఇప్పుడర్థమైనది. శ్రీవీరాచారిగారు నేరుగా మా గురువు కడకు రాలేదని పూర్వ గురువు కడ సంశయము తీరక మా గురువు కడకు విచ్చేసిరని తెలిసినది. వారే కాదు హేమాహేమీలెందరో మా గురువు గారి శిష్యులందరు అనగా సుప్రసిద్ధులైనవారందరు అలా వచ్చిన వారేనని తెలుసు, అయితే దీనిని బట్టి చూస్తే కొందరికి పాత వాసన పోలేదని వ్యక్తమగుచున్నది.

సరే! అలా వుండని గురు కృప కలుగజేసికొనుటకు ఓం కారముతో కూడిన

గురుమాలామంత్రమును సిద్ధింపజేసికొని ద్వాదశి షోడశి మంత్రముల ద్వార పరిపూర్ణ బోధను విని, కని, తాను లేకపోవుటే రాకపోక లేని రాజమార్గమని గ్రహించెదము గాక!

## పరిపూర్ణబోధ

శ్రీమదచలర్షి రామడుగు శివరామ దీక్షితులవారు తమ అచలగ్రంథమందు ద్వాదశీ భావమును శరీర రహిత ప్రకరణమని, షోడశి భావమును భ్రాంతి రహిత ప్రకరణమని నుద్బోధించిరి. వీనిని గురించి మన మాలోచించవలెను. "సకల దేశాలయందు సకల కాలాలయందు సకల వస్తువుల యందు చంచలము లేక నున్నదే పరిపూర్ణము. అదే అచలము. అదే బట్టబయలు అని ద్వాదశిభావము, ఈ ఉత్తబట్టబయలు ఏమీలేదు అని తెనుగులో ద్వాదశాక్షరి మంత్రం చెప్పబడినది. కలలో దోచిన శరీరం యెలాగో అలాగే మూలం లేని యీ గుర్తెరిగే శరీరం ఏమీ లేదు అని షోడశిభావం. ఉపమానమును వదలితే మూలం లేని యీ గుర్తెరిగే శరీరం యేమీ లేదు అని అన్నారు.

శ్రీ పరశురామసీతారామ స్వామి సోదరులు నరసింహ దాసస్వామి గారు పరిపూర్ణమున్నదని అన్నారు. శ్రీ కృష్ణదేశికేంద్రుల వారు ఇది తప్ప ఏమీ లేదు. అని ద్వాదశిని గూర్చి దెలిపిరి. శ్రీ భూమానంద మందిప్పల హనుమంతరావుగారు తమ తత్వములో "కనుము ద్వాదశియు కలదనుచు, వినుము షోడశియు లేదనుచు అనుము జగమంత మిథ్యనుచు చనుము నేనీవు లేదనుచు అని అనిరి. కాని వారి మనుమలు అని అనతగినవారు.

| | | | | |
|---|---|---|---|---|
| 1. | ద్వాదశి : | ఉత్తది | బట్టబయలు | యేమీలేదు |
| 2. | షోడశి : | మూలంలేని | యీ గుర్తెరిగే శరీరం | యేమీలేదు |
| 3. | పంచదశి: | కలదోచిన ప్రపంచం శరీరం | మేల్కొంటే | యేమీలేదు |

మూడు మంత్రాలు వ్రాస్తు మొదటి మూడుపదములు అర్థమున్ను కొనకు మూడు పదముల అర్థమున్ను ఏమీలేదు అని తేలుచున్నది. మధ్యపదములు వున్నట్లు తోచడమే భ్రమ యని గురుసూచన. చివరకు చక్రార్థమందు వున్నట్టు తోచడమే భ్రమ యని యన్నారు. అనగా సర్వశూన్యమని వారి భావన. ఇది సాంప్రదాయంలో అసాంప్రదాయ లక్షణం.

ఇక నాలుగు ద్వాదశుల భావమును గురించి విచారిద్దాము.

1. స్థూల శరీరం - భూతాకాశము - ఆనందాంగము ఏమీలేదు అని భావము - ఇది శూన్యద్వాదశి
2. సూక్ష్మశరీరము - సూర్యాకాశము - చిన్మయాంగము ఏమీలేదు అని భావము - ఇది లఘుద్వాదశి
3. కారణశరీరము - దహరాకాశము - చిద్రూపాంగము ఏమీలేదు అని భావము - ఇది కారణ ద్వాదశి
4. మహాకారణశరీరము - పరాకాశము - శుద్ధ లింగాంగము ఏమీ లేదు అని భావము - ఇది మహాకారణ ద్వాదశి

**ఈ నాల్గు లక్షణాలు లేనిదే బట్టబయలు లేక పరిపూర్ణం ఇదే వున్నది. ఇది గురుసూచన ద్వార కనవలె.**

1. విశ్వుడు - మలినపుటెరుక - విరాట్ - ఏమీలేదు - శూన్య షోడశి
2. తైజసుడు - మిశ్రపుటెరుక - హిరణ్యగర్భ - ఏమీ లేదు - లఘు షోడశి
3. ప్రాజ్ఞుడు - కేవలపు ఎరుక - అవ్యాకృత - ఏమీ లేదు - కారణ షోడశి
4. ప్రత్యగాత్మ - పరాఎరుక - పరమాత్మ - ఏమీ లేదు - మహాకారణ షోడశి

**కలలో దోచిన శరీరాలు మేల్కొంటే ఏమీలేనట్లు పరా, కేవల, మిశ్రమ, మలిన స్వరూప అఖండపుటెరుక ఏమీ లేదు. అని గురుకృపాపాత్రుల సిద్ధాంతము.**

నాలుగు శరీరాలు : 1. స్థూల; 2. సూక్ష్మ; 3. కారణ; 4. మహాకారణ శరీరములు.

నాలుగు అవస్థలు : 1. జాగ్రత; 2. స్వప్న; 3. సుషుప్తి; 4. తురీయము

నాలుగు అభిమానలు : 1. విశ్వ; 2. తైజస; 3. ప్రాజ్ఞ; 4. ప్రత్యగాత్మ

మూడు నాల్గులు పన్నెండు లక్షణాలతో నుండునదే ఎరుక. ఈ పన్నెండులేనిదే పరిపూర్ణం.

1. నాలుగు దిక్కులు; 2 నాలుగు మూలలు; 3 క్రింద; 4 మీద; 5 లోన; 6. బైట మొత్తం పన్నెండు స్థానములలో లోపము లేకుండా నున్నదే పరిపూర్ణము.

కర్మేంద్రియాలు = 5 + జ్ఞానేంద్రియాలు = 5+ప్రాణ పంచకము = 5+జ్ఞానము మొత్తం 16 కళలతో నున్నదే ఎరుక.

1. జాగ్రతలో జాగ్రత్త; 2. జాగ్రతలో స్వప్నం; 3. జాగ్రతలో సుషుప్తి; 4. జాగ్రతలో తురీయము = 4.

1. స్వప్నంలో జాగ్రత; 2. స్వప్నంలో స్వప్నం; 3. స్వప్నంలో సుషుప్తి; 4. స్వప్నంలో తురీయము = 4

1. సుషుప్తిలో జాగ్రత; 2. సుషుప్తిలో స్వప్నం; 3. సుషుప్తిలో సుషుప్తి; 4. సుషుప్తిలో తురీయము = 4

1. తురీయంలో జాగ్రత; 2. తురీయంలో స్వప్నం; 3. తురీయంలో సుషుప్తి; 4. తురీయంలో తురీయం = 4

నాలుగు నాల్గులు 16 కళలు కలిగినదే ఎరుక. ఈ 16 లేనిదే పరిపూర్ణము.

### 4. అవస్థల నిర్ణయము

1. జాగ్రత : మనస్సు దశేంద్రియ వ్యాపారమును చేయుటయే జాగ్రత
2. స్వప్నము : మనో సంకల్ప వ్యవహారమే స్వప్నము.
3. సుషుప్తి : కేవలము ప్రాణవ్యవహారమే సుషుప్తి.
4. తురీయము : అవస్థాత్రయములకు సాక్షిగా నుండుయే తురీయము.

## షోడశ అవస్థల వివరణ

### జాగ్రత

1. జాగ్రతలో జాగ్రత : తెలిసికొనిన విషయములు మరువకుండుట
2. జాగ్రతలో స్వప్నము : తెలిసికొనిన విషయములు సరిగా జ్ఞాపకము లేకపోవుట.
3. జాగ్రతలో సుషుప్తి : తెలిసికొనిన విషయములు మరచిపోవుట.
4. జాగ్రతలో తురీయము : తెలిసికొనిన విషయముల యొక్క వస్తు జ్ఞానమును కలిగియుండుట.

### స్వప్నము

1. స్వప్నజాగ్రత : కలలో కనిన దానిని మరువక తెలియజేయుట.
2. స్వప్నంలో స్వప్నం : కలలోని విషయములు జ్ఞాపకముండీ లేకుండుట.
3. స్వప్నంలో సుషుప్తి : కలలో కన్న విషయములు మొత్తం మరచుట.
4. స్వప్నంలో తురీయము : స్వప్న విషయములు కల్లయని బ్రహ్మ నిష్టయందుండుట.

### సుషుప్తి

1. సుషుప్తిలో జాగ్రత : నిద్రవలన కలిగిన సుఖమిట్టిదని తెలిసికొనుట
2. సుషుప్తిలో స్వప్నము : నిద్ర సుఖమిట్టిదని నిర్ణయించుకొనలేకపోవుట
3. సుషుప్తిలో సుషుప్తి : నిద్రసుఖమిట్టిదియని తెలియక యుండుట.
4. సుషుప్తిలో తురీయము : నిద్రవలన కలిగిన సుఖము సత్యజ్ఞానానందము కాదని గ్రహించుట.

## తురీయము

1. తురీయములో జాగ్రత : బ్రహ్మ నిష్టయందున్నను ఆకలిదప్పులను గ్రహించుట.

2. తురీయములో స్వప్నము : బ్రహ్మ నిష్ట కలిగియు ప్రపంచ వ్యవహారముల యందు అధికశ్రద్ధ లేకయుండుట.

3. తురీయములో సుషుప్తి : బ్రహ్మ నిష్ట యుండి ప్రపంచ వ్యవహారములయందు కించిత్తు కూడ నిష్ట లేకుండుట.

4. తురీయములో తురీయము : అవస్థాత్రయములకు సాక్షిగా నుండి తనకన్న ఇతరమేమి లేదని తనయందు తానై యుండుట.

## అచలోయం సనాతనః

శ్రీ మదచలర్షి రామడుగు శివరామదీక్షితీయ బోధ గురుశిష్యన్యాయంగా జరుగు చుండును. గురుడు + శిష్యుడు ఇద్దరు కలిస్తే ద్వైతమనబడును. అంతేగాక ఉన్న పరిపూర్ణమును లేని ఎరుకను గురించి బోధింపబడును. బోధ రెండింటి గురించి యుండును గాన ద్వైతమే యని యనవచ్చును. కాని కలలో దోచిన శరీరములు యెలాగో అలాగే మూలంలేని యీ గుర్తెరిగే శరీర రూప ఎరుక ఏమీలేదని నిరసింపబడును కావున ద్వైతమని కూడ అనలేము.

అద్వైతమని అందమా? అని అంటే! బ్రహ్మ సత్యం జగన్మిథ్యా యని వారందురు. త్రాడు పాముగా తోచబడినట్లు యీ బ్రహ్మమే జగత్తుగా తోచబడినది. కాని జగత్తు మిథ్యాస్వరూపము అనగా ఉన్నది ఒకటైతే ఉన్నది ఉన్నట్లుగా కాక మరొక రీతిగా తోచబడినదని దాని భావము. దానికి ఎండమావులను, కుందేటి కొమ్మును, వంధ్యాసంతును, రజ్జుసర్పభ్రాంతిని ఉపమానములుగా చెప్పి జగత్తును మిథ్యా స్వరూపమని బ్రహ్మమును మాత్రము సత్యమని నిరూపింతురు. అందుకు గాను వారు లక్షణత్రయము అనగా జహర్లక్షణము, అజహర్లక్షణము జహదజహర్లక్షణముల చేత నిరూపించుటకు పూనుకొందురు. జహద జహర్లక్షణమందు బంగారు నగలు గాను, మన్ను కుండలు గాను మార్పు చెంది తోచబడినట్లుగాను, బ్రహ్మము జగత్తుగా తోచుట మాత్రమే గాని కుండలు, నగలయందు నామ రూపములను తీసి వేయగా మన్ను, బంగారము మాత్రమే మిగిలినట్లుగా జగత్తు యొక్క నామరూపములపై గల భ్రాంతిని వదలి చూచితే బ్రహ్మము మాత్రమే శాశ్వతముగా నుండునని తెలిసికొమ్మని వారు బోధింతురు. ఎన్ని చెప్పినా ఏమి చెప్పినా అద్వైతము ఏకబ్రహ్మ వాదమని తేటపడినది. అలాగే అచలము అది తప్పా మరేమి లేదు. దానికి పేరు

లేదు అది అంతటా కలదు అని బోధింపబడుటచేత. ఇదీ ఏకబ్రహ్మ వాదమగుటచేత దీనిని మహా అద్వైతమని కూడ సాంప్రదాయక పెద్దలన్నారు.

కాని బంగారము నగలుగా మారినట్లు, మన్నుకుండలుగా మారినట్లు అచలము లేక పరిపూర్ణము నందు ఏ విధమైన మార్పు రాదు. వున్నది వున్నట్లు స్థిరముగా శాశ్వతముగా నుండును కాన అద్వైతమని కూడా అని అనరాదు.

పోనీ విశిష్టాద్వైతమని యందామా? దానియందు జీవుడు సత్యం, ప్రకృతి సత్యం, దేవుడు సత్యం. అని చెప్పి ప్రకృతి మాత అనుగ్రహం పొందితే ఆమె ప్రక్కకు వైదొలగితే ఈ జీవుడు ఆ దైవ దర్శనం చేసికోగలుగుతాడు. ఆ దైవము యొక్క చూపు జీవునిపై పడగానే ఈ జీవుడు ఆ దైవ స్వరూపం పొందుతాడు అని చెబుతారు. పరిపూర్ణ బోధయందు పరిపూర్ణమొకటి లేని ఎరుకనే దొకటి అని చెబుతూ ఈ ఎరుక ద్వంద్వ రూపముగా అనగా ఎరుక మరుపులుగా నున్నదని బోధ చేయుదురు. బోధ యున్నంతవరకు గురువు, శిష్యుడు బోధ యీ మూడు. ఆ మూడు అనగా పరిపూర్ణం – ఎరుక – మరుపు యుండుట చేత విశిష్టాద్వైతం లేక త్రైతము అని అనుటకు వీలు కలదు. జీవుడు దైవ స్వరూపం పొందినటుల యీ మరుపు ఎరుక రూపం పొందును కాని పరిపూర్ణం లేక అచల రూపం పొందలేదు. కాన ఇది విశిష్టాద్వైతం అని అని కూడ అనరాదు.

"కళిక కర్పూర న్యాయవత్" గురువు అతని బోధ ముగియగానే వారి మధ్య గల గుర్తు లేకపోవును. అపుడు గురువు శిష్యుడు వీరున్నను లేనివారే. ఎరుక మరుపు యీ రెండు లేనివే యగును. కావున దీనిని త్రైతము లేక విశిష్టాద్వైతము అని కూడ అనరాదు.

ఎరుక లేనిది ఎరుక కానిది ఎరుక మీరిన తత్వమది. దానిని ఏమనవలె? ఇవన్నీ అనేదే నేను. ఈ నేను లేనిది నేను కానిది నేను మీరినది. ఈ సృష్టికి మూలమైన ఏ అహం కలదో అదే నేను. అది లేని స్థితి సాధకునికి చేకూరును. అందుకే బ్రహ్మై వాహమస్మి అహం పదార్థరహితః అని సిద్ధాంత వాక్యము. అందుకే శ్రీ భూమానంద హనుమంత రాజయోగీంద్రులవారు, "ఉన్నది గురుడన్నది. నేకన్న దంతటనున్నదీ ఉన్నదేమో వున్నది. నేనన్నదే లేకున్నది" అని అన్నారు. అంతకు పూర్వపు పెద్దలు "ఏమనీ యన రాని తత్వమదీ ఆ తత్వమెప్పుడు ఎరుకకందదు ఎరుగరానిదదీ" అని అన్నారు. అందుకే 'అచలోయం సనాతనః' అని శ్రీకృష్ణ భగవానుని ఉవాచ.

# పరిపూర్ణ రాజయోగము

మనము యేపనులు చేయాలన్న మన శరీరంతో చేయుదుము. శరీరం అంటే జ్ఞానేంద్రియ పంచకముతో కర్మేంద్రియ పంచకముతో చేయుదుము. ఈ పనులన్నీ ప్రాణాధారముతో చేయుదుము. ప్రాణముంటే ఈ యీ శరీరం శివం. అది లేకపోతే శవం. అందుకు ఆహారం లేకపోతే మనలో శక్తి శూన్యం. ఈ ఆహారమునే అన్నం అని అంటాము. ఆదిలో మానవుడు మృగతుల్యుడు. పశుతుల్యుడు. అందువలన అతడు మాంసాదులను తృణాదులను ఆహారంగా పుచ్చుకొనేవాడు. అన్ని జీవరాసులకంటే మానవులకు సుఖలాలసత్వము భోగలాలసత్వము అధికమగుటచే స్వార్థమును పెంచుకొన్నాడు. తన సుఖము కొరకు ఇతర ప్రాణులను వంచించుట నేర్చుకొనెను. అంతేగాక తోటి మానవుడిని కూడ వంచించుటకు వెనుదీయలేదు.

ఇలా వంచించి సుఖించగలనని యనుకొనుట అదొక భ్రమ. ఇది మంచిపనేనా? అనే ప్రశ్న అతనిలోనే రాగా? మంచిదికాదని సమాధానము అతనిలోనే వచ్చినది. కోటి విద్యలు కూటికొరకే కదా? ఈ తినే తిండి ఎలాంటిదై యుండాలి? దానిని ఎలా ఆర్జన చేసికోవాలి? అనే ప్రశ్నరాగా! ఒక నియమము నిబద్ధత ఏర్పరచుకొన్నాడు. దానినే (1) **అన్నయయ పురుషయోగమని** అచల ఋషులు పేరు పెట్టారు. దీనికి మూడు సూత్రములు ఏర్పరచారు. అవి యేవన. 1. ఋత బుక్కు; 2. హిత బుక్కు; 3. మిత బుక్కు.

ఎ) ఋత బుక్కు అనగా ఒకరికి అన్యాయం చేయకుండా, నీతోటివారి మేలు కోరుకొంటూ ద్రవ్యార్జన చెయ్యి. ద్రవ్యమంటే ధనమని ఇప్పుడనుకొంటాము. ఒకప్పుడు వస్తువులు, తినుబండారాలు కట్టుకొనే గుడ్డలు వగైరాలు కూడ ద్రవ్యమే. అలా వానిని న్యాయబద్ధంగా సంపాదించిన ఆహారమునే భుజించుమని చెప్పుట ఋత బుక్కు.

బి) బ్రతుకడానికే ఆహారం కాని రుచులకొరకు కాదు. అన్ని వున్న దానిని సంతోషము గాను నీ ఆరోగ్యమునకు భంగము కాని దానిని తినవలెను. అలా తినుటయే హిత బుక్కు.

సి) ఆహారము రుచికరముగా నున్నదని మితము మీరి మెక్కరాదు. ఆయాస పడరాదు. కొవ్వును పెంచుకోరాదు. ఈ శరీరం ధర్మసాధన కొరకేనని తలంచి మితముగా తినుటయే మిత బుక్కు.

ఈ త్రివిధ పద్ధతుల ద్వారా ఆహారము పుచ్చుకొనుటయే అన్నమయ పురుష

యోగము. ఇలా చేస్తే శరీరము ఆరోగ్యముగా నుండి ధర్మసాధనకు సహకరించును.

(2) ఇక **ప్రాణమయ పురుష యోగము**ను గురించి ఆలోచిద్దాము. ఈ ప్రాణము 5 రూపాలుగా మారి ఆయా స్థానములో నుండి ఆయా పనులను చేయు పంచెవన్నెల రామచిలుక అని తెలిసికొన్నాము. అసలు ఆకలి దప్పులు ప్రాణ ధర్మము ఈ అన్నమయ పురుషయోగ సాధన వలన ప్రాణము యొక్క వ్యవహారము చక్కగా నుండును. 72వేల నాళ్లను సమముగా నుడుపును. నియమబద్ధమైన నడక నడచుట వలన ప్రాణశక్తి పెరుగును. శ్వాస గతిపైన దృష్టి యుంచి ఉచ్ఛ్వాస నిశ్వాసలు చక్కగా జరుగుచున్నట్లు చూచుకొనవలెను. నీరే ప్రాణాధారమని "సుమతి" శతకములో నన్నది నిజమే కావున రుచికరములగు పానీయములను పుచ్చుకొనక మత్తు పదార్థములు పుచ్చుకొనుటవలన ప్రాణ హాని కలుగును కాన పరిశుద్ధమగు జలమును అధికంగా పుచ్చుకొంటూ ప్రాణం నష్ట కాకుండా చూచుకోవలెను. ఉద్రేకములకు లోనుకాకుండా మితసంభాషణ నియమబద్ధమైన నడకను కలిగియుండుటే ప్రాణమయ పురుష యోగము.

(3) మనము తినే ఆహారముపైన మన మనస్సు ఆధారపడియుండును. అన్నమయ పురుష యోగ సాధన చేసిన వాని మనస్సు విపరీత ఆలోచనలకు లోనుకాదు. మనస్సు విషయ వాసనలకు లోను కానీయరాదు. విషయములు విషముతో సమానము. అసలు స్వార్థము మదిలో జొరబడనీయరాదు. నేను బ్రహ్మను కావలెనను కోర్కె బంగారు సంకెళ్ళలాంటిది. దేహాత్మ బుద్ధితో మెలగుట ఇనుపసంకెళ్ళయితే. దీనిని నడుపువాడు శివ స్వరూపుడు అని తలంచుట పశువును త్రాటితో బంధించుట లాంటిది. ఈ త్రివిధ బంధములకు లోనుగాక పరిపూర్ణ పరబాహ్యము నందు నాకు మూలము గాని స్థానము గాని ప్రవేశించుటకు చోటుగాని లేదు అనే నిర్ణయమందు భ్రమ ప్రమాదులకు లోను కాకుండానుండుట. ఇంద్రియములకు విషయములు ఆహారము. విషయలోలత్వమునకు మనసు పోకపోతే అది నిరాహార స్థితిలో నుండును. అప్పుడు దేహి దేహిగానే యుండును. దేహాత్మ బుద్ధి నశించును. ఈ దేహికి మూలము లేదను నిర్ణయమందు మనస్సు నుంచుకొనుటయే **మనోమయ పురుష యోగము**.

(4) మనస్సును కోతిగాను దొంగ పశువుగాను పెద్దలు పోల్చి యున్నారు. విజ్ఞానము లేనివానిని అజ్ఞాని అని అన్నారు. ఈ మనస్సును బుద్ధి నియంత్రణ చేయగలదు. అందుకే శరీరమును రథముగాను, గుఱ్ఱములను ఇంద్రియములు గాను, మనస్సును అర్జునునిగాను, బుద్ధిని శ్రీకృష్ణునిగాను కఠోపనిషత్తు యందు

చెప్పియున్నారు. మనస్సు శుద్ధ మనస్సుగా మారినను గతి తప్పుట స్థితి చెడుట తప్పదు. అందుకే సీతారాములు మరీచిక రూప స్వర్ణ లేడిని చూచి భ్రమించి దుఃఖమునకు లోనగుట జరిగినది. అందువలన బుద్ధి వలన నిరంతర విచారణ చేస్తు మనస్సును అదుపులో నుంచుకోవలెను. విచారణలేకపోతే విచారముండును. కాన దృక్ దృశ్య వివేకము, నామరూప వివేకము, పంచకోశ వివేకము, పంచభూత వివేకము, తత్వ వివేకము ద్వారా సృష్టి మాయయైతే సృష్టికి మూలమైన వస్తువు పెనుమాయ యని తెలిసికొని ఏ భ్రాంతికి లోను గాకుండుట **విజ్ఞానమయ పురుష యోగము.**

(5) ఒకటి నిత్య సత్యవస్తువు. రెండవది అనిత్య అసత్యస్తువు. అని గురుముఖతః తెలిసికొనవలెను. నిత్య సత్యవస్తువునే పరిపూర్ణము - అచలము - బట్టబయలు అను ముఖ్య పేర్లతో పిలుతురు. అది నామ రూప రహితమైనది. అది అంతటా నున్నది. అది దేనికి మూలము కాదు. అది దేనిని ముట్టుకోదు. దేహము లేనిది దేహాకారము కానిది. నిత్య సత్యవస్తువు.

మరొకటి స్వయంభూ అనగా తనకు తానే వచ్చి దేహాకారము పొంది అన్ని దేహములకు తానే మూలమై విశ్వజగత్ రూపములు జీవేశ్వర రూపములు ధరించి రాకడపోకడలు కలిగినది లేని ఎరుక లేక మూలం లేని గుర్తెరిగే శరీరమని వస్తు నిశ్చయముగా గురుమూర్తి ద్వారా తెలిసికొని తెలిసికొనిన తెలివిని గురుమూర్తి చరణార విందముల కర్పించుటయే పరిపూర్ణ రాజయోగము. కళిక కర్పూర న్యాయవత్ గురుడు గురునిచే విన్న బోధ గుర్తును కూడ వదలినవాడు వున్నా లేనివాడే! పాము వదలిన కుబుసము వలె కాలిన నులక, కాలిన కోక వున్నట్లు తోచినా లేనివాడే. అట్టి స్థితిని కలిగియుండుట లేక పొందుటే **పరిపూర్ణ రాజయోగము.** ఇట్టి స్థితి కలిగినవాడిని ఏమనవలెను. ఏమియూ అనరాదు. అన్నవారికే దోషము పుణ్య పాపములు వారికే కాని వీనికేమియు లేదు.

శ్రీ సద్గురు మహారాజ్‌కో జై జై జై